# MANORAMA

BY

M. SUBBARAYALU NAIDU



PUBLISHED BY

N. MUNISAWMY MUDALIAR

Proprietor "Ananda Bodhini"

SOWCARPET, MADRAS.

1930.



[Price Annas 10.

శ్రీ

# మాయారాక్షసుని జయించిన

# మనోరమ.

సహృదయ హృదయానురంజక నవల.



ఇది,

మ. సుబ్బరాయలు నాయునిచే

వ్రాయబడినది.

[రెండవకూర్పు]

నా. మునిస్వామి మొదలియారువారి,

ఆనందబోధిని ముద్రణాలయంబున

ముద్రింపఁ బడినది.

చెన్నపురి.

1929

10 అణాలు]　　కాపీరైట్ రిజిష్టర్డు.　　[పోస్టేజి ప్రత్యేకం.

# తొలి నుడువు.

సుఖమును దుఃఖము నొక్కవస్తువునందే దేశకాలాది భేదంబులచేఁ దోచునని యెల్ల ఱెఱింగిన విషయంబె. అట్టులనే గ్రంథముల యందును బ్రవర్తించును. గ్రంథములలో గొందఱికి సుఖముగ నుండునది మఱికొందఱికి దుఃఖముగ నుండును. ‘‘లోకోభిన్నరుచిః’’ అను నార్యోక్తి వ్యర్థమే. అయినను దేశకాలాది భేదంబుల ననుసరించి వ్రాయంబడిన గ్రంథమగునేని సుఖప్రాయంబుగనే యుండుననుట యార్యుల సమ్మతంబగుటంజేసి కొన్ని నవలలవలె నిదియు దేశ కాలాది భేదంబుల ననుసరించి యనేకోపకథలతో వ్రాయబడినది. కావున నిదియందఱికి సుఖోపేతం బగునని మా సమ్మతము.

ఇందలి కథానాయిక యాడుదైనను తన మగనికి సంభవించిన గోడులనుదీర్పఁ బురుషలక్షణంబయి సర్వార్థ సాధకంబగు ధైర్యంబు నవలంబించి తనమగనితో పాటుగ నితరులకు సంభవించిన దుఃఖములఁ బోనడంపుచుఁ దన యొన్నికను నెఱవేర్చికొనుట చదువువారల కాశ్చర్య మొసంగకుండదు. కథాసందర్భమున నీతులనుదేలించు నుపకథలును ప్రధానకథను మించినదియై యాబాలగోపాలంబగు జనంబులకు మార్గదర్శినియై యుండుగాతమని భగవంతు వేవిధంబుల స్తుతించెదము.

ముద్రణాదుల సంభవించు లోపంబుల “గచ్ఛతఃస్ఖలనం క్వాపి’’ యను నాయ్యంబును మదింబూని మన్నింపఁ బండితులు ప్రార్థితులు.

ఇట్లు:

కవిజనపాదధూళి. మ. సుబ్బరాయఁడు.

శ్రీ

శ్రీమద్వేంకటరమణగురవే నమః

# మాయారాక్షసుని జయించిన

# మనోరమ

—o—

శా. శ్రీరంగద్ధృదయాబ్జ! నీదు కరుణా • రేఖా సముద్భూత త
త్త్వారంభ త్కవితా విచిత్రమతి నై • యారంభముం జేసితిం
దీర న్నిల్పవె యీ మనోరమ కథ • న్దోషంబు లగ్గింపఁగా
నారా మేలని వేంకటేశ్వర! నినున్ • ధ్యానింతు నెల్లప్పుడున్.

సురభియై సులభియై ప్రజలకు మోదంబుల నించి ఖేదంబుల నడంచి శత్రుగోత్ర మదంబు లడంచి మించుచు నించు విలుకానింబోని భూజాని మదనశేఖరుండను పేర మణిపురంబునుఁ బరిపాలించుచుండు. అతనికి సర్వావయవ సుందరియై మనోరమ యను పట్టమహిషి యింద్రాణిం బోలియుండు. వారొక్కదినంబు ఇంద్రవనంబును గుందించు నందంబుగల తమ నందవనంబున కేగి మనోల్లాసంబుగఁ గేళివిలాసంబుల భాసిల్లుచుండిరి. మనోరమయుఁ దనపతి యిచ్చచొప్పున విహరింపుచు నాతోటయందలి పువ్వులఁ గోసి యెత్తుకొని నిజనాథుతోడ నగరికి వచ్చెను. రాజు తన రాణి సార్థకనామయగుటకు మది మెచ్చుకొనుచుండును.

రాణియు నిజపతి సార్థకనాముండై యునికిం జేసి యాతనియెడ బద్ధానురాగయై యుండె. సతీపతుల మనంబు లొకటిగా లేని కాపురంబు పెడదలదాపురంబుగదా? స్త్రీపురుషుల యనురాగ వృద్ధికి రూపవయోధనంబులు కారణంబు లని పెడంగులు దలంతురు. అదినిజమైనచో రూపవయోధనం బులనటె ననురాగము ననిత్యమగును. దంపతులకు నట్టి యనురాగ ముండినయెడ నది త్వరలో నశించుననుటకు సందియంబేమి? దాని ననురాగంబని యనువా రెవ్వరు? ఈ మనోరమా మదనశేఖరుల వల పట్టిదిగాదు. అది యవ్యా జమై నెగడు చుండెను. ఇటుల నిరవద్యంబుగ వారిప్రేమలు కొంతకాలంబుజరిగెను.

మణిపురవాసు లందఱు నొకనాడు రాజసమ్ముఖంబున కేతెంచిరి. వందనవందనాదికంబుల జరిపించిరి. రాజు నుత్తరువుఁబొంది యర్హాసనంబుల విశ్రమించిరి. వారి యందొక పెద్దకాపు లేచి నిలిచి రాజునకు నమస్కరించి "మహాప్రభో! మీకరుణాకటాక్షంబున మేమిదివఱకు నొక యంగదయు లేక సుఖంబున నుంటిమి. మీ ధర్మ ప్రభుత్వంబున బాధలు లేవని నమ్మియుంటిమి. ఆ మా నమ్మిక వమ్ముగాగ నిపుడొకటి పుట్టెను. దాన మామనంబులు పరితాపంబు నొందుచున్నవి. మా గోడు నివర్తించువారలు మీకన్న నొరు లెవ్వరు? "దుర్బలస్య బలం రాజా" యను లోకోక్తి మీ కెఱుంగనిదియే?

మాదుఃఖంబులఁ దీర్చి మమ్ముఁ గాచు భారంబుమీఁది. పాల ముంచినను నీటముంచినను మీరేగతి" యని యూఱకుండెను.

రాజాపలుకుల విని యదరిపడి, "ఏమి! యేమీ! మీకట్టి విపత్తు నావలనం గలిగెనా? నా సేవకులచేఁ బుట్టెనా? వేవేగ నెఱింగింపుఁడు. లేక సామంతుల చేష్టితమో! పరరాజుల ఘాకయో? యేదో తెలుపుఁడు. ప్రజల దుఃఖంబుల నడంపక యుదాసీనుం డగురాజునకు సౌఖ్యంబు లెక్కడివి? రాజ్యమెక్కడిది? ప్రజలం దన సుతులభంగిఁ గనుంగొనుచు వారి యుల్లంబులు పల్లవింప నొనర్చువానిని రాజనం జెల్లునుగాని యితరునకు నేనే? అయ్యలారా! మీరలు మోమోట ముంచక కలమాటఁ జెప్పుఁడు. రాజనేరంబును మొగంబునెదుట నెటుల బలుకనగు ననకుఁడు. పరిపాలకుల తప్పొప్పులం గని ప్రజలు వచింప, దాని విమర్శించి తమ తప్పుల నొప్పులుగఁ జేయఁ బ్రయత్న పడనిరాజేల? మీరెందులకు భయంబునొందకుఁడు. వేవేగఁ దెలుపుఁడు" అనియె.

"రాజోత్తమా! దేవరవాను పలికినవానిలో దేనివలనను మాకు నిక్కట్టు కలుగలేదు. నీతి శాస్త్రధురంధరులగు మంత్రిపరిషజ్జనంబులతో యోచించి యొక్కొక కార్యమును జేయు తమ ధర్మ పరిపాలనంబున నేరంబు లుండునే? ఆజ్ఞాపాలకులగు మీ సేవకులక్రమంబునకుఁ గడంగుదురనుట

కుందేటికొమ్ము. మామాట సత్యము సుమ్ము. నరేంద్రా! ఇక మీ పేరన్న గుహాలయందు డాగు పరరాజులవలన మాకేమి యెగ్గు? ఒకవేళ వచ్చిరిపో! వంటయింటఁ గుందేలు సొచ్చినతీఱుగదా? అట్టి యిక్కట్టు లొక్కటియుఁ బెరసిన వారము కాము. ఇప్పు డదేమి చిత్రమో! నేల యీనినటుల లెక్కకు నెక్కుడై వన్యమృగంబులు బలిసియున్నవి. మా పంట పైరుల నన్నింటిని రూపుమాపుచున్నవి. చెఱకుల నాట వాసలేదు. గడ్డదినుసులఁ బైరుసేయ నోపిక లేదు. అడవి కేఁగిన గొడ్లు ఇంటికివచ్చు ననరాదు. గాలి కాసపడి బయటఁ బరుండుమన్న లేకున్నది. పైన కంకులు పట్టుగదా యని యేమఱియుండిన మఱునాడే యా మడి చక్కగా దున్నినట్టు లుండును. ఈ యేనుగులు ఒంటిగాండ్లు పులులు మన్నులు మొదలగు వన్యములు మమ్ము గాఱించుచున్నవి. మాగోడునుదీర్చి మాకుఁ గనుపాఱ నన్నంబు బెట్టుము. పైరులను పాడుచేసికొని మేము తినునదియేమి? మీకిచ్చునది యేమి? మఱుచటి పైరునకై యుంచునదియేమి? సర్వంబు నెఱింగిన తమకు మేము చెప్పున దేమున్నది? సార్వభౌమా! చిరంజీవివై వర్ధిల్లుము. మాకష్టంబులనెల్ల డుల్లింపుము. ఇక మీపాదమాన. మామానంబుఁ గావకున్న మాసల వదలము. ఇచ్చటన యుసురులం దొఱంగెదము." అని యైకకంఠ్యంబుగఁ జెప్పిరి.

రాజదివిని, "కాపులారా! మీర లలజడి నొందకుడు. ఈమృగంబులచే మీర లధికనష్టంబును బొందితి రని మీపలుకులచే నెఱింగితిని. ఇది మొదలు మూఁడేండ్లవఱకుఁ దీరువఁ గట్టక సుఖింపుడు. ప్రజలం గష్టపఱచి తీయుధనం బింధనంబు గాక మఱియేమి? నేఁడే వేటకై తరలెద. మృగంబుల రూపుమాపెద. ఇఁకపై మీకిట్టి కష్టంబు లుఁడవు పొండు. నే మాటతప్పిన రండు. సుఖంబుండు" డని వారికి ధైర్యంబు చెప్పెను. ప్రజ లది విని యుప్పొంగి "జయ! విజయీభవ" యను నాదంబులతో సముద్రంబు ఘోషించుచందంబున నాడుచుఁ బాడుచు గరతాళంబుల వేయుచు దమతమ యిక్కల కరిగిరి.

రాజు మృగయాసన్నాహంబులఁ జేయ మంత్రులకు నెఱింగించి, మూఁడేండ్ల తీఱువను మన్నించునట్లు కట్టుదిట్టంబు సేసెను. రాజాజ్ఞ మేఱకు వలలు బోను లెత్తికొని డేగలు కుక్కలతోఁ దప్పెటలం గొట్టుకొనుచు వేటకాండ్రు మూఁగిరి. రాజు ప్రయాణభేరి వేయించి ధనుర్బాణతూణీరధరుండై యపరధర్మరాజువలె శుభముహూర్తంబున నొక పంచకల్యాణి నెక్కి యడవికేగెను. మృగయులు అడవి నలుప్రక్కలు చుట్టుకొని వలలుగట్టి బోనుల నిలిపి ఱోదములు త్రవ్వి, తప్పెటలు గొట్టుచు మృగంబుల భీతిల్లఁ జేసిరి. వన్యమృగంబులదరి మూలకొక్కటై పఱువం దొడంగెను. తోడి

వారలును రాజును నామృగంబులను జిత్రవధంబు గావించిరి. వానియం దొకలేడి వారి బాణంబులకు లోనుగాక వలం బడక బోనులం జిక్కక యోధంబుల దిగఁబడక తప్పించు కొని యతివేగంబునఁ బారెను. మదనశేఖర మహారా జదిగని దీని నెటుల నైనఁ జంపవలయునని నిశ్చయించి, గుఱ్ఱమునకు ఛవుడిచ్చి వెనువెంటఁబడెను. అపుడు ఆ నర పతి మృగంబువెంటఁ బడిన శివునివిధంబున దేజరిల్లెను. జింకయు గాలివేగమున నేలఁ గాలూనక యెగురు చెగురు చేసి యొక విజనస్థలంబున మఱువయ్యెను.

అచ్చట అంతఃపురంబున సుఖ నిద్రఁజెందుచుండిన రాణి మనోరమ ఉషఃకాలమున నొక కలను గని దిగ్గన మేలుకనియె. చెంతనున్న చెలులం జేఱి, "ఓ నా ప్రాణ పదంపు వయస్యలారా! నేనిప్పు డొక కలం గంటిని. అది మొదలు నామదిఁ గలవరంబు నొందియున్నది. దాన మూడునది కీడో మేలో యెవరెఱుంగుదురు? నామనోహ రుఁడు పరిజనంబులతో వేట కేగెను గదా! అతం డచట నొక జింకను దఱుముకొని యెటకో పోయినట్లును, పరిజనం బులు రాజును వెదకి కానక తిఱిగివచ్చినట్లును, నే నతని వెదకికొని యరణ్యంబుల నల్లాడి ధైర్య సాహసంబులఁ జూపి నాప్రియునిఁ దోడితెచ్చినట్లును నొక కలఁగంటిని. మీరు చెలులని మీతో నంటిని. నామదిని వెతగంటిని. నేనిక నేమి

చేయును. నీవెత నెటుబాయుదు. నాప్రియు నెటురోయుదు నని గోడుగోడుమని దుఃఖింప సాగెను. దాదులు అదరిపడి లేచి మనోరమకు ధైర్యంబులు సెప్పిరి. "రాణీ! పల్లవపాణీ! అలినీలవేణీ! నీవేల యడలెదవు? రాజున కేకొంతయు లేదు. స్వప్నములు నిజమని తలంచువా రెవరు? కలలు కాకతాళీయంబులు. జరిగిన జరుగును. జరుగకుండిన నుం డును. దీనికై సంకోచింప నగునే? అదియునుగాక కలలు సంకల్పానుసారములు. కొంత యోర్చి యుండుము. రాజు గారు పరిజనంబులతో నరుదెంతురు. దిగులొందకుము" అని యెంత జెప్పినను వినక కలవరంబుననే యుండెను.

రాజు రాఁగలఁడు, రాఁగల డని పరివారంబులు ఎంత సేపు చూచినను, రాజు రాఁడయ్యెను. రాజున కేమి సంభ వించెనో యని దిగులొందిరి. మూలకొక్కరై వెదుకసాగిరి. అంద ఱొక్కచో మూగిరి. ఏమేమి యని విచారించిరి. రాజుగారి పోబడి తెలియమని చింతించిరి. ఇక నేమి చేతు మని యూరికిఁ దిఱిగిరి. మణిపురంబునుఁ బ్రవేశించి జరిగిన వర్తమానంబును దమ్ము విచారించు మనోరమ కెఱుకచేసిరి.

కల నిజమగుటను గనిన మనోరమ చిత్తం బెట్టుండె ననుట చదువరు లూహింపఁగలరు. వినినతోడనే హా! యని మూర్ఛఁ జెందెను. చెలులు శైత్యోపచారంబులఁ జేయఁ దేఱెను. "ఇదేమి వింత! కల నిజమాయెనే! నేనే నా

ప్రాణనాథుని వెదకి దోడితేవలయుంబోలును ! దైవఘటన యిట్టుండినఁ దప్పించువార లెవ్వరు ?'' అని తలపోసెను. పెద్ద మంత్రినిఁ బిలిపించెను. అతం డేగుదెంచి, యుత్తర వేమని యడిగెను. అతనికిఁ దన కల నంతయు నెఱింగించి కల నిజమగుటను నిరూపించెను. ''మంత్రిశేఖరా ! నేను రాజును గొనితెచ్చువఱకును రాజ్యంబును భద్రంబుగఁ జూచుకొమ్ము. నీతిశాస్త్రధురంధరుండ వగు నీకుఁ జెప్పున దేమున్నది. పోయివచ్చెద''ననియె. మంత్రి వలదని యెంత చెప్పినను వినదయ్యెను. మంత్రి తమ చిత్తమని విడిది కేగెను.

మనోరమ స్త్రీరూపము ముప్పాలకుప్పయని యారూపంబు వదలి పురుష వేషంబును ధరించెను. కనువారి గుండెలు జల్లుమనఁ జేత విల్లు నమ్ములు పూనెను. వెనుక నమ్ములపొదిఁ గట్టెను. మనోవేగ సమాన వేగంబుగల యొక యుత్తమాశ్వంబు నెక్కెను. నగరంబును విడిచి యరణ్యమార్గమై యేగెను. అనేక నద నదీ తటంబుల దాటుచు, గొండల నెక్కుచు, పల్లెల గడచుచుఁ బోయి పోయి స్వర్ణపురంబునుఁ జేరెను. అందలి యుపవనంబున గుఱ్ఱంబును దిగి, స్నానాద్యనుష్ఠానంబుల దీర్చికొని, యామ్రవృక్ష ఫలంబుల భక్షించి, జలంబుల గ్రోలి, మందానిల ములువీచు రమ్యమగు నొక వసంతమంటప చంద్రకాంతో

పలంబుపైఁ బవళించి ప్రయాణశ్రమచే నిదురించెను. కొంత వడికి నిదుర లేచి, వస్త్రమాల్యంబు లలంకరించికొని, గుఱ్ఱ మెక్కి యా పూవుందోట యలంకారంబును బరికించుచు వచ్చుచుండెను.

ఆపురమున కేలిక యగు సుశీలుఁడును నందవనంబున కై మంత్రి ప్రధానులతో వచ్చెను. ఆగుఱ్ఱపు రౌతును జూచి యితండు తన కూఁతునకుఁ దగిన వరుండని నిశ్చయించెను. మంత్రిప్రధానులకుం జూపి యింత సోయగంబు గల రాకొమరు నెందేనిఁ గంటిమే. ఇతం డేయూరివాఁడో, ఇట రాఁగతంబేమో! యని రాజు పలికెను. ఊరివారును ఇంతటి యందగాఁడు గలడే. ఇతని చేఁబట్టిన నాతి భాగ్యమే భాగ్యము. మన రాజపుత్రికిఁ దగినవా డితండు. ఇతనికిఁ దగినది మన రాజపుత్రియని పలువిధంబుల నెన్నుచుండిరి. ఇంతలో గుఱ్ఱపురౌతు రాజుదగ్గఱకు వచ్చెను. రాజున కభివందనంబుఁజేసెను. సుశీలరాజు గుఱ్ఱపురౌతును గని "రాజకుమారా! నీవెవ్వరవు? ఇందుల కేమి కారణంబున వచ్చితివి? నీ నామ మెయ్యది. మా కెఱింగింప నిచ్చగలదేని నెఱింగింపు" మనియె. గుఱ్ఱపురౌతు "రాజేంద్రా! నే నొక రాజపుత్రుండను. పేరు మనోరాము, డందరు. భూచక్రంబును గలయ దిరుగుటకై మణిపురంబును వదలి వచ్చితిని. ఇదియు నాసమాచార" మనియె.

సుశీలుఁ డదివిని సంతసించి "రాజపుత్రా! ఈ యూరిని స్వర్ణపురంబని చెప్పుదురు. నన్ను సుశీలుఁ డందురు. వీరలు నామంత్రి ప్రధానులు. నాకొక కూతురు తప్ప వేఱుసంతానంబు లేదు. నిన్ను నాపుత్రునిగ భావించి నా కూతునిచ్చి పెండ్లి చేయించెద. నీవిట నిలిచి నా రాజ్యంబునకు నొజ్జవై పట్టాభిషిక్తుండవై మమ్ము దయనేలుము. నాకును ముసలితనము దగ్గఱించినది. వానప్రస్థుండనై కాలంబుగడుప నెంచినాడను. ఈ నాయభీష్టంబును ఱిత్త సేయక నా వేడికోలు నంగీకరింపుము. నీకు శ్రేయోభివృద్ధి యగును" అనియె.

మనోరాముఁడు, "రాజేంద్రా! దేవరవారి పలుకుల నతిక్రమించువాఁడను గాను. మా వంశంబున నొక్క నియతిగలదు. ఆ విధంబునకుఁ దాము అంగీకరింతురేని నట్టులే తమకూతుఁ బెండ్లి యాడెద. పిలిచి బిడ్డ నిచ్చిన నొడ్డారములు పలుకు వా రెవరు? వంశాచారమును విడువ నెవ్వరితరము."

సుశీలుఁ డామాటల విని యానందించెను. వరుని కులధర్మంబుల ననుసరింపని వివాహంబు వివాహమే. మీ యింటివాడుక యేదియో తెలిపిన నట్టులే చేసెదము. అందుల కడ్డియేమి? వేవేగ యెఱింగింపు, మన, మనో

రాముఁడు, నృపకులతిలకా! లోకంబున జరుగు పెండ్లికిని మా యింట్లయందు జరుగు పెండ్లికిని భేదంబేదియుఁ గాన రాదు. అయినను వధువునకు వరుఁడు మంగళసూత్రధార ణంబు చేయడు. ఖడ్గంబునకే మంగళ సూత్రధారణంబు కాని వధువునకు లేదనియె. కూతునిచ్చి పెండ్లిచేసి పట్టంబు గట్టవలయునను గట్టి పట్టుదలగల యాదొరకు నిదియెంత పాటిది? నీయిష్టంబు చొప్పుననే జరుగుంగాక యని తన నగరునకుఁ బిలుచుకొనిపోయి యొక విడిదిం జూపెను.

కొలువుకూటంబునకు వచ్చి మంత్రిప్రధానులఁ బిలిపించి నగరంబు నలంకరించుటకు నుత్తరువిచ్చెను. నృపుని ముదల మేరకు క్రముక పున్నాగాది తరువులతోడను, పూర్ణకుంభ ములతోడను, మకరతోరణంబులతోడ నగరంబు నలంక రించిరి. అంతట శుభముహూర్తంబునఁ దనపుత్రియగు మాణి క్యవల్లికిని మనోరామునకును పుణ్య తీర్థజలంబుల స్నానంబు చేయించి నవరత్నఖచితములగు భూషణముల నలంక రించి పట్టుపుట్టంబులఁ గట్టించి, నలుగులంబెట్టి పురోహితులచే నౌపాసనాదికంబులఁ జేయించి చంద్రాయుధంబును నిలిపి దానికి మంగళసూత్రధారణంబు జేయించిరి. బ్రాహ్మణు లాశీర్వదించిరి. మంగళతూర్యంబులు ఘోరనద్రమ్రోయిం చిరి. వధూవరులఁబల్లకిపై నెక్కించి మెరవణి వచ్చిరి. అందఱికి షడ్రసోపేతంబగు నన్నంబుల నిడిరి. బ్రాహ్మ

...ఖుల దానదక్షిణలచేఁ దృప్తిచేయించిరి. అందఱును రాజు నొద్ద సెలవుపుచ్చుకొని తమ తమ యిండ్లకేగిరి.

ఆనాటిరాత్రి సుశీలుఁడు వధూవరుల నొక్కటిచేయు తలంపున పడక గదిని పరిమళములువీచు వస్తువులతో నలంకరించెను. హంసతూలికాతల్పం బందు నిడెను. భక్ష్య భోజ్యంబులాదిగాఁ గలుగు పదార్థంబులందు నిడంజేసెను. దంపతులు పడకయింటిం జొచ్చిరి. సువాసినులు పుష్ప ఫలముల నందుకొని తమతమ నెలవుల కేగిరి.

మనోరాముఁడు మంచంబుపైఁ బరుండి నేమో చింతించుచుండెను. మాణిక్యవల్లి మంచంబుచేరువ నుండు కుర్చీపైఁగూర్చొని మనోరాముంగని, "నాయకా! మీ మదిలో గొంతత లున్నట్లు తలంచెద, ఎఱింగింపుము. పతి కష్టములఁ దీర్పని సతి సతిగాదు" యని యుడిగెను. మనో రాముఁడు, ఓ నా ముద్దులగుమ్మా! ప్రాణనాథునకు విపత్తు సంభవించినయెడల నది యెవరిశౌర్యంబుచే నివర్తింపంబడునో యది యెఱింగింతువుగాక, యనియె. మాణిక్యవల్లి "నాయకా! స్త్రీ లెంతటివారలయ్యును యోచనకుఁదగరు. స్త్రీ బుద్ధిఃప్రళయంకరీ,యను నీతికారుని వచనము అబద్ధమే? కనుక తమబోటి పురుషులవలన నగుంగాని యితరులచే నెట్లగును, అనియె. ఆమాటలను విని మనోరమ మందహాసంబు చేసి నేనొక కథంజెప్పెద వినదలతువేని వినుమనియిట్లనియె.

మనోరమ మాణిక్యవల్లికిఁ జెప్పిన

# భీమరాజు కథ

—o—

పడతీ! విదర్భదేశంబును వీరప్రతాపుం డను రాజొకడు నిజమహిషి సుఖానందతో గృహస్థాశ్రమంబునకుఁ దగునటుల రాజనీతిఁ దప్పక పరిపాలించుచుండెను. అతనికి మగబిడ్డ యొకటి పుట్టెను. ఆబిడ్డను నల్లారు ముద్దుగాఁ బెంచుచుండిరి. ఆ సిసువు దినదిన ప్రవర్ధమానుడై శుక్ల చంద్రునిరీతిఁ బెరుగుచుండెను. ఆరాజుగారి మంత్రికి నొక మగబిడ్డ పుట్టియుండెను. ఈ యిరువురు బిడ్డలును దినదిన మభివృద్ధినొంది వేదశాస్త్ర పురాణంబుల, ధనుర్వేదంబున సమర్థులై తమ యిచ్చవచ్చినటుల నాడుకొనుచుండిరి.

రాజ మంత్రికుమారు లిరువురు యౌవనవంతులైరి. కొడగు దేశాధిపతి శూరసేనుని పుత్రి రూపసుందరిని రాజపుత్రుండును, అతని మంత్రి వివేకభూషణుని కుమార్తె గుణవతిని మంత్రికుమారుండును బరిణయంబాడిరి. ఆ యిరువురు తోడినీడలవలె నొకరినొక రెడబాయక మెలగుచుండిరి.

అంత నొకనాడు రాజపుత్రుడు మంత్రికుమారునిం బొడగాంచి "వయస్యా! నేడు మనమిర్వురము వేటాడ నడవికిఁబోదము రమ్మి." అని పిలిచెను. మంచిదని యిరువురు శుభ ముహూర్తంబున ధనుర్బాణ తూణీరధరులై యడవికి

నేగిరి. వేటాడఁదొడంగిరి. ఒక జింక మిగుల శృంగారం బుగ నాటలాడుచుండుటను జూచిరి. మంత్రి నందనుండు రాజనందనునింజూచి 'ప్రియవయస్యా! నే ని జింకను జంపం జూచెద' ననియె. రాజపుత్రుఁడు కోపావేశుండై "ఓరీపలవా! నేను రాజును, నీవు కొంచెమైనను మట్టు మర్యాదలు లేక యీ జింకను నేనే చంపెదననియెదవు. నాచేతఁ గాదని నీ వనుకొంటివి కాఁబోలు. నీకుండు బుద్ధి నాకు లేదే" యని దుర్భాషలాడి యొంటరిగా నంతఃపురంబునకు వచ్చి చేరెను. ఈ విపరీతంబులఁ గాంచిన మంత్రికుమారుం డదరి పడి "ఇదేమివింత. ఇన్నిదినంబుల వలె నే నేదో చెప్పిన నేటికి నితని కిటులఁదోచెను. నేఁ జెప్పిన విషయంబున నేరంబుగలదే" యని దుఃఖింపుచు తన యిల్లువచ్చి చేరెను.

ఇంతవఱకు నొకరి నొకరు నెడబాయక యుండిన రాజపుత్రుఁ డల్పబుద్ధిచే మంత్రికుమారునితోఁ బగచేసి కొనియె. కాలంబు నతిక్రమింప నేరితరము? ఆ పురంబున రూప లావణ్య శీల యగు నొక వేశ్యయుండెను. అది యితని రూప సౌందర్యంబుల కచ్చెరువడి యిట్టి నాయకునితోఁ జేరని నాతియేల? రూపమేల? లావణ్య మేల? యని పరిపరివిధంబులఁ దలపోయుచుండెను. ఆ వేశ్యకు సమయము తటస్థించినది కాదు. మంత్రికొడుకుతో రాజుకొడుకు పగచేసి కొన్నందునఁ బ్రొద్దు పుచ్చ లేక రాజనందనుండు

పూఁదోటకేగి యందొక తిన్నెపై విశ్రమించి శృంగార పదంబులఁ బాడుకొనుచుండెను. వేశ్య యా సమయంబు నెఱింగి యచటికిఁబోయి, "ఓ మనసిజాకారా! నీపై నాకుఁ గోర్కె కలదు. నన్నేలుకొమ్ము. అదియ నా భాగ్యమ్ము సుమ్ము" అని వేడికొనియె. అతని కెంగేలు పట్టెను. మదనరాజ్యంబు చే పట్టెను. రాజనందనుఁడు అది యిది యనక మిన్నకుండెను. వేశ్య మనంబునఁ గుంది యతని చేష్టితంబులకు సహింపలేక, "రాజేంద్రా! వలచి వచ్చిన వెలదిని బోవ దలుట ధర్మంబగునే? మీ యిష్టంబు చెప్పుడు. ఏమాటలనక యూరకున్న నేమని యర్థము. అది మగపాడియే. ఉన్నది లేదనుటలో లోకువేమి?" అని యడిగెను

రాజనందనుఁడు "రోవెలంది వలపు లీవి యున్నంతకే వలపు గిలపు లేదు వారికెపుడు" అను లోకుల మాటల నెఱుంగవా? పలువురు నడచు వీథిని పచ్చిక మొలచిన నది వృద్ధి యగునా? పో పొమ్ము. ఇది యేటి మాట లనియె. వేశ్య కోపంబు నొంది ఔరా! రాజా! నీ వగల నేమిచెప్పను. రోవెలంది వలపు లీవి యున్నంతకే యని యొక కట్టు కథఁ జెప్పి నన్నుఁ బోఁదట్టఁ జూచెదవు. నేను వేశ్యాకులమునఁ బుట్టితినేని నిట్టి కట్టడిని నా యింటికి దాసునిగాఁ జేయక విడతునే? ఇదె నా పంతెము చూడు మని చివుక్కున లేచి యింటికేగెను. రాజనందనుఁడు పడచేయకుండెను.

ఆ వేశ్య యింటి కేగి మాంత్రికు నొకని రప్పించెను. ధన కనక వస్తు వాహనంబు లొసంగి సంతుష్టుం జేసెను. దగ్గఱఁగూరుచుండి "అయ్యా! తాము నా కొక సహాయంబు చేయుడు. సహాయంబు చేసెదనని బాస యిచ్చితిరేని యెఱింగించెద"ననియె. అది యెట్టిదని మాంత్రికుఁ డడిగెను. "స్వామీ! యీపట్టణాధిపుని కుమారుఁడు నాకు వశవు డయ్యెనేని నివు డిచ్చినదే గాదు, కావలసినంత యిత్తును." అనిన మాంత్రికుఁడు సమ్మతించి వశ్య గుళిక నొకటి నిచ్చి, "యీ గుళికను నీ కరంబున ధరించి కోరినవారి యెదుట నాట్యంబునలిపితివేని, వారు నీకు గానిస లగుటకు సందియం బులేదు"అనియె. వేశ్య మనం బుప్పొంగెను. మాంత్రికుని యథోచితంబుగాఁ దనిపి యింటికిం బంపి యా రాత్రి యెట్లో గడపెను.

మఱునాడు వేకువజామున లేచి కాల కృత్యంబులఁ దీర్చుకొని యుండ, రాజు నొద్దనుండి భటులు వచ్చి నేటి రాత్రికి నృత్యంబు సలుప వలయునట, నిన్ను రాజుగారు రమ్మనిరి అని చెప్పిరి. ఆమాటలు వేశ్యకు రొట్టె విఱిగి నేతిని బడినట్లుండె. సకలాభరణభూషితయై వేశ్య మేళంబు తోడ రాజు సమ్ముఖముల కేగె. ఇది రాజనందను నుద్దే శించి చేత గుళిక నుంచుకొని కేళిక యాడం దొడంగెను. మాంత్రిక బలంబుచే రాజనందనునకు యుక్తాయుక్తంబులు

తెలియని వయ్యెను. సభ నున్నామనియు నతని కెఱుక పడినది కాదు. అతండు చేయునది లేక హా యని నిట్టూర్పు నిగుడించి భూమిపైం బడెను. సభ నుండు వారలు దిమ్మం జెంది యే మిది యని లేచి రాజపుత్రు నోదార్ప సాగిరి. సభ వారును లేచిరి. ఈసందున వేశ్య తన యింటికి వచ్చెను. అంత రాజపుత్రునకుం దెలివివచ్చి చుట్టుం గనుంగొన, చేత సురటింబట్టి విసరుచుం దనభార్య నిలిచి యుండుటం గనియె. హా నా ముద్దుల గుమ్మా యని కౌగలింపం బోయెను. ఆమె ఈవింత యేమి. మనలం గ్రొత్తగాంజూచిన నాతివలె నేటికిం జూచెడిని. ఇందుల కేమో కారణం బుండవలయు ననియెంచి, ప్రాణనాథా! ఇదేమికార్యము. ఎన్నడు నిటు లుండినవారు కారు. క్రొత్త పనులేమి ? యని మందలించెను. రాజనందనుండు తన భార్య యని తెలిసి, "సరి! నీవా! ఇట కెట్లు వచ్చితివి. సభకు రాందగునా ? యని యడిగెను. నాథా! ఇది సభగాదు. మీరు దేహ మెఱుకగ యుండం గొన్ని శైత్యోపచారంబులం జేసియుం బ్రయోజనంబులేక మిమ్ముల నంతఃపురంబునకుం గొనివచ్చిరి. ఇంత వఱకు నంద ఉండిరి. ఇపుడే నన్నుమాత్ర మిట వదలి పోయిరి. ఇకం గొంత సేపటికి మిమ్ముం జూడ వత్తురు. నాచే నైన సహాయం బొనగూర్చెద." అని వినయంబుదోపం బలికెను. రాజనందనుం డది విని "రూపా! నా వలవంత

నీ కెఱింగించి యేమి? ఎఱింగింపకున్న నేమి? నీ వబలవు. నీవు తీర్పగలవా ఆర్పగలవా. ఇక నూరకుండుము, పోగరాజ నిప్పును విసరి నట్లున్నది, అని కసరుకొనెను. రూపసుందరి "లోకంబున నుండు వారందఱును నాలోచనకై తమ యిల్లాండ్ర నడుగుదురు. వారలు చెప్పినటుల నడతురు. పురుషుండు రాజును కులసతి మంత్రియు నని రసజ్ఞులు చెప్పు వచనంబులు మీరు రెఱుంగనివియే. 'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ' అను నీతికారుని వచనం బమోఘంబు గదా'' యనియె. రాజనందనుండు కొంత యోచించుచు మంత్రికుమారునితో కలహించినది మొదలు అంత వఱకు నడచినది యొకటియు విడువక యెఱింగించె. అంత నా రూపసుందరి కొంత యోచించి, "ప్రాణనాథా! మీరు దీనికై విచారంబు చెందకుడు. ఈ బంగరుబెత్తమును జేతఁబట్టు కొని దాసి యింటికిఁ బొండు. కాలహరణార్థమై పాచిక లాడ రమ్మనుడు. ఓడినవారు దాసిన లగునట్లు శపథంబు చేసికొని యాటలాడి యావేశ్యను దాసిసం జేసి తెండు,'' అని విన్నవించెను. రాజపుత్రుడు సమ్మతించెను.

మఱునా డుదయంబున లేచి యనుష్ఠానాదులం దీర్చి కొని సర్వాభరణభూషితుడై భార్యకుం జెప్పి, చేత బంగరు బెత్తమును బట్టుకొని వేశ్య యింటికి వచ్చెను. వేశ్య రాజ పుత్రునికై మేడపై నెక్కి చూచుచుండెను. వేశ్య మనంబు

అమందానందమున నోలలాడెను. మాంత్రికుని కరుణకు మది మెచ్చెను. శపథంబు నెఱవేరుదినంబులు వచ్చెంగదా యని సంతసించెను. రాజనందనుడు దాసీగృహంబు సొచ్చెను. వేశ్య రాజపుత్రునిందగు మర్యాదలచేతం దనిపెను. రాజపుత్రుండు మోహంబుగలవాని వలె నటింపుచు "సుందరీ! నేను నీపై మరలుగొనియున్నవాఁడను. నాపైఁ గరుణించి నా వలవంతఁ బోనడపుము" అని దానిం గౌగలించికొని ముద్దిడెను. అదియు మన వలయందు వీఁడు చిక్కెను గదా యని సంతసించి, "రాజనందనా! మీబోటివారి ప్రాపుననేగదా మేము సుఖంబున్నవారము. అటులేలఁ జెప్పెదను" అని చెక్కిలి నొక్కెను. ఇటుల సరససల్లాపంబుల వారలు కొంత వడతుఁ బ్రొద్దుపుచ్చిరి.

పిదప నా వేశ్య "రాజపుత్రా! ప్రొద్దు పోకకై యేదైన నొక యాట నాడుదము రమ్ము, తా మన్ని విద్యలందును గడితేఱిన వారలుగదా" యని నవ్వెను. రాజపుత్రుడును పాచికలచే దీనిని గెలిచి దానినగాఁ గొన సంకల్పించి యుండువాఁడు గానఁ దన యభీష్టమునకు ననుకూలముగ నది యాటలాడ రమ్మనుట పరమసంతోషకరమై యుండెను. తన భార్య యిచ్చిన బెత్తమును దిగువనుంచక చేతఁ బట్టికొని, "చెలీ! నీవు చెప్పిన యోచన యనుకూలముగనే యున్నది. వేఱు ఆటలేల! పాచిక లాడుదము రమ్ము.

పందెములు లేని యాట తీపై యుండదను సంగతి నీవెఱిగి నదే కదా'' యని చెప్పెను. వేశ్య లోలోన నవ్వుకొనుచు "రాజనందనా! ధనంబుల నొడ్డి యాడుట ధనహీనుల పద్ధతి యగును. మనము నిర్ధనికులము గాము. కావున నేనొక యుపాయంబు చెప్పెదను వినుఁడు. అది మీకు సమ్మత మైన యెడల నాకును సమ్మతమే. ఈ యాటలో నేను ఓడితినేని నా కలకాలము మీకు వరవుండనై సేవించెద. అదియ నా కోరిక సుమ్ము. అందులకు వ్యత్యస్తమైన యెడల మీరు మావారు సుమ్ము. అదియును మిమ్ముల నెన్నటికి నెడబాయని విధంబును జూపుటచే పరమానంద కరంబే. దీనికేమనెదరు. లేక తాము వేఱు పందెమును బెట్టి యాడిన నాడుడు. దాన నాకు నభ్యంతరము లేదు'' అని వినయంబునఁ జెప్పెను. రాజకుమారుండు సమ్మతించెను. ఇరువురు పాచిక లాడం జొచ్చిరి. రాజపుత్త్రుఁడు మై మఱచి చేతనున్న బెత్తమును దిగువ నుంచెను. విధి వశంబును గడువ నెవ్వరితరము. బోగముది యాట గెలిచెను. రాజోడెను. అది గని రాజకుమారుండు నివ్వెఱ పడి నిలచెను. స్వామీ! ఇక నేమి చేయ నగునని దిక్కులు చూచెను.

అపుడా వేశ్యదాదులు పఱువెత్తివచ్చి రాజపుత్త్రుని సకలాభరణంబులఁ దీసికొని ప్రాత చింపురుపేలికల నిచ్చి

కట్టంజేసి వంటశాలకుఁ బంపిరి. రాజపుత్రుండైన నేమి? మాటకు బద్ధుడు కాక యెటుల మీఱనగును? ఈ వేశ్యకు బానిసడై యుండవలయు నని బ్రహ్మ వ్రాసియుండ వేఱు విధమెట్లు లగును? కొట్టను బోయి కొట్టించుకొను నట్లయి నదే. "ఆతురగానికి మతితక్కువ" అనుసామెత నాయందుఁ సార్థక మాయె. ఆడుదాని మాటల వినువానికి నింతగాక మఱియెంత వచ్చును? అని మనస్తాపంబు చెందెను. వేశ్య రాజపుత్రుఁడు తనకు దాసుండగుటకుఁ గారణుండగు మాం త్రికుని వే విధంబుల గొండాడెను. ఇంతకన్న మించు కార్య మెద్దియని సంతసించెను.

అంత నా రూపసుందరి తన పురుషుం డొక దినమం తయు రాక యుండుటకుఁ గతంబేమో యని కలతజెందు. చుండెను. మఱునాడు తెల్లవారియు రాకుండుటచేఁ దన పతి దాని వలయందు జిక్కికొని జూదమాడి యోడెనని నిశ్చయించుకొనెను. తోడనే భటులందుఁ గొందఱిని బిలిచి, ఇవుడే మీరీయూర నుండు వేశ్య యింటికిం జని నేటి రాత్రికి రాజు బావమఱిది వచ్చుచున్నా రని చెప్పిరండని యానతిచ్చెను. వారట్టులన బోయి తెలిపి వచ్చిరి. సంగతి నెఱింగించి తమ యిక్కల కేగిరి. సాయంకాల మెవ్వుడు వచ్చునా యని యెదురు చూచుచుండెను. సూర్యుఁ డస్త మించెను. సంజకెంజాయ లణఁగి చీకట్లు దిశలఁ గ్రమ్మెను.

చుక్కలు దోచెను. చుక్కల జేడు మింటఁ గాయం దొడంగెను.

రూపసుందరి మగవేసంబు బూని వేశ్య యింటికిఁ బోయెను. రాజు భావమెటిది వత్తు రని మును మున్న యెఱింగి యుండునది యగుటచే వేశ్య సర్వాయత్తయై యెదు రెదురు చూచుచుండె. రూపసుందరి వేశ్యయిల్లుసొచ్చె. ఆ వేశ్యయెంత టక్కుల నేర్చినది యైనను ఈమెను మగవాఁడు గనే భావించెనే గాని వేషధారి యని గ్రహించినదిగాదు. వేష ధారికి వందన నందనాదికంబుల వినయంబునఁ జేసెను. అర్ఘ్యా సనంబునఁ గూర్చుండఁ బెట్టెను. "రాజేంద్రా! దేవరవారు నాపైఁ గృపాకటాక్షంబు ప్రసరింపఁ జేయ నిన్నిదినంబు లాయె గదా. నా భాగ్యమే భాగ్యము. నే ధన్యురాల నైతిని. నా గుడిసె పావనం బయ్యెను." అని నక్కవినయంబులు దోప నక్కమలాక్షి టెక్కులి మాటలాడె. రాజ వేషధారి మందహాసంబు జేయుచు "నో మనోహారిణీ! నాకు జూదంబుపై నుండు మక్కువ దేనిమీదను లేదు. ఇట వచ్చినదిమొదలు ఆటలాడువారు దొరకక మొగంబు వాచి యున్నది. సాధారణంబుగ వేశ్యలు సకలకలావిశారదలై యుండుటే జగత్ప్రసిద్ధంబు. కాన జూదం బాడవచ్చితి. ఇష్టమైన యెడల నొకటి రెండాట లాడెదము. రా రమ్ము." అనియె. వేశ్య సమ్మతించెను. వేషధారి మనంబుపొంగ

నాడ మొదలుపెట్టెను. ఇంతలో వేశ్య "రాజోత్తమా! పందెంబు లేని యాటలు రుచింప వనుట రసికుల యభిప్రాయము. తా మెఱుంగని ధర్మంబులు లేవు. తమ యభీష్టం బేమి యని యడిగెను. నీవే చెప్పుము. అందుల కొడం బడియెద ననియె.

"రాజేంద్రా! నేను గెలిచిన యెడల మీరు నావారలు. నే నోడిన యెడ నేను మీదాన" ననియె. సరియని వేషధారి యొప్పుకొని యాడం జొచ్చెను. రూపసుందరి రాజపుత్రుని వలె నేమఱినది కాదు. చేత బెత్తంబును బెట్టుకొనియే యాడెను. వేశ్య యోడెను. రాజవేషధారి పందెమును గెలుచుటను గని దిగ్గన లేచి, "రాజోత్తమా! నే నోడితిని. మన మనుకొన్నట్లు నేనును నా సర్వస్వమును మీదినే." యని చేతులు జోడించి నిలిచెను. తనతోడఁ బిలుచుకొని పోయిన సేవకులను దానికిఁ గావలియుంచి యింటికివచ్చి స్నానం బాచరించి తిని పరుండెను. మఱునాడు రూపసుందరి, మగవేషంబు బూని సభకువచ్చి తలారులం బంపి, దానిని రాజపుత్రుని వచ్చునటుల నుత్తరువిచ్చెను. తలారులు చిత్తమని వారిని సభకుఁ దోడితెచ్చిరి. రాజపుత్రునిం గన్నదే లేచి వందనంబు లాచరించి యర్ధాసనంబున నిలిపి వేశ్యం గని "ఓసీ పాతకీ! ఈ నగరంబు నేలురాజు నిరీతిఁ జేయఁదగునే? ఇది యేనాటి నడత" యని యడిగెను.

వేశ్య వడవడ వడంకం జొచ్చెను. రూపసుందరి గని యాడుదని గ్రహింపలేక "స్వామీ, రాజ రాజోత్తమా నామనవి వినుడు. నేనొక దినం బితనిపై మరులుగొని రాజా నాతో సుఖంపు మని వేడ నితండు నన్ను నిరాకరించెను. ఆవల నితని జూదంబున నోర్చికొంటిని. జూదం బాడు నపుడు మా సమయం బది గాన నిటులం జేసితి ననియె. రూప సుందరి యాగ్రహించి విన్నను నేను జూదంబున జయించితి గావున నిన్ను నాయిచ్ఛ మేఱకు నడపెద జూడుమని సేవకుల తో దీనిని జెఱయందుంచి దీని సర్వస్వమును దివాణంబున జేర్పుడు." అని యుత్తరవిచ్చెను.

తన పతిం గని "నాయకా! లోకంబున నున్న వార లకు నాశ విశేషదుఃఖమును కలిగించును. అది యటుండ నిండు. వేశ్యపై మరులుగొని పోవం బ్రయత్నించు నపుడు నే నడ్డగించితి నేని నాయాశ కోపరూపముగా మాఱు నని యెంచి, తమ యిచ్ఛమేరకు పోవ నంపితిని. మీరు నా మాట ప్రకార మచట నడువనందున నిట్టి యిక్కట్టులకు పాత్రులైతిరి. అది కనుగొని యీవేషంబు పూనివచ్చి వేశ్యను జూదంబున నోడించి మిమ్ము గెలుచుకొని వచ్చితిని. కనుక,

చ॥ పరిమితి లేని యాసం గల • వారికిం జుట్టలు నేస్తగాండ్రు తే
రరయ సతుల్ గతుల్ గలుగ • రాత్మలం బూజలం జేయ జాలరీ
తరమని చెప్పంగాదు మది • తాల్చును దాయి స్వభావ మీద ని
త్యర యవ నిల్వనోపరు త • లంపరు కీర్తిని రాజ నందనా.

అని యనేక విధంబుల రాజపుత్రునకు నా పరమ పతివ్రత బోధించెను. మఱియు ప్రాణనాథా! యెవరైన నేమి? వేశ్యాజనలోలురకు నిండ్లయందు దిన గంజియైన కట్టగుడ్డయైన నుండదు. వీరి కుండునది యంతయు వారి పాద కానుకకే చాలనిదై యుండును. తుదకు నుత్తచేతులతో వారికడ కేగ వార లర్ధచంద్ర ప్రయోగంబు చేతురు. ఆ యవమానంబుల సహింపక రాత్రిళ్ళు పొంచుచుండి దొంగలించి, దెబ్బలుపడి, రాజదండనకు లోనై లోకులు నిందింపఁ గుందు చుందురని నీతి శాస్త్రంబులు మొఱయిడుచున్నవి, అని యెఱుకం జేసి నాథుడు మన్నింప శచీదేవిం బోలియుం డెను.

అని పురుషవేషధారియగు మనోరమ మరకతవల్లి కెఱింగించి సుందరీ! ఈ రీతిని బురుషునకు సంభవించిన యాపదలఁ దీర్చి కాచుటయే ధర్మపత్నులకు ధర్మంబు. అదియ యువతులకు రూపమగును అనియె. అదివిని మరకతవల్లి, నాయకా! మీ రెఱింగించినది నిశ్చయమే. అయినను నేను మీదాననగుటం జేసి మీమనంబున నున్న కలవరంబుల దీర్ప గలనని యెన్నెదను. మీ మొగ మీ తరుణంబునఁ జిన్నవోవు టకుఁగారణం బేమి? ఎఱింగింప నిచ్ఛయుండిన నెఱింగింపుడు. నన్ను వేఱుగా నెన్నకుడు. ఈయరాని ప్రాణమైన నిచ్చి మీ దుఃఖమును దీర్పగల దానను" అని గట్టిమాట నిచ్చెను.

"మన్మనోవర్తినీ! నామాట వినుము. మన యిద్ద ఱికిఁ బ్రాణనాథుఁ డొక్కఁడున్నవాఁడు నా నాథు నెడ బాసి పాతివ్రత్య ధర్మంబును గాచికొన నుద్దేశించి యీ మగవేషంబు ధరియించితి. నానాథుని వెదకికొని పోవు చున్నాను. త్రోవను మీతండ్రి నన్నుంగని, యిచటికిఁ దోడితెచ్చి నిన్నిచ్చి పెండ్లిచేసెను. నిన్నుం గనినదే నాతోడి నీడవై యుండువని నిశ్చయించి నిన్నుఁ బెండ్లి యాడితిని. మన మిరువురము ఏకపతితో సరస క్రీడల ననుభవింప నగు నని నీకు మంగళ సూత్రధారణంబు సేయక చంద్రహాసంబునకుఁ జేసితి"నని యున్న దున్నట్లు వివరిం చెను. మరకతవల్లి యంతయు విని యాశ్చర్యమంది, ఆ! అటులనా! యని నోట వ్రేలిడికొని తలవంచి నిలిచెను. నేల బొటమన వ్రేలితో రాయుచుండెను. దానిం గని మనోరమ దగ్గఱించి, మొగంబును దుడిచి, ఓ నాచెలీ! నీ వెందులకును సిగ్గు నొందకుము. అని ప్రక్కనఁ గూర్చుండఁజేసి సంతోష వాక్కులచే సమాధానపఱచి నాజాడ నెవరికి నెఱింగింప కుము. దానఁ జేటు వాటిల్లును.'' అని చెప్పి తన పెనిమిటి రాక నిరీక్షించుచుండెను.

ఒకనాడు మరకతవల్లి మనోరమను జూచి "అక్కా! మన ప్రాణనాథుఁడు ఎక్కడి కేగెను. ఇక కొన్ని దినంబు లలో వచ్చునని చెప్పితివే. ఇంతవఱకును రాలేరి గదా!

నేటికి మీరువచ్చి యీయుపనెల లయ్యెడిని'' అని యెఱింగించెను. మనోరమ యీ మాటల విని ''అమ్మా! మరకతవల్లీ! నేనిట నుండునది మనపతి కెట్లు తెలియును. నేఁబోయి వారిని వెదకికొని తెచ్చెద. భద్రంబుండుము'' అనియె. అదివిని మరకతవల్లి ''అక్కా! తమచిత్తము. నాభాగ్యము. ఇంతకు మించి నేనేమి చెప్పగలను.'' అని విన్నవించెను.

మనోరమ రాజు కడకువచ్చి ''రాజేంద్రా! కొంత కాలము వఱకు యాత్రచేయవలయు నను నిచ్ఛ పుట్టుటచే మీ కుమార్తెను భద్రంబుగా జూచుకొనుడు. పోయివచ్చెద'' నని సెలవడిగెను. అదివిని రాజు సుశీలుఁడు మనోరమ జూచి''అన్నా! మనోరామా! ఇదివరకు నేనీ మరకతమును గని పెంచి పెద్దచేసి నీకిచ్చి పెండ్లి జేసితిని. నీవెట కేగినను నది నీతో తోడి నీడవలె వెనుకరించి రావలసినదే గాని మాయొద్ద నుండరాదు. నీ వెట కేగిన నచటికి దోడుకొని పొమ్ము. మగనాలిని నింట నిలుపుకొనుటచే ఫలమేమి ?'' అని యెఱింగించెను. మనోరమ శుభముహూర్తంబున బయలువెడలిరి. పోయి పోయి నొక దేశంబును గాంచిరి. అందొక ముసలిదాని యింట విడిది చేసిరి. ఆ ముదుసలిది వార లిరువురంగని ''అయ్యలారా! మీరలెవ్వరు? మీ యూరెయ్యది? తమపేర నిలిచి ధన్యంబైన యక్షరంబు లెయ్యవి?'' అని యడిగె. మనోరమ ముదుసలింజూచి,

"అవ్వా! మేమిరువురము బాటసారులము. ఇతఁడు నా తమ్ముఁడు. మేము దిగినచోటే మాయూరు. ఊరూరు తిరిగి చూడవలయు ననునుద్దేశముతోఁ బోవుచున్న వారము. మా కిరువురకు నన్నంబు పెట్టుము. నేను రేపుండి పోవు వారము అని యైదు మొహిరీ లిచ్చెను. అవ్వ యింత మొత్తము నెన్నడును జూడనిదగుటచే సంతసించి షడ్రసో పేతాన్నమును సిద్ధపఱచి వారి కెఱుక జేసెను. వార లిరు వురు గడుపాఱ దిని కొంత విశ్రమించి యలమట దీర్చుకొని తాంబూలంబు చేయుచుండిరి. అవ్వయు ముక్కుబట్ట వేసి కొని వక్కాకు కొట్టుకొనుచు దగ్గఱఁ గాలు సాపుకొని కూరు చుండెను. మనోరమ అవ్వంగని, "అవ్వా! ఈ యూరి పేరేమి. ఇందు విశేషంబు లేవియైన గలవే" యని యడి గెను. అవ్వ యిట్లు చెప్పందొడంగెను.

"అయ్యలారా! వినుడు. ఈ పురంబునకు జాంగలం బను పేరు గలదు. ఈ పట్టణమునకు దగ్గఱ నొక యడవి గలదు. అందొక రాక్షసుండు వసించుచున్నవాఁడు. వాడు పగటిపూట నరణ్యంబున సంచరింపుచు రాత్రిఁ పురంబునఁ దిఱుగు లాడును. వాని కపుడు దొఱకు మనుజుల నందఱిని దిగ మ్రింగుచుండును. ఇది చాల కాలంబుగా జరుగుటచే నీరాజునకు మిక్కుటంబగు విచారంబు గలదు. ఈ రాక్ష సునిఁ జంపువా రెవరైనను వారలకు నీరాజ్యంబు నిచ్చు

చున్నా నని చాటించియున్నవాఁడు. రాజ్య కాంతుచే నా రాక్షసుని నోట నెందరో పడిరి'' అన నామాటలు విని మనోరమ,''అవ్వా! నీ విపుడే రాజసమ్ముఖంబునకుఁ బొమ్ము. నా మనుమఁడు చిన్నతనముననే దేశాంతర వాసియై యనేక మంత్ర తంత్ర సిద్ధులం బొంది, యనేక మృగంబులను రాక్షసులనుఁ జంపినాడు. వా డిపుడు మాయింట నున్నవాడు. తమ యుత్తరువైన యెడల నేటిరాత్రికి నా రక్కసునిం జంపాడి నగరబాధలు దీర్పఁగలడని యెఱింగింపుము. అతని యభిప్రాయం బెఱింగి రమ్ము. ఈ నా మాట వ్యర్థమ్ము కాదుసుమ్ము'' అని రెండు మొహిరీ లిచ్చె. అవ్వ యేమియుఁ దోచక యానంద సముద్రంబున మునింగెను. మన పాలిటి దైవంబు లని తలంచెను. వారల నిరువుర నాశీర్వదించెను. వయసును బాటింపక యొక్క పరువున రాజుకడకరిగెను''రాజకులతిలకమా! మనయూరు బాగుపడు కాలము వచ్చినది. నా మనుమడు పిన్ననాడే మలయాళాది ప్రాంత్యంబుల కేగి మంత్ర తంత్రంబులం దేఱి వచ్చి యున్నవాడు మంత్ర తంత్రంబులందు వాడు పెట్టినది భిక్షము. దేవర వారు సెలవిచ్చితిరేని నేటి రాత్రికే యా రక్కసు నుక్కణొక్కఁగలడు. ఇందుల కేమనెదరు'' అని విన్నవించెను.

రాజునకు మితిలేని సంతసంబు కలిగెను. అవ్వకుఁ

బసదనంబు లిచ్చెను. "అవ్వా! నీ మనుమడు రాక్షసుని జంపునేని నీరాజ్యంబు అతనికి నొసంగుటయేగాక నా పుత్రిని సయితము వివాహంబు చేయగలను. ఇవి ఆపత్తు మ్రొక్కు-లని తలపకుము. రాజులు మాట దాటుదురే? ప్రాణంబుల నైన నెలవుగా నియ్య నగుంగాని మాటల దాట నగునే. "మాల మాల యంద్రు మాలవాఁడా నొకో మాటతప్పువాడు మాలవాఁడు" అని వేమనయు, "ఆడిన మాటకు దప్పిన గాడిద కొడుకంచు దిట్టగా విని యయ్యో వీడా నాకొడుకంచును గాడిద యేడిచెగదన్న ఘనసంపన్నా" యని చాటుపద్యంబును నుడువుట వినమా." అని తాంబూలంబిచ్చి యవ్వ నింటికిఁ బంపెను. ముదుసలి మహదానంద భరితురాలై తనయింటికివచ్చి రాజాభిప్రాయంబును సాంగంబుగ నెఱింగించెను. రాజిచ్చిన తాంబూలంబు నొసంగెను. మనోరమ సంతసించి షడ్రసోపేతంబుగా నారాత్రి తొలిజామున నన్నంబు దిని, అవ్వదగ్గఱను, మరకతవల్లి దగ్గరను సెలవుపుచ్చుకొని అడవి కేగు మార్గంబున నొక చోటఁ గావలియుండెను.

రాక్షసుడు వాడుక మేఱకు నా త్రోవను వచ్చుచుండి యిదివఱ కెన్నడు నట కావలి లేకుండుటయు, నేడు మాత్ర మెవడో కావలియుండుటయు జూచి, "ఎవడురా! యిట కావలియుండువాఁడు. నీకు ముప్పు కాలముదగ్గఱించి

నది కాబోలు'' నని యదలించెను. మనోరమ కాలాగ్ని రుద్రుపోలిక నట్టహాసంబు చేసి, ''ఓరీ దుష్టా! యిన్ని దినంబుల వలెనే నగరంబును నాశంబుచేయఁ జూచెదవు కాబోలు. ఇకపై నీ జపంబులు సాగవు. అట నిలుము. నన్ను నేమరించి లోనికింబోవ నెవరికి సాధ్యంబుగాదు. మనుజులను యమపురికి బంపు కార్యంబున దక్షుండవగు నిన్ను యమపురికిం బంపెదను. ఇందులకై యే నిన్ను నే నెదురు చూచుచుంటిని. ''వంటఁయింటిని కుందేలు సొచ్చునట్లు'' నీవే నాయెదురపడి చిక్కుకొంటివి. నిన్ను నిక్కడనుండి యొక యడుగైన నావలికిఁ బెట్టనియ్యను, గనుక నీవు నాతో యుద్ధంబుచేసి యమపురి కేగెదవో లేక నన్ను సేవించి మనుజుల కపరాధంబు సేయ నని బాసలిచ్చి మనియెదవో, ఏమనియెదవు'' అని యడిగెను.

రాక్షసుఁ డది విని చేతులుతట్టి గొల్లుమని నవ్వెను. ''ఓరీ మనుష్యాధమా! పులిని ధిక్కరించు మేకవలె పల్లఅవులాడెదవు. నీకుగాలం బాసన్న మగుటచే నిటు లనెదవు కాబోలు. లేనియెడ నీరీతి నెవడైన నన్ను ధిక్కరించెనా? ఒక జంప గొట్టిన పాలును, మరియొక జంపను నీరును గారులేఁ[బ్రా]యఁపు వాడవు. ఈ సాహసంబులు మాని యింటికి వేవేగఁ బొమ్ము." అని పరిహసించెను. మనోరమ తన్ను బెంచుచుండిన రాక్షసుడు తనకు నేర్పిన మంత్రంబుచే నొక

జాతిని నభిమంత్రించి వానిగొట్టెను. తోడనే యా రక్క సుడు తన ప్రాణంబుల గోలు వోయి దిగువఁబడెను. వాని శిరంబు పగిలెను. అందుండి జ్యోతిర్మయంబగు నొక కన్య వెలువడెను. మనోరమకు నమస్కరించెను. మనోరమ ప్రమానువడి కొంతసేపు నిలిచెను? ఆ కన్యకు మ్రొక్కి, అమ్మా ! నీ వెవరవు, ఏమికారణంబున నిన్ని దినంబులు రాక్షసరూపంబున నుంటివి. తెలియ జెప్పు మన నాదేవ కన్యక యిట్టు లనియె.

రాజనందనా ! వినుము. మలయ మారుతంబను పట్టణమును బరిపాలించుచుండిన మలయధ్వజ మహారాజు నకు పుత్రభాగ్యంబు లేక వగలం బొంది తన దేవితోడ నడవికిం జని కరుణాకరుని కృపావశంబున నాపట్టమహిషి గర్భంబు ధరించి, దశమాసంబులు పూర్తియయి, నన్నుం గాంచెను. నాకు స్వర్ణభూషణి యను పేరిడిరి. నన్ను నల్లారు ముద్దుగా బెంచుచు నైదవ యేట విద్యాభ్యాసంబు చేయించిరి. అందఱు గొనియాడ విద్యలం దేఱితిని. నాకు యౌవనకాలంబు సమీపించినదే, బడి నుండి మాతల్లి దండ్రులు నిలిపిరి. నేనొకనాడు నందవనమునకేగి యొక చోట నొంటరిగా నుంటిని. సమయ మెఱింగి నారౌజ్జలు నాకడకేతెంచి, స్వర్ణభూషణీ! నీపై మరులు చాల దినము లుగా నిలచియున్నది. నా యిష్టంబు నెరవేర్పు నిదియదను

అని తన యభిప్రాయం బెఱింగించి వేడుకొనెను. నే నా మాటలకు బెదరి, అయ్యా! మీరలు సకల శాస్త్ర వేత్త లరు. మీకిట్టి చపల చిత్తంబు రానగునే. ఇంకొకడవైన నపుడే యమపురి కంపియుందును. గురుండవని మన్నించి తిని" అని కసరుకొంటిని. నాగురుడు ఖిన్నుఁడై యవమా నంబునొంది, "ఓసీ పాపీ! మన్మథునిగాసికి బడఁజాలక నీ మఱుఁగుసొచ్చిన నన్ను యమపురి కంపెద నని దుర్భాష లాడి తివి. నీవు రాక్షసుండవై విహరింతువు గాక''యని శపిం చెను. ''రాజనందనా! నే నేమి చెప్పుదు. నారూపము తోడనే మారెను. స్త్రీత్వము మటుమాయమై రాక్షస త్వము ప్రాప్తించెను. అంతట నేను భయవిహ్వలనై యతని పాదంబుల కెఱఁగి "ఆర్యోత్తమా! గురుండ వని మిమ్ము బాటింపక దూషించిన నా యపరాధంబు సహింపుడు. నాకు మోక్షకాలం బెప్పు డగు'' నని వేడితిని. అతండు కరుణించి ''స్వర్ణభూషణీ! ఇక నామాట తప్పదు. నీవు రాక్షసరూపంబున మనుజుల దినుచు బాధించుచు నుంటివేని నొక నారీమణి పురుషవేషంబు ధరించి నిన్నెది రించి ఖాతిచే గొట్టునేని నీ శాపంబు తొలగి యెప్పటివలె స్త్రీరూపంబు ధరింతువు. జాంగలదేశంబునకుఁ బొమ్ము. నీ శాప మోక్షణంబు సేయు పతివ్రతాశిరోమణి పురుషునే వివాహమాడ గలవు.'' అని చెప్పి తన దారిం బోయెను.

"రాజా! నిన్ను పురుషుడని యెట్లు నమ్మఁగలను. మాయొజ్జల మాటతప్పునే" యను స్వర్ణభూషణింజూచి, "అమ్మా! నేనును నీవలె స్త్రీనే. నాపతిని వెదకి కొనుచుఁ బోయెదను" అని సమాధానంబు చెప్పి తన యింటికిఁ దోడుకొని వచ్చెను. మద్రసోపేతంబుగ నన్నంబు దిని జరిగిన వృత్తాంతమంతయు నవ్వకును మరకతవల్లికిని నెఱింగించెను. అవ్వ సంతసించి ఇరువురిని తోడుకొని రాజనగరున కేగెను. రాజు విని యాశ్చర్యభరితుండై తన శాసమేరకు శుభముహూర్తంబున మనోరమకు దన కూతు నిచ్చి పెండ్లి చేసెను.

రాజకుమార్తెయగు చంపకవల్లియు నాటిరాత్రి హంసతూలికా తల్పంబునఁ దనతో నేమియు మాటలాడక పరుండియుండు మనోరమ కడకేగి "నాయకా! నాపై మీకు గోపంబేమి? నాతో నొక పలుకైన బలుకక మిన్నకున్నవారు. సరససల్లాపంబుల బ్రొద్దుపుచ్చక మీవలె నిద్రించువారలు గలరే" యని మెల్లన నడిగెను. మనోరమ దీని నేమార్ప వలయునని మదినెంచి కొంతవడి యోచించి "మనోహారిణీ! నిన్నొక భూత మిప్పు డెత్తుకొని పోయిన నిన్ను విడిపించు టెట్లో యని యోచింపుచుంటిని. భార్యల దుఃఖము దీర్పని మగవా డుండియేమి లేక యేమి? అదియ నా మిన్నకుండుటకుఁ గారణము" అనియె. చంపకవల్లి పక్కున నగి "నాయకా! ఇట భూతమేది? గీతమేది? నన్నెత్తుకొని

పోవుటయేమి? మీరు విడిపించు మార్గంబు యోచించు టేమి? ఇవియెల్ల నసంగతంబై యున్నది. ఆమాటలతో ఫలమేమి? మన మిరువురము సంతోషంబున నాటలాడుటో? సరసవచనంబుల బలుకుటయో కాక యీ యమంగళ వచనంబు లేల?'' యనెను. మనోరమ ''భామినీ' పురుషులు స్త్రీల నమ్మ నగునే?'' యని యడిగెను. అది విని చంపక వల్లి, "ప్రాణనాయకా! మీరన్న మాట మర్మంబుల దాకు నవి గావా? స్త్రీల నేల నమ్మరాదు. తలముట్టి యెన్ని బాసలు చేసినను గాని యమ్మమ్మ! పురుషుల నమ్మరాదు, అను లోకోక్తి లబద్ధము లే. పురుషులను నమ్మి వేనవేలు పడ తులు చెడియుండుట మీరెఱుంగనిదియే. ఇందులకుఁ దార్కాణంబుగ నొక చిన్న కథ కలదు. వినవలచెదరేని నెఱింగించెద'' ననియె. మనోరమ చంపకవల్లి మాటల కాశ్చ ర్యంబునొంది ''సుదతీ! మేలు! మేలు! నా కా కథ నెఱింగిం పుము. విన వలచెద'' నని యియ్యకొనెను. చంపకవల్లి చెప్పం దొడంగెను.



## మనోరమకు చంపకవల్లి చెప్పిన

# చంద్రశేఖరుని కథ

---

విజితపంచసాయకా! మన్మనో నాయకా! అభీష్టవర ప్రదాయకా! సావధాన మతి నాలింపుము. మహిమపురం బును వల్లభుండను రాజేలుచుండెను. అతడు పుత్రులం బడయక మహిషితోడ వనంబుల కేగి తపోధనుని కృపచే నొక మామిడిపండును బొంది యాలిచేతి కిచ్చెను. ఆమె యాపండును దిని గర్భవతి యయ్యెను. ఆమె గర్భము దినదినాభివృద్ధి నంద రాజు సంతోషమును వృద్ధియగు చుం డెను. పదినెలలు నిండి యామె శుభముహూర్తంబున నొక మగ శిశువుం గనియె. రాజాబిడ్డకు చంద్రశేఖరుండను నామంబు నిడెను. కొన్నిదినంబులకు నారాజు ప్రధానమం త్రికి నొక యాడుబిడ్డ పుట్టెను. ఆబిడ్డకు జంద్రావతి యను నామంబిడిరి. విద్యాభ్యాస వయసు వచ్చినదే రాజు కొడు కును మంత్రి కూతురు నొకచో బడియందు చదువుచుండిరి. వారిరువురు బాల్యము నుండి బద్ధానురాగులై యుండిరి. మంత్రికుమార్తెకు యౌవనంబు సమీపించెను. తల్లి దండ్రు లిక బడి కేగుట కూడదని నిలుపం జొచ్చిరి. మంత్రికుమార్తె యాసంగతి రాజపుత్రున కెఱింగించెను. అతండు కొంత

వడిఁయోచించి, "ప్రేయసీ ! నీవు సమయంబుచూచి మన నందవనంబునకు రమ్ము. అందలి నగరున మనోల్లాసంబుగా నుండనగు"నని సంకేతంబు జెప్పెను. మంత్రికుమార్తె రాజ నందనుని మాటలు విని బేలుపోయి సమయము దొరకినప్పు డంతయు వచ్చుచు పోవుచు నుండెను. ఇటులఁ గొంత కాలంబు గడచెను.

భీమపురిరాజచంద్రుఁడు విజయసేనుని కుమార్తె జ్ఞానవల్లిని చంద్రశేఖరున కిచ్చి పెండ్లిచేసిరి. 'క్రొత్తనీళ్లు ప్రాత నీటిని గొట్టుకొని పోయె'నను నటుల చంద్రశేఖరునకు జ్ఞానవల్లిపై మరులధికమయ్యెను. చంద్రావతి మాటయే మఱచెను. రాజులు నూతనప్రియులు గదా? చంద్రావతి సమయంబుచూచుకొని రాజపుత్రుకడకు వచ్చి "నాయకా ! నీ బాల్య స్నేహితురాలిని మఱచి నట్లున్నది. అది తమ బోంట్లకు నీతియే" యని హెచ్చరించెను. విశ్వాసఘాత కుండగు నారాజపుత్రుడు "ఓసీ ధూర్తురాలా! నాపై మక్కువ గొని నన్ను వెంబడించినదానవు. నీవెంటబడి నీయింటికి వచ్చితినే. బాల్యంబున జరిగినవి లెక్కకు వచ్చునా! పో పొమ్ము. ఇది యేటిమాట. పసితనంబున నెన్ని యబద్ధ ములు? ఎన్ని వాగ్దత్తములు? వానినెత్తుకొనువార లెవ్వరు?" అని కసరుకొనెను. చంద్రావతి కోప భయంబులు పెన గొన నింటికివచ్చి మరణించెను! కావునఁ బురుషుల నెన్న

టికి నమ్మరాదు. వలపుండువఱకు మగడుగాని వలపుడిగిన వెనుక మగం డనిపించుకొనునా? మగవారికి వలపు సుదతి వయసుదిరై యుండువఱకు మిక్కుటంబై, రాను రాను బలు చనై పోయి తుదకు సున్నయగును. స్త్రీలకు పరితాప గుణంబుండుటచేత మగల కే యిక్కట్లు వచ్చినను దల యిత్తురు. తత్త్వ మిట్లుండ మీరొకవిధంబుగ బక్షపాతం బుగఁ జెప్ప నగునే. పక్షపాతంబులఁ బక్షులకు విడువుడు. నాతోఁగూడి సుఖంబుల దేలియాడు'' డనియె.

ఆ మాటలకు మనోరమ సంతసించి, తన గుట్టును దాచక యెఱింగించెను. 'ఈ రహస్యంబు నెవరి కైనను జెప్పెదవు సుమ్మి, మన కది ప్రాణాపాయకరమ్మ' అనియె. చంపకవల్లి భ్రమచెంది, ''అక్కా! నీకు బదులాడునంతటిదాన నే. నీవలె నేనును మగవేషంబు ధరియించి వెంటవచ్చెద. నన్నును గొని పొమ్మి'' అని గట్టి మాట చెప్పెను. మనో రమ చంపకవల్లి తల్లి దండ్రులకడ సెలవు పుచ్చుకొని యవ్వ యింటికి వచ్చి, ''అవ్వా! మేము నలువురము తీర్థ యాత్రల కేగి మఱలి వచ్చెదము''అని తెలిపి, మనోరమ మరకతవల్లి, స్వర్ణభూషణి, చంపకవల్లి యను నలువురును మగని వెదుకఁ బోయిరి.

వార లలకాపురిం బ్రవేశించిరి. అందొక పూటకూళ్ళ ముదుసలియింట దిగిరి. ''అమ్మా! మేము ఉత్తరముగా

చాలదూరము పోవలసియున్నది. మేమిచ్చట నాలుగైదు రోజులుందుము. అంతవఱకు మాకు నన్నపానాదుల విచారింపుము. నీ కష్టమునకై దీని నుంచుకొమ్ము'' అని పది వరహాల నిచ్చిరి. ఏ బాటసారులు నా యవ్వ కంత మొత్తమిచ్చిన వారుకారు గనుక మిగుల సంతసించి వారి మనసుల రంజింపజేయునట్టి సకల పదార్థములు తయారుచేసి, వారికి స్నానాదు లమర్చి విస్తరివేసి వడ్డించెను. వారు నలువురును గడుపాఱ దిని యొక చోటఁ గూరుచుండిరి. అవ్వయు పను లన్నిటిని ముగించికొని వారికడ కూరుచుండి వినోద సల్లాపంబులఁ బ్రొద్దు పుచ్చుచుండిరి. అపుడు మాటలసందున మనోరమ యవ్వం గని 'అవ్వా! యీ యూర విచిత్రంబు లేవియైనం గలవే!' యని యడిగెను. ముదుసలి చెప్పదొడగెను.

''రాజకుమారులారా! వినుడు. ఈ యూరిని బరిపాలించు నలకేంద్రునకుఁ జాలదినములు సంతతి లేకుండెను. మొదటి భార్యకు బిడ్డలు లేనందుచే రెండవతూఱి మఱియొకతెం బెండ్లి యాడెను. ఆ రెండవభార్యకు నందగత్తెయగు నొకయాడుపిల్ల పుట్టెను. దానికి అంబుజాక్షియని నామకరణంబు సేసిరి. ఆ చిన్నది నాటినాటికి నల్లారు ముద్దుగా బెరుగుచుండ ఋతుమతి యయ్యెను. ఒకనాడామె స్నానంబుచేసి పై మేడలో కురులార్చు చుండెను. అపు

డొక మాయారాక్షసుండు పఱువెత్తివచ్చి, తటాలుమని దానినెత్తుకొని పోయెనట. అలకేంద్రుం డది యెఱింగి వ్యసనంబు చెంది యెవరైనను ఈ రాక్షసునిం జంపి నా పుత్రిని విడిపించుకొని వచ్చిరేని వారికి నా రాజ్యంబు నిచ్చుట యేగాక యాపిల్లను వారికే పెండ్లిచేసియిచ్చెదనని చాటించి యున్నవాఁడు. ఇది వఱకు దీనికై యనేక రాజపుత్రులు వీరపరాక్రమశాలురు రాజులకడ నుత్తరువుపొంది పోయిన వారిలో నొక్కరు నిది వఱకు రారైరి. రాజు మిగుల వ్యసనంబు నంది యున్నవాఁడు'' అనియె.

మనోరమ యా మాటలనువిని, కొంచె మాలోచించి యవ్వం జూచి, "అవ్వా! రాజుకడ కిప్పుడ పొమ్ము. నా మనుమడు దేశదేశంబులు తిఱిగి ధనుర్విద్యయందు ననేకుల జయించి పేరందియున్నవాఁడు. వాఁ డిప్పుడ మా యింటికి వచ్చి యున్నవాఁడు. రాక్షసునిం జంపి మీ కూతును గొనివచ్చును,అని నమ్మఁజెప్పి యుత్తరువుం గొనిరమ్ము. వేగ మపొమ్ము,'' అనుటయు నా యవ్వ మనోరమను జూచి, నీ వెవ్వరు గన్నవాఁడవో? తల్లిదండ్రుల విడనాడి యీనగరంబు నకు వచ్చి, "బీరములు పలికి ప్రాణములు గోలుపోయె'' వన్నట్లు అన్యాయంబుగ రాక్షసుని నోటఁ బడుట కుంకించె దవే. ఇది పాడిగాదు. ఈ స్త్రీప్రయత్నంబును విడువుము. ఉసురున్న ఉప్పుమ్మి బ్రతుకవచ్చును. బ్రతుక కలిగిన భార్య

గలదు. దీనికై బంగరువంటి మేనిని నేల ఛూర యిచ్చె దవు. నీవిప్పుడ నీ యూరికేగుము.'' అని బుద్ధి చెప్పెను.

మనోరమ యా పలుకులకు నగి, "అవ్వా! నీవు ముదు సలిదానవు. నా పరాక్రమం బిట్టిదని నీ వెఱ్ఱుంగుదువు. రాక్షసుని కడకేగినవారు రారని యంటివి. ప్రముక్కుడుల కదినైజము. ఇంకనామాటల విని రాజు కడకేగి యుత్తరువు గొనిరమ్ము.'' అనుటయు నాయవ్వ కొంచెము ఆలోచించి యెవ్వరి సామర్థ్య మెట్లుండునో యెవ్వరి కెఱుక. బూది గప్పిన నిప్పువలె మహాత్ములుందురు. మొగంబును గని వారి సామర్థ్యము నెఱుంగుట యెట్లగును? అంతటి శక్తి లేనియెడ నింతటి ధైర్యంబుతో చెప్పునా యని యెంచుకొనుచు రాజు కడకేగి మనోరమ యభిప్రాయంబు నెఱిఁగించెను. రాజు సంతసించి, యట్టులన చేయనిమ్మని తన సమ్మతి తెలిపెను. అవ్వను బహూకరించెను. మనోరమ కవ్వ సంగతి తెలిపెను. మఱునాడు తెల్లవాఱలేచి, స్వర్ణభూషణని చంపకవల్లిని అవ్వకడ భద్రంబుగా నుండుమని యప్పగించి మరకతవల్లితోడ మనోరమ బయలువెడలెను.

ఇరువురును గొంతదూరము వచ్చిరి. మునుపు తన్ను బెంచుకొనుచుండిన రాక్షసుఁడు తన కుపదేశించిన మంత్రంబు నుచ్చరించెను. భూమి తటాలున పగిలెను. అందుండి పొగయు నిప్పు జ్వాలలును ఎగసినవి. మరకతవల్లి యిది

యేమి యని భ్రమసి తెలిసికొనునంతలో విల్లు బాణములు గల తూణీరమును ఎదుట నుండెను. మనోరమ దాని నెత్తుకొనియె. ఇరువురును రాజు చెప్పిన గురుతునెఱిగి పోవుచుండిరి. త్రోవయందు నొక యుపవనంబు కను పట్టెను. దాని వినోదంబుల కచ్చెరు వందుచు, సౌంద ర్యము నభివర్ణించుకొనుచుఁ బోవుచుండిరి. అట నొక మేడయుండెను. అం దేమి గలదో చూతమని దగ్గరి కేగిరి. అది మూయఁబడి యుండెను. తనకత్తిచే మనోరమ తలుపు తెఱచెను. లోపలి కేగి నలుప్రక్కల కలయజూచిరి. అల కేంద్రుని కుమార్తె అంబుజాక్షి యొకచోనుండెను. దానిం గని మనోరమయు మరకతవల్లియు నచ్చెరువంది "ఆ! హా! ఈ కన్నియ యెంతటి రూపలావణ్యంబు గలది. దీనిని బ్రహ్మదేవుఁ డెట్లుసృజించెనో గదాయని యాశ్చర్యము జెంది దీని ననుభవించుపురుషుఁడే పురుషుడు. కాన నిది మన ప్రాణనాథునకు దగినదియు. ఈ రాక్షసు నెటులైనం జంపి దీనిం గొనిపోవుటయే యుత్తమం"బని తలంచిరి. ఇరువురును దాని ముందు నటు నిటు తిరుగం జొచ్చిరి. మనమిట నాలస్యంబుగ నిలిచిన మంచిది గాదు. ఈవనశృంగార మంతయు గని వత్తమని యటనుండి, దిరిగిరి. వారువచ్చి నది తన్ను జూచినది పోయినది అంబుజాక్షి యెఱుంగదు. వార లిరువురు నటనుండి కదలి మఱియొకచోటి కేగిరి. అందు

గల శృంగారవనంబున జలంబుల గ్రోలి వన్యఫలంబుల భుజించి బడలికలుదీఱ నొకచో విశ్రమించిరి.

ఆదేశరాజపుత్రి కోమలవల్లి యనునది యౌవన వంతురాలై యెవ్వరినొల్లక వివాహమాడక యుండెను. తా నధికసౌందర్యవతి యగుటచేఁ దనవంటిసౌందర్యవంతుని బతిగా బడయవలయునను నపేక్షచే నట్లుండెగాని మఱివేఱు గాదు. దానిచే రాజపుత్రు లందఱును మది విసికిపోయిరి. ఈ యిరువురు విశ్రమించిననాడే యా రాజపుత్రి తన చెలి కత్తెలతో సకలాభరణ భూషితయై యా నందవనంబునకు వచ్చెను. విల్లు నమ్ములధరించి యపరమన్మథులవలెఁ దిఱుగులాడు మనోరమా మరకతవల్లులం గాంచి, దిగ్భ్రమ చెంది రాజకుమారు లెందఱినో గంటిని. వీరితో సమాను లను గాంచలేనైతిని. ఇట్టి రూపరేఖావిలాసంబులు గల పురుషులు లోకంబునం గలరే. వీరు మానవులని తలఁపను. విలాసార్థమై భూమిని దిఱుగవచ్చిన కంతు జయంతులై యుండవలయును. వీరితోఁ జేరి సుఖింపని నా జన్మ మెం దుకు? హా! దైవమా యని యువ్విళ్ళూరుచుఁ బరవశత జెంది నేల కొఱిగెను. దవు దవ్వులనుండి చెలికత్తెలు ఇది యంతయుఁ గని ఱివ్వున బఱువెత్తి వచ్చి, శైత్యోపచారం బుల నామెను దనిపి సేదదేర్చి విచారింపఁ దొడంగిరి.

చెలికత్తెలు:—అమ్మా! తమకు బడలిక రానేల? తోటకు

వచ్చునపుడే భక్ష్యంబులఁ గడుపాఱ దినిఁ వచ్చితి కదా, ఇంతలో మీ కాకలివచ్చు టెట్లు? ఆకలి యన రాదు. భూత భేతాళములు సోకినవో యన నిది సాయంసమయంబును గాదు. తెల్లవాఱి యిట వచ్చియు మీకు నిట్టిది సంప్రాప్తమగుట కాశ్చర్యం బు చెందెదము. ఇందులకుఁ గారణం బేమి? మా కెఱింగింపుము. రాజపుత్రీకవయ్యు నిట్టి యధై ర్యంబు నొందనగునే?

కోమలవల్లి:—చెలులారా! నేనేమి చెప్పుదును. ఏమి చేయుదు? ఈ వెత నెటుల బాయుదురు. దీని నివ ర్తించు వాఁని నెట రోయుదు? అల్లదో చూడుడు. మన యెదుట విల్లు నమ్ములు ధరించి విలాసంబుగ దిరుగు వారిని. ఆ సుందరపురుషుల లావణ్య మేమి చెప్పుదు? నా మనంబును వారి రూపంబులు దొంగ లించు కొనినది. లేనియెడ నా కిట్టి యధైర్య ముం డదు. దానిచే నామతి కలంగినది. వా రిరువురితో సుఖింపని ఈ కాయ ముండియేమి? లేక నేమి? ఇక వారితోఁ జేరక నేను బ్రతుకుట అర్త.

చెలికత్తెలు:— (మందహాసంబు చేసి) తల్లీ! మీ రాడు మాటలు నమ్మఁ దగినదిగా యుండ లేదు. ఇది వఱకు నెందఱో సుందరపురుషులు మిమ్ము వలచి

వచ్చియు వారి నందఱిని నిరాకరించిన గట్టి డెందము గల మిమ్ము వీరెటుల భ్రమింపఁజేసిరో యెఱుంగము. సరి! వీరు మీ మది కెక్కివచ్చిన వారలై యున్నవారనుకొందము. మీరు వచించు మాటలు ధర్మసహితంబు లని తలంపము. లోకంబునఁ బురుషు లెన్ని వివాహంబుల నైనను జేసికొందురు. స్త్రీ లన్ననో యొకరికి మించి పెండ్లి యాడుట యర్హ మని యెవరు చెప్పుదురు? పెండ్లి యాడుట యటుండని మనసులోఁ దలంచినను పాతివ్రత్యమునకు భంగంబు గలుగు నని పెద్దలు చెప్పుదురు. అందఱును బరిహసింతురు. సకల నీతి శాస్త్ర ధురంధరుండగు రాజేంద్రునకు బిడ్డవయ్యు నిట్టి యవినీతి కార్యంబుల కొడిగట్టనగునే? ఇది యేటి మాట? విన్నవారి కిది రోతమాట, మోహాతిశయంబునఁ దెలియక పలికెదరు.

కోమలవల్లి:—చెలులారా! ఇద్దఱిని వలచుట ధర్మంబు గాదని పండితులవలెఁ బలికెదరు. మీ మాట పండిత వాక్యంబుగాదు. శాస్త్రంబుల నరయక రెండు మూడు ముక్కల నేర్చి యెత్తుకొని విహరించు పండితంమన్యుల ధోరణియిది. ద్వాపరయుగంబున ద్రౌపది పాండవు లేవురను బెండ్లి యాడదే? ధర్మజ భీమా

ర్జుననకుల సహదేవు లొక్కరే యని వింటిరా ? వేలువేలు పురుషులని యనుకొంటిరా ? వారి యందు సుఖభోగంబు లనుభవింపదే. ధర్మంబు గాదని వ్యాసాదులామెను ధిక్కరించిరే, పోపొండు. ఆమె యైదుగురను బెండ్లియాడి యందఱికి ధర్మ పత్నియై యుండ నే నిరువుర వివాహ మాడిన నేర మగునే ?

చెలికత్తెలు:—అమ్మా ! మీరే యిటులఁ జెప్పుచుండ మే మేమని చెప్పగలము. కోపంబు చేయక మా మాటను బాటింపుడు. వలపు తలకెక్కి మీరు మాటలాడ, నిది గాదని చెప్ప మాకు బాధ్యత లేదా? యజమానుల మాటకు మించరాదని యొక వేసంబు బూని యెవ రెట్టులైన నేమి ? మనసంచిని రూకలు పడిన చాలునని, యుక్తాయుక్తంబులఁ జెప్పక యిచ్చకంబులాడు పాపులము గాము. మీరు చెప్పెడి వచనంబు లెట్టిదంటిరేని వినుడు. లోకం బున నొకడు దుష్టవృత్తిని నుండువానిని సన్మార్గ మునఁ బ్రవేశింపించు తలంపున పలువిధము లైన ధర్మంబుల బోధింప వాఁడదివినక మనకని సృజంచి యుండు జంతువుల మనము చంపి తింటిమేని, నాలు కకు రుచిగను, శరీరమునకు బలముగ నుండును.

గావున యే జంతువు నైనను జంపి తినుటయే మేలని వచించునుగదా. ఆ మాటలను పెద్దలు విని నిర సింతురుగాదా ?

క॥ వందనము సేయుజగ మా
నందమున నహింస నెఱపి • యుంటని వానిన్.

తా॥ అహింస లోనర్చక తనవలె నెదిరినిం గనుచు నుండు వానిని, మాంసమును భుజంపని వానిని లోక మంత యు నధికానందమున వందనంబులం జేయును. అని పెద్దలు చెప్పుదు రన మీ మాటలు తేటలై యున్నవి. ఇట్టి బూట కంబుల నాకడ నాడ రాకుడు. తెలియని వారి నెవనినైన నేమార్పఁ బొందు. వాఁడు మీ మాటల సత్యంబు లని పాటించును. వేదంబున విధించియుండు యాగములు పశు హింసారూపంబు కావే. అవి యహింసయే? మేలు. మేలు. మీరన్నియు నెఱిగిన వారయ్యును నట్టి వితండవాదంబులకుఁ జొరనగునే ? ఇదేమివింతయని యామెను మందలించిరి.

కోమలవల్లి:—సఖులారా ! మీరు వచించు మాటలు నీతి బాహ్యంబులు. జీవుల హింసించుట పాపమయ్యె నేని అశ్వమేధాది యాగంబులు పాపభూయిష్టంబులు గదా ?

చెలికత్తెలు:—(నగి) అమ్మా ! మీరు వచించు మాటలు తెలివి లేనివారికి రుచించునే గాని జ్ఞానులకు సమ్మ

తిగ నుండదు. యాగాదులయందు వేద మంత్రం బులచే నా పశువుల యాత్మలను బరిశుద్ధంబు చేసి దానిని స్వర్గంబునకుఁ బంపి వాని దేహ మాంసము వ్యర్థమై పోకుండునటుల హవిస్సుగ నుపయోగించు కొనుటయే యాగాభిప్రాయము. అటుల గాక యొకజంతువు అల్లల్లాడఁ గనికరంబు లేక దానిం గోసి తినుట పాపంబు గదా.

కోమలివల్లి:—సరి. అది యట్టులనుండ నింకు యాగంబున కును,నాయభిప్రాయమునకును సంబంధ మేమి? ద్రౌపది పంచపాండవులఁ బెండ్లియాడి మనోల్లాసవతియై మనదే? నేనేల యిద్దఱితో సుఖింపరాదు. దాన దోషమేమి?

చెలికత్తెలు:—అమ్మా! ద్రౌపది యేవురను బెండ్లియాడుట వాస్తవంబే. ఆమె యేకకాలంబున నందఱితో సుఖించి యుండలేదు. సంవత్సరమున కొకరి వంతున వారితో నుండుటయు, సంవత్సరాంతమున బరిశుద్ధ యగుటయుఁ దాము భారతంబున వినియుండ లేదా? ద్రౌపది యైదుగురుని బెండ్లియాడెనని యూఱక చెప్పెదరు. అంత మాత్రమే గాదు. ఆమెను బరిణయం బాడిన యేవురలో నొకరు యింద్రుని యం శంబు లని మఱొకరు యమాంశంబులని యిటులనే

వురు వేర్వేరంశంబులని నళాయని చరిత్రంబున విన వే? ఈ వట్టి భ్రమలేల? ఒక పురుషుని మది కెక్కి వచ్చుట కడుదుస్తరము. ఇరువురి మాట చెప్పనేల? అన్నంబు లేక యాకలిగొన్నవాడు ఒకచేసారిగ గుండెడు నన్నంబును వడ్డించికొని కొంత తిని యావలం దినఁజాలక మినకరించును గదా! నీవును నిద్దరిని గూడితి వేని నీకు నట్టులన యగును. నీవు పసిదానవు. లోకంబు లెఱుగవు.

కోమలవల్లి:—అమ్మలారా! మీ నీతిమాటలు చాలును. మీ రెంత చెప్పినను నాకు సమ్మతిగ లేదు. నిప్పున నున్నవారికి సెగ తెలియునె కాని నీడ నున్నవారి కెటులం దెలియును. వేమాటలేల? పాపమో పుణ్యమో యెవ రెఱింగిరి. ఆ పురుషుల నిరువురం బెండ్లి యాడక యీ తనువునఁ బ్రాణంబు లుండవు. ఇది గట్టి మాట. ఊఱక ప్రేలెద నని యనుకొనకుడు.

అని 'తాఁ బట్టిన కుందేటికి మూడే కాళ్ళనునట్లు' తన పట్టు విడువని కోమలవల్లి కెంత బోధించినను, ఆ మాటలు ఓటికుండ నుంచిన నీళ్ళయ్యెను. చెలికత్తెలంగని "అమ్మలారా! వారి వారి గోడు వారి వారికేగాక యితరుల కెట్లు తెలియును. మఱుమాట లాడక వేగిరమ వా రిరువురిం

దోడి తెండు. గాంధర్వవిధిని వారి నిచ్చుటనే పెండ్లియాడెద. ఈ వియోగదుఃఖంబు సహింపను. పంచసాయకుఁడు నిర్దయుఁడై పొంచి పొంచి బాణంబుల నేయుచున్నవాఁడు. తెండు తెండని వేగిరించెను.

రాచపట్టి చేతలకు చారలు పక్కున నగి, "అమ్మా! యిదియేమి యాగడము? మే మెంత చెప్పినను వినక మొరటుపట్టు పట్టితివి. మాకుం జూడ వార లిరువురకు గలహంబులు జరుగగలవని తోచుచున్నది. ఇంత వఱకు నెంతయు నొద్దికతో నుండు వారిరువురు నేటితో నీవలన వేఱు పడుదురు. తనమదికినచ్చిన కాంతతో వే ఱొకడు సుఖించు చుండఁ జూచు నట్టిమూఢుడు గలడే? నీ వలన వారి కేదో కీడు మూడునని యెన్నెదము అని మాఱు లొడ్డు చెలులమాటల విని కోపంబు చెంది, "ఓసీ చెలులారా! నే నెంత చెప్పినను వినక మఱు మాటలాడఁ జొచ్చితిరి. నన్నేమనుకొంటిరి. పరిహాసంబు నా ముందటం జేయనగునే? మీ కంటి కంత యెల్లిదనైతినే. సేవకులకుఁ జను విచ్చిన నంతకుగాక మఱి యెంతకగును. తోడి నీడల వలె నాడుచుంటిరని ఇంతవఱకు మన్నించితి. ఇక మన్నింపను, ఎవరో యిరువురు పురుషులు ఒక పడతిని వలచి చచ్చిరని యమంగళంబుల నాడితిరే. ఆ యిరువు రెవరు? ఆ స్త్రీ యెవ తె? నా కెఱింగింపుడు. నోటికి వచ్చినట్లెల్ల పలుక కుండుడు" అని గద్దించెను. దాదులు

కోమలవల్లి యింగితంబు నెఱింగి "అమ్మా! మిమ్ముల బరిహాసింతుమా? మాకేమి గుండెలు మూఁడా? మాపై నలుగకుము. దేవతలును జయింప రాని భుజబల పరాక్రమశాలురై ధనుర్వేద పారంగతులై యొకరి నొకరు కించిత్తైన నెడబాయక యుండిన సుందోప సుందులను నిరువురు సహోదరులు తిలోత్తమ యను నప్సరసను భార్యగాఁ జేసికొనవలచి, భ్రాతృ సౌహార్దము వీడి యొకరితో నొకరు కలహంబు లాడి యమపురి కతిథులైరి. కనుక, మా మాట మీఱకుము. ఏమో చెప్పెదమని తలంపకుము" అనిరి. కోమలవల్లి కొంత యోచించి "చెలులారా! ఆ చరిత్రము వినిపింపుడు. ఒక స్త్రీతో నిద్దఱును సమాధానంబుగ నుండి సుఖంపక జగడంబు లాడి మడియ నేల? వారలకు బుద్ధి లేకున్ననుఁ పి తిలోత్తమ యైనను జెప్పరాదా? దాన నేమి లోపమున్నది. నా కేమియు తెలియ కున్నది. ఆ కథను సాంగోపాంగముగ నెఱింగించి నా కలవరం బుడుపుడు" అని వేడుకొనియె. వార లిటులఁ జెప్పం దొడంగిరి.



కోమలవల్లికి చెలికత్తెలు చెప్పిన

# సుందోపసుందుల కథ.

—o—

తల్లీ! కోమలవల్లీ! సుందోపసుందు లను నిరువురు రాక్షసులు త్రిలోకాధిపత్యమును, నిత్యత్వమునుగోరి, తపంబు చేయుటకై కానలకేగిరి. వారలచటఁ బరమేశ్వరు నుద్దేశించి, యద్భుతఘోర తపంబొనర్చిరి. వారల తపంబునకు మెచ్చి బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై మీకుఁ గావలయు వరం బెయ్యది? తెలుపుడు. గొంకక యిచ్చెద ననియెను. సుందోప సుందులు తమకుఁ బ్రత్యక్షమైన బ్రహ్మకు నమస్కరించి, ''కృపావారిధీ! మాకు నెట్టి వీరులచే నైనను, రాక్షసులచే నైనను, మృగంబులచే నైనను, మరణంబు కలుగకుండునటుల వరంబు బ్రసాదింపుము. ఇదియ మాకోర్కె'' యనిరి.

బ్రహ్మదేవుండు కొంత యాలోచించి, "సుందోప సుందులారా! మీ రడుగు నిత్యత్వము మీ కియ్యఁదగినది కాదు. సర్వంబును బ్రహ్మంబని చూచుజ్ఞానులకు మాత్రమే జనన మరణరూప సంసారంబు లేదు. అజ్ఞానాంధకారంబుచే, విషయానందమును డెందమునఁ బొందుపఱచి, సుఖంబును ననుభవింపఁ గోరి, తపోనిష్ఠల నుండు వారికి మరణం

బాసన్నమైయుండును. తత్త్వమిట్లుండ నడుగరాని దడిగి తిరి. ఎవనిచే నైన నొకనిచే మాత్రము చచ్చునటుల నిచ్చ గింతు రేని మీ రడిగిన నిత్యత్వ మిచ్చెదను. ఆలోచించి తెలుపుడు'' అనియె. వా రిరువురు యోచించుకొని, ''స్వామీ ! మే మొకరిచే నొకరు చచ్చునటుల నొప్పుకొనె దము. తక్కిన వా రెవరివలనను జావు లేకుండునటులఁ బ్రసాదింపుడు.'' అని వేడికొనిరి. బ్రహ్మయు "నట్టులన కానిమ్మని''సమ్మతించి వార లొకరిచే నొకరు చచ్చునట్లును దక్కిన వారిచేఁ జావనట్లును వరంబిచ్చెను.

బ్రహ్మకడ వరంబు చెందిన సుందోపసుందులు మహా దానందభరితులై తపోనియమంబుల వదలి తమ స్వస్థాన ములకు వచ్చిరి. ధనుర్బాణ తూణీరధరులై మహావీర ప్రతాప ప్రభువులై దేవలోకంబున కేగి ఘోరయుద్ధంబు చేసిరి. వారి ధాకకు దేవతలు తట్టుకొన లేక మదిఁ గుంది, ''ఔరా ! యిది యెట్టికాలమో ! మనకు రథ గజ తురగప దాతులను చతురంగబలంబు లుండియుఁ బ్రయోజనంబు లేకున్నది. వీరికి నెట్టి సహాయంబును లేకయే యొంటరి నొంటమి జేయుచున్నవారు. ఇక యుద్ధంబుతో ఫలంబు లేదు. వీరితో సంధి చేసికొని మనుటయే మేలని యెన్ను కొనిరి. సుందోప సుందులకుఁ గావలసినవి యిచ్చి వారి యు త్తరువుల కడంగి యుండిరి.

పిదప సుందోప సుందులు యక్ష, కిన్నర, కింపురుష, గరుడ, గంధర్వా సురాదుల నెదురించి, వారి నందఱిని గొట్టి తఱిమి ధ్వంసంబు చేయుచుండిరి. వార లందఱు నొకటిగాఁ జేరి సుందోప సుందుల యుద్ధంబు చేసి నిర్వ హింపఁ జాలక భయంబు నెంది మూల కొక్కరుగఁ బోయిరి. వా రిరువురు నాయా లోకంబులం దుండెడి వస్తువుల నన్నిం టిని నపహరించికొని పోయి తమ వాసస్థలమున కేగి తమ కిష్టమైన విధంబున అపరంజి గోడలు కట్టి నవరత్నఖచిత మైన నగరు కట్టవలయు నని మయున కుత్తరువు చేసిరి. మయుఁడు సుందోప సుందుల యుత్తరువును మీఱక వారి యిష్టము చొప్పుననే నవరత్న ఖచితమై వెలుంగు నగరును జోడించి యిచ్చి తనకుఁ గావలసిన మట్టుకు బహుమతులను బొంది పోయెను.

ఈ సుందోప సుందులు, తదనంతరము, మాటి మాటికి దేవలోకంబున కేగి దేవతల బహువిధంబుల బాధించుచుండినందున దేవతలు భయంబు చెంది బ్రహ్మ కడ కేగి తమ కడగండ్లను జెప్పుకొని దుఃఖించిరి. బ్రహ్మ దేవుఁ డేమి చేయనగునా యని యోజించి, యా సుందోప సుందులు ఒకరి వలననే మఱి యొకరు చావవలయునని వరం బిచ్చి యుండుట చేత, వారిరువురుని జయింప మనచే గాదు. కనుక వేఱు యోచన జేయవలయును. మన యప్సరసల

యందు నొకతెను బంపినయెడల వా రిరువురు నొకరితో నొకరు కలహించుకొని, జగడంబు లాడి మడియ గలరు. ఇదియే దీనికిం దగిన యోచన యనిచెప్పెను. బ్రహ్మ దేవుఁడు అప్సరసలఁ బిలిపించి యీ సంగతి చెప్పెను. వారలు సుందోప సుందులకు భయంబు చెంది, యీ పని మా వలన గాదు కాదు అని చెప్పిరి. బ్రహ్మ చేయునది లేక యప్సర సల కన్న మించిన రూపవయోలావణ్యాతిశయంబులం గల యొకతెను సృజించెను. దానికిఁ దిలోత్తమయని పేరి డెను.

అవ్విధంబున సృజింపఁ బడిన యీ తిలోత్తమ బ్రహ్మ కు నమస్కరించి, "నావలని కార్యమేది గలదు? చేయరాని పని నైనను దమ కరుణాకటాక్షంబుచే ననుకూల పఱచికొని వచ్చెద"ననె. బ్రహ్మదేవుఁడు తన్ను సృజించిన యుద్దేశ్య మును దెలియం జేసెను. అపు డా తిలోత్తమ దేవసభ యందు లేచి నిలిచి నమస్కరించి, "దేవతలారా! నేను బోయి, యీ సుందోప సుందులకు జగడంబులను గల్పించి యొకరితో నొకరు పోరు సలిపి, యొకరిచే మఱి యొకరికి మరణంబు కలుగునటుల చేసి వచ్చెదనని దిటవుగాఁ జెప్పెను. ఆ తిలోత్తమ మాటలను వినిన దేవతలు మది నుప్పొంగి, "నారీ శిరోమణీ! నీవు చేయు నీ గొప్ప సాహాయ్యమునకు మే మేమి యుపకారము చేయంగలము. నీ కిపుడుందు నంద

మేగాక యీ యప్సరసల యందమునందు గొంత కొంత భాగము నీక మరిచేరును గాక'' యని దీవించిరి. అట్టులన వారి యనుగ్రహమునఁ దిలోత్తమ యధిక లావణ్యవతియై తోచెను. బ్రహ్మదేవుఁ డధికానందము నొంది "యీ నీ సౌందర్యమును జూచి సుందోపసుందులు మోహంబు గొన కుందురా ? నీ పై వారికరంబులు పడవు. నేటి దినము సుందోపసుందులు నీ యందముచే భ్రమచెంది వారి నేస్తంబులు మాని జగడంబు చేసికొని చావం గలరు. నీవు జయమును బొంది రాగలవు." అని యాశీర్వదించి పంపెను. తిలోత్తమ దేవతల యాశీర్వాదంబు నొంది, మనోల్లాసంబుగ దేవలోకంబును వదలి, సుందోపసుందులు వసించు హిమవంతమునకు దగ్గఱ నాకాశ మార్గమున వచ్చుచుండెను.

అపుడు సుందుడు తిలోత్తమను మొగమెత్తి చూచెను. ఇట్టి యందగత్తెయు నుండునా యని దిమ్మ చెందెను. ఉపసుందుఁడు నట్టులే భ్రమసెను. సుందుఁ డుపసుందునిం జూచి నిట్టూర్పు నిగుడించి, ''ఓరీ తమ్ముఁడా ! ఉపసుందా ! ఆకసంబునఁ జూచితివే. నా మనోనాయకియు నీకు వదినెయు నగు నొక నారీతిలకము ఆకాశమార్గంబున వచ్చుచున్నది చూడు'' మనియె. ఉపసుందుఁడు అది విని యన్నయను గౌరవంబున నేదియుఁ బలుక కుండెను. అపుడే తిలోత్తమయు వారి యెదుట వచ్చి నిలిచి కడగంటి చూపుల

తోడను, మందహాసంబులతోడను గనుం గొనుచు వీరి నే విధంబున జయించి, చచ్చునట్లు చేయ నగునా యని యో చించుచుండెను.

తిలోత్తమ యిటులఁ జింతించుచుండ సుందోప సుందులు ఇరువురును తిలోత్తమం జూచి, తమ్ముఁ జంప వచ్చిన యమదూతయని యెన్నక సుఖంబు నొసంగు సుందరియని యోచించిన వారగుటచేత, ఒకరి కొకరు వాగ్వాదంబుల జరిగించు కొనిరి. ''ఓరీ తమ్ముడా! మీ వదినె వచ్చి యుండుట చేత నీ వీ నగరును వదలి నాలుగైదు దినంబులకు దేవలోకంబున నుండుము. ఇదియును నేనును ఇచట కొన్ని దినంబులుమనోల్లాసంబుగ నుండెదము.అది నాతో కాపురము చేసి, యలవాటు పడిన వెనుక నీవు వచ్చియుండినను, మఱది వగుటచేత, నిన్ను బిడ్డవలె భావింప గలదు.'' అని టక్కుగా మాటలాడెను. ఉపసుందుఁడా మాటలను విని తిలోత్తమా రూప సౌందర్య లావణ్యంబుల కీడువడి యుండుటచే దాని మొగంబును జూచుచుఁ దన యన్నమాటలకు సహింపక, ''అన్నా! నే నీసుందరిని వివాహమాడి, సుఖానందముగా జీవించి యుండుటకు నాశ గొనియెదను'' అనియె.

ఈ విధంబుగా సుందోప సుందు లిరువురును తిలోత్తమా రూప లావణ్యాతిశయంబులకు మోహంబు చెందు టయు, ఒకరితో నొకరు విరోధవార్త లాడుటయునుగా

నుండిరేగాని మనలో నొకరికి నిల్లాలుగా నుండినం జాలునని యెంచినవారు కారు. దైవగతిఁ దప్పింప నెవరితరము? సుంద దుపసుందుండును తిలోత్తమను నాకు భార్య నా యిల్లాలు అని కలహించుకొను చుండిరి. అది గనిన తిలోత్తమ మది నుప్పొంగి మన కిక మంచి కాలమే యని వారిని జూచు చుండెను.

సుందోప సుందులు తమకుం గల వరప్రసాదమును, కాలగతిని, సహోదర వాంఛను మఱచి, ఒకరితో నొకరు పోరుటయే మంచిదని తీర్మానించికొనిరి. మనలో నెవనిని గోరికొనునో వాడే దానికి భర్త యగునని తీర్మానించుకొని తిలోత్తమ కడకు వచ్చిరి. "నారీ శిరోమణీ! నీకు నెవరిపైఁ బ్రియంబుగలదో తెలుపు" మని యడిగిరి. అది యిరువురిని కైగంటి చూపులం జూచుచు, మందహాసంబు చేసి, "హా! నా యాసకుందగిన సరస నాయకులారా! నేను మీలో నెవ్వని వరింపగలను. ఎవరిని నలదని నిరాకరింపగలను. రూప యౌవన గుణాదులందు నొకరి కొకరు తీసినవారు కారు. అట్లుండ నొకరిని వదలి మఱియొకరితో జేరుటకును గాదు. ఇరువుర తోడను సుఖించుటయుఁ దగదు. మీరే యా సంగతిని దీర్మానంబు చేసికొని రండు. అబలనగు నావలన నగునే"యనియె. వా రిరువురును బయింబయిఁ గోపము నాశయు నధికరించి, 'సఖీ! నీ కెవరిపై యిష్టమో

జింకక చెప్పుము' అని యడుగ నా తిలోత్తమ నవ్వుచు యిట్లు చెప్పం దొడంగెను.

"మన్మనో వర్తినులగు సరస నాయకులారా! నేనెటులం జెప్పుదు ? మీా యిరువురిలో సమర్థుం డెవడో యది గానక నేనెట్లు చెప్పుదు. ఎవడు సామర్థ్యవంతుఁడో వానిం గాక యితరు నెట్లు వరింతును? కనుక మీారే మీా సామర్థ్యంబుచే మీాలో నొకనిఁ దఱుమంగొట్టి యొక్కరై యుందు రేని యపుడు పఱువెత్తిపోయిన వానిని నిరాకరించి, యోడక నిలిచిన వానిని గోరికొందును''అనియె.

ఆ మాటలు వినఁగనే వారిరువు రొకరి నొకరు కొట్టి తఱిమి తిలోత్తమను దమ వశంబుగఁ జేసికొన వలయునను పేరాసచే సుందుఁడు ఉపసుందునిం గని "ఓరీ! దుష్టా! నేను నీకు బహువిధములైన నీతులఁ జెప్పియు నీవు వినక యిచ టనే యుండుటవలన నాకు గోప మధికరించు చున్నది. నీవు వేగ మెక్కడికైనఁ బరువెత్తి పొమ్ము. అనియొక పెట్టు పెట్టెను. ఉపసుందునకు గోప మధికరించెను. ఓరీ ! మూార్ఖా! నే నిదివఱకు సహించియుంటిని. నీకుఁ గొంచె మైనను బుద్ధిచాలదు. దాన నీవు గొట్టితివి. అయినను నింతకును సహించెద. ఇకనైనను ఈ చోటు విడిచి పాఱి పోదు వేని నూపిరితోఁ దిరుగుదువు. లేని యెడ నిన్నుఁ జంపి నేనే యీా సుందరిని గాంధర్వవిధిం బరిణయంబై సుఖానం

దంబున నోల లాడెద''నని. అంతలకు సుందుఁడు, ఓరీ పలవా! నీ దుర్గుణంబుచే దీనిని నీవును అనుభవించునటుల లేదు. నేను ననుభవించునటుల లేదు. ఒకరి నొకరు చంపుకొనునటు లున్నదేకాని వేఱుగా గనఁ బడలేదు. ఇందుల కనుగుణంబుగా ధూమ్రాక్ష కాలనేముల కథ వినం బడుచున్నది. అసురుండగు ధూమ్రాక్షుఁడును, రాక్షసుం డగు కాలనేమియు వివాదపడి యొకరి నొకరు చంపికొని తమ యాస్తి పాస్తుల నన్యాయంబుగాఁ గోలుపోయిరి. వారి వలె మనము నీ తిలోత్తమ ననుభవింపక పాడగుదుము. నా బుద్ధిని వినుము. నేను మొదట దానింజూచి నీకు జెప్పితిని. నీ వన్యాయముగా నడ్డముద్రొక్కి నాతో జగడంబునకు వచ్చెదవు. ఇది పాడియై యున్నదే. సహోదరుల యందుఁ బెద్దవానికే హక్కని నీతివేత్తలు వచింతురు. నీ విటుల నీతిని విడిచి నాతోఁ బగగొనుట మంచిదిగాదు'' అనియె.

ఆ మాటల విని యుపసుందుఁడు కొంచెము నిదానించెను. తిలోత్తమపై మరులు వేయి పాళ్ళున్నను సహోదరవాంఛ యొకపాలుండుటచే, ఓరీ! నీచా! ధూమ్రాక్ష కాలనేముల కెటుల వివాదంబు గలిగె. దాని నెఱింగింపుము. వినవలచెద ననియె.

---

# ధూమ్రాక్ష కాలనేముల కథ

—o—

బహు సంవత్సరంబులుగా నెవరికి భయంబు నెందక, యొక కాననంబున గాలనేమి యను రక్కసుండు నిరంకుశం బుగఁ బ్రవర్తించు చుండెను. వానికి ననేక రాక్షసులు సేనాపతులు. వారింగొని యచ్చ టచ్చట కేగి జయించి కప్పంబులం గొనుచు, జగదేకవీరుఁడై తాను నివసించు కాననంబుననే యొక మేడను గట్టించికొని మంత్రిప్రధానులు పరివేష్టింప మహామహిమను రాజ్యపాలనంబు చేసికొను చుండెను.

వీని నేస్తకాఁడగు ధూమ్రాక్షుడను నసురుండును, వీని వలెనే యనేక విధములగు సామర్థ్యంబులఁ జేసి బహు దేశంబులు తిఱిగి, యనేకుల జయించి యచ్చ టచ్చట నుండు వారి నందఱిని సామంతులుగాఁ జేసికొని సకల దేశంబుల కును నేకచ్ఛత్రాధిపతి యయ్యెను. వీఁడు తనకాలవ్యత్యస్త మునకుఁ దగినటుల దుర్మతి పుట్టి యనేక కాలంబుగా తనకు తోడుగా నుండిన నేస్తకాఁడగు కాలనేమిని జంపి వాని దేశం బును దనకు స్వాధీనంబుగాఁ జేసికొనవలయునని పేరాసను బొంది, కాలనేమిపై దండెత్తి వచ్చెను.

ఈ ధూమ్రాక్షున కెట్టి తలంపు పుట్టెనో యట్టితలంపే యా కాలనేమికిని నప్పుడే పుట్టెను. ధూమ్రాక్షుడు మనకు నేస్తకాఁడై యుండుట చేత మనకు సమానుడై యున్నవాఁడు. వా డుండువఱకు మనల జగదేకవీరుం డని యనరు. రాజులకు స్నేహితంబు లెక్కడివి? వీనింజంపి వీని రాజ్యమును మన రాజ్యముతోఁ జేర్చు కొంటిమేని నింకను నధికలాభంబును గీర్తియుఁ బొందమా యను పేరాస బుట్టెను. యుద్ధంబునకు సన్నాహంబులు చేయు చుండెను. ఇంతలో సేవకులు తనపై ధూమ్రాక్షుఁడు దండెత్తి వచ్చియున్న వా డని యెఱింగించిరి. "ఆడబోయిన తీర్థ మెదురయ్యె" నని కాలనేమి సంతసించెను. అయినను మన కోర్కెకుఁ దగినటుల వీ డెటుల వచ్చెనని యాశ్చర్య మందెను. వంట యింటిని గుందేలు తానుగా జొచ్చెనని యెంచెను. దగ్గఱికి వచ్చిన నే సంగతియు దెలియవచ్చునని తలంచెను. ఇటులఁ బరిపరి విధంబులను యోచించుచుండెను.

ధూమ్రాక్షుడు తన సేనలతో వచ్చిన వాఁడయ్యును దాని నెఱుక పడనీయక తటాలున జుట్టి ముట్టవచ్చునని సేనలను దూరంబుగా నిలిపి, తగు పరివారంబుతో గాలనేమి కడకు వచ్చెను. క్షేమసమాచారంబుల నెప్పటివలెనే విచారించెను. కాలనేమియు దన యింగితమును బయటికి దోపనీయక వంచనగనే ప్రవర్తించెను. మాటల సందున గాల

నేమి, ధూమ్రమాతా! నీవు దండుదళములతో వచ్చితివని చారులు చెప్పిరి. ఆ దండుదళముల నెట నిలిపితివి. దండు దళములతో వచ్చుటకుఁ గారణం బేమి? యనియె. "కాల నేమీ! యేమి క్రొత్తగా నడుగుచున్నవాడవు. నా సామర్థ్యము నీ వెఱుంగ నిదియా? ఏకచ్ఛత్రాధిపతినైన నాకు నే బయలు దేఱునపుడు అంతటి పరిజనంబు లక్కఱ లేవా? నీవు నేస్తకాఁడ వగుటచే సందడిగ నుండునని దూరంబుగ నిలిపి కొద్దిపాటి వారితో వచ్చితిని. ఇట్టిమాటల నికపై నాడకుము. నీ వడుగునది చూడ నీకు భయపడి నా సేనల డాచి వచ్చితి ననుకొంటివా, స్నేహితుండవని మన్నించితి. ఇంకొకడ వైన నిన్నిప్పటికి పిండియుడనే, నీతో యుద్ధంబు చేయుటకే వచ్చినాడనని యనుకొనరాదా? సంగరంబునకుఁ గావలసిన సన్నాహంబులు చేయరాదా? ఎవరు వద్దనిరి? ఒక యొరలో రెండు కత్తులు ఉండరా దందురు. నీవైనను నేనైనను బలిమి గలవారమని పేరెత్త వలయును. అందు నేసామర్థ్యము నేనెఱుంగుదును. కాలనేమీ! యేమో చెప్పెదనని యుండకుము. ఇది నవ్వులాట గాదు. తగవు లాట యనుకొమ్ము. నాసామర్థ్య మంతయు నీ విదివఱకే తెలిసియుందువు. నీ వికపై నన్ను సార్వభౌమునిగా నంగీక రించి, నా కడంగి యుండవలయును. నీపై నెవరైనను యుద్ధంబు చేయుటకు వచ్చిరేని నాకు నెఱింగింపుము. నేను

దండును బంపి నీవిపత్తులం దీర్చెదను. నీవిక సేనల నుంచు కొనరాదు. కోట కొత్తళంబులఁ గట్టరాదు. నీకే కష్టంబు లుండవు. ఇది హాయియగు పనియేగదా. దాని కేమని యెదవు'' అనియె.

కాలనేమి చెవులయందు నీమాటలు ములుకులై పోకెను. కొంతవడి మాటలాడ నోరురాక యుండెను. పెదవుల విఱిచెను. నిట్టూర్పుల నిగుడించెను. ఔరౌరా! ధూమ్రాక్షా! నేస్తకాడవని యూడకుండినందునగదా యింతటి పనికి దెగించితివి. నీవెంత నాకు? నా వ్రేలికిని సరిపోలవు. హనుమంతుని ముందు కుప్పిగంతులా? జాతి ప్రతిమకుఁ జక్కిలిగింతలా? ఏమి వింత? యని అట్టహాసంబు చేసెను. ధూమ్రాక్షా! నీవు సామర్థ్యుండవని నీవు మెచ్చుకొనియెదవు. నేను గట్టివాడనని నేను జెప్పెదను. ఊఱక వార్తలాడిన నెట్లు తెలియును? ఏదీచూతము. ఇరువురి సామర్థ్యము. దాచియుంచిన దండు దళంబుల దెమ్ము. ఘోర యుద్ధంబు సేసెదము. వాచాకైంకర్య మేల? కఱువని కుక్క మొఱుగునే కాని కఱచెడి కుక్క మొఱుగునే? నా కడంగియుండుమని యాడు దానితో జెప్పినను నది యడగి యుండునా? గండర గండయగు కాలనేమియా యణగువాఁడు. చెలికాడని యుంటినిబో చూచువారు నగరా? నేటితో మన నేస్తంబులు చాలును. లెమ్ము లెమ్ము. నీవిట

వచ్చి చాలసేపైనది. మొగమున మీసము గలవాఁడ వయిన యుద్ధంబునకు రమ్ము. బేడివైన లేచి నీయూరికి బొమ్ము. వంటయింటఁ గోకలం గట్ట డాగికొమ్ము'' అనియె. ధూమ్రాక్షుం డదివిని పాదతాడిత భుజంగంబువలె నతికో పంబు నెంది ''సరిసరి అటులైన యెడల నిరువురమే జగడంబు సేయుదమా? లేక సేనలంగొని యుద్ధంబు సలుపుదమా? ఏది నీకిష్టమో యెఱింగింపుము. అట్టులనఁ జేసెదము'' అనియె. కాలనేమి యా మాటలువిని యాగ్రహించి ''ఓరీ ధూమ్రాక్షా! నీ విపుడు తెచ్చిన సేనలు చాలవు. ని యూరికిఁబోయి సేనలను గూర్చుకొనిరమ్ము. అధిక సేనా బలంబు గల నేను స్వల్పసేనలుగల నీతో యుద్ధంబుసేయుట మగపాడి గాదు'' అనియె. ధూమ్రాక్షుండు కానిమ్మని మితి మీఱిన సేనలతో వచ్చెను. ఇంతలో కాలనేమియు యుద్ధ సన్నద్ధుడాయెను. రెండు సేనలును కలిసి ఘోరయుద్ధంబు సలుప ధూమ్రాక్ష కాల నేములు జయాభిలాషులై పోరి పోరి పెద్ద నిదుర పోయిరి. ఉభయసేన లదిచూచి మేష యుద్ధంబున జంబుకంబు చచ్చినకధవలె మనకేమి యీ బెడద యని వారివారి యిక్కల కేగిరి. కనుక వ్యర్ధముగా నా తరుణిపై నేల యాస జెందెదవు.ఏల చచ్చెదవు. అనవిని ఉప సుందుఁడు మేషజంబుకంబుల కధయంటివి. అటులగునా? అది వట్టి యబద్ధము. చెప్పువారికి మతి లేకున్నను వినువారికి లేదా.

ఇది యేటి మాట. ఈ బెదరింపులకు బెదరువాడను గాను'' అని యలక్ష్యముగా చెప్పుటను విని సుందునకుఁ గోప మధిక రించి యిట్లనెను.

"ఓరీ! ఉపసుందా! నీకుఁ గొంచెమైనను బుద్ధిలేదు. ఒక యడవియందు రెండు పొట్టేళ్ళుమదించి తిమురుబట్టి యొకటితో నొకటియెదిర్చి జగడమాడుకొనుచుండ, పొట్టేళ్ళ రెంటి నెత్తులనుండి నెత్తురు ప్రవహించి దిగువ కరడు గట్టి యుండెను. నక్క దానిగని మాంసఖండమని యెంచి పొట్టేళ్ళు జగడంపుఁజోటని తెలియక తినుచుండెను. వెను కకుఁబోయి మఱల వేగంబునవచ్చి యాపొట్టేళ్ళు ఒకటితో నొకటి డీకొట్టుకొనెను. ఆ రెంటికి నడుమ జిక్కుకొని నక్క ప్రాణంబుల వదలెను. అటులనే నేనును నా మనోనాయ కియు నొకటిగాజేరి వినోదక్రీడలఁ దేల నిచ్చగించు సమ యంబున నీవు దగ్గఱ నుంటివేని నీప్రాణంబుల యమపురి కంపగలము. అయిన నిదివఱకు సహోదరుఁడను వాత్సల్యం బున నూరకొంటిని. ఇప్పటికి నే పుట్టియు మునుగలేదు. తీవ్రంబున నివనంబును వదలి పఱువెత్తిపొమ్ము. దాన నీకు మేలగును. లేనిచో ప్రాణంబులు బొంది నుండవని యను కొనుము'' అని సుందుఁడన,

"ఓరీ! తులువా! నీవిట నిలిచి తామసించితివేని విపత్తు నొందగలవు. నే నిప్పుడే నిన్ను జంపి యీ నారీమణినిఁ

జేపట్టగలనని యుప సుందు''డనియె. ఇటుల నిరువురును బహువిధంబులుగా వాదాడుకొనుచుండునపుడు తిలోత్తమ యిరువురంజూచి యిట్టులనియె. మీరిరువురు నీమాదిరిగా కలహించుకొనుచుండిన నాకుఁ బ్రొద్దుపోవుచున్నది. కనుక దమయిషంబును నాకెఱింగింపుడు. లేనియెడ నాయిక్కడకు నేఁబోయెద"నన నట్టి సమయంబున సుందుండు ఆమెనుజూచి ''నాయకీ! పోవలవదు. నేనే నీ నాయకుఁడ''ననియె. ఏమిది? మీలో మీరే విపరీత కలహంబును బెట్టికొని ప్రొద్దు పుచ్చు చుంటిరేని నేనెవరిని నాథునిగా గైకొనంగలనెను. నాయకీ! నేనే నీనాథుండను. నన్నుం బరిగ్రహింపుమని యుపసుందుఁ డనెను.

ఔరౌర యిదేమి బూమెలు. అన్నకు భార్య తమ్మునకుభార్యయని యెవరైన వినిరేని బరిహసింపరా? ఛీ. ఛీ. మీరలు రాక్షసులగుటవలన మీకు వరుసలు వావు లెక్కడివి. మీతోటినేస్తంబు నాకు ముప్పును దెచ్చును. నే నెచటికేనిం బోయెద. నేను దేవవనిత నగుటంజేసి యొకరిని మాత్రము వలతును. తక్కినవారల సోదరభావ మున జూతును. మీరన్ననో మతిమంతులు కాక నొక వనిత నిద్దఱు వలచితిరి. ఎవరిభార్యనని నేను జెప్పుకొందును. అని చెప్పి యా యిద్దఱిని గ్రేగంటఁజూచుచు మందహాసంబు చేయుచుండెను. తిలోత్తమ వంచనాభావం

బెఱుంగక వారిద్దఱు ననూయాపరులై సమాధానంబుల కొప్పక జగడంబు లాడఁ దొడంగిరి. ఇరువురు నిటుల వాక్కలహంబునుమాని కేశా కేశిని బాహాబాహిని యుద్ధంబు సలిపి బ్రహ్మదేవుని వరము మేరకు నిద్దరు మడిసిరి.

ఈ యద్భుతంబును గనులాఱఁ గాంచి, తిలోత్తమ యానందమందెను. నా కోరిక నేటి కిందు ఫలించెను. అప్సరస ప్రయత్నించిన కార్యము విఫలమగునా? యని యెన్నుకొనుచు దేవలోకంబున కేగి యింద్రునకు జరిగిన వర్తమాన మెఱింగించెను. దేవతలందఱును బరమసంతోషమంది యిక మనకు మంచికాలమగునని యాతిలోత్తమను వేవిధంబులఁ గొండాడిరి. బ్రహ్మదు లాతిలోత్తమను ఆశీర్వదించిరి.

కోమలవల్లీ! ఒకనారిని వలచిన సుందోపసుందుల గతి జూచితివా? వారి కది మరణహేతువయ్యెను. కనుక నీవును ఇద్దరు మగలను గోరితివేని నీచే వారిరువురు నొకరి నొకరు కొట్టుకొని మడియంగలరు. అందువలన వీరిపైగల మోహంబును వదలి యంతిపురంబునకు వత్తువేని వీరికన్నను మేలైన సౌందర్యంబుగల రాజకుమారులలో నెవరినైనను నీకుఁ దగినవానిని మగడుగా వరించి, పెండ్లియాడి, మనోల్లాసంబుగాఁ బ్రొద్దుపుచ్చ నగునని చెప్పిరి. అదివిని రాకొమార్తె కోమలవల్లి పురుషవేషధారులగు మనోరమామరకతవల్లులపై కడగంటి చూడ్కుల నిలిపి, మందహాసంబుతోఁ జెలుల కిట్లనియె.

కోమలవల్లి :—అమ్మలారా! నే వలచిన నాయకులందప్ప నితరుని మొగంబైనఁ జూతునా? అదియునుంగాక తిలోత్తమా విషయంబు వేఱు. నా విషయంబు వేఱు. అది యాసుందోపసుందుల జంపవలయునని నిశ్చయించి యాదురుద్దేశముతో వచ్చినది. వారిరు పురకుఁ గలహంబు పెంచినది. తనకొక్కఁడే కా వలయునని వంచనల నాడినది. దాని మోసం బెఱుంగక వారలు చేలుపోయి యొకరి నొకరు కొట్టుకొని మరణించిరి. నా కట్టి దురుద్దేశము లేవియు లేవు. వారిని జంపవలయు ననుటయు లేదే. ఆ తిలోత్తమకు నావలె వారలిరువురిపయి నిష్టంబు గలదేని వారలు చత్తురే. ఏదో యొక విధంబున నుండరా? నాకు నాకథకు సాటిచెప్పెదరు. గుండు జాతికిని బోడితలకు ముడివేసి నట్లున్నది. నేనీ రాజ కుమారులపై నిష్టంబు గలదాన నగుటచేత వారలు చెప్పినటుల నడచుకొని యెవరికిని సంకటంబు రా నీయక కంటికి ఱెప్పవలెఁ గాచి యుందును. మీరు నన్నడ్డగింపకుడు.

చెలులు:—అమ్మా! ఏమి యాడెదవు. ఉత్తమకులంబునఁ బుట్టిన కన్యలకు సిగ్గు భయ ముండవలయును. నీవు ఉత్తమకులసంజాతవు. ఈ రీతిని మాటలాడుచుండిన

నితరు లేమందురు! గ్రంతల నవ్వరా? సిగ్గులేని కన్య సిగ్గుగలలంజ చెడుదురని వినవా? మన పరువునుం గనవా?

కోమలవల్లి:—చెలులారా! సిగ్గు భయము కులస్త్రీల కుండ వలసినదియే. మీమాటకు బదులు చెప్పువారెవరు? వారిరువుర నా మది గోరుటచేత వారలు నాకుం గులపతులైరి. నేను వారికి కులస్త్రీని. తనపతిని గుఱించి మాటలాడుటకు కులస్త్రీకి సిగ్గేటికి భయ మేటికి. ఇందుల కితరు లేమనుదురు? పతివ్రతలకు నితరులనేస్తము కూడదనుట చెడుమాటయే? నేను నామది కెత్తివచ్చిన పురుషులను వలచెదనే కాని యొకనిం బెండ్లియాడి మఱి యొకనిని గోరనుగదా? నేను కన్యను. కులశీల వయోరూపంబులు గల వరులను వరించుట పాడిగాదే. ఇది యంతయు నిదానించి చూడక యేమేమో వదరెదరు.

చెలులు:—అమ్మా! నీవు కోపింపవలదు. నీమదికిం దగినట్టుల మేమును సమ్మతించితిమి. కనుక మీరలు తమ యిష్ట మెఱింగించితిరేని నట్టుల నడిచికొనెదము.

కోమలవల్లి.—సరి! యిపుడు మీరు నాకుసుఖము గూర్చు చెలులుం ఇదివఱకుం గానివారివలె మాటలాడుచుం టిరి. కాని యికనైన నామాటను త్రోయకుడు.

అల్లదో మన కెదురనుండు నా యుత్తమోత్తము
లకు నా యిష్టము నెఱింగించి, వారలకు నాపై
నాసగలుగునటుల బుజ్జగించి తోడితెందు. మీకు
గావలసిన పసదనం బిప్పించెద.

చెలులు:—అటులనే తమ యిచ్చమేరకుఁ బిలుచుకొని
వచ్చెదము. సంతసంబుండుడు.

అని సమాధానంబులాడి, పురుష వేషంబు ధరించి
యున్న మనోరమా మరకతవల్లుల కడకేగి వందనంబు లాచ
రించి, "అయ్యలారా! మిమ్ము మా రాజకూతురు తోడి
తెమ్మనవచ్చితిమి. మేము మీ మ్మెటులనైనఁ బిలచుకొని
వచ్చెదమని చెప్పితిమి. మామాట ద్రోయక తాము దయ
చేసి రావలయు''నని వేడిరి. ఆ సమయంబున వేషధారులగు
వారిరువురు కలకల నవ్వి యిట్లనిరి.

మనోరమ:—పడతులారా! మీ రేమి చెలికత్తెలా? కుంటెన
కత్తెలా?

మరకతవల్లి—ఔను, ఔను. నాకును సందేహంబుగనే
యున్నది. చెలికత్తెలైన రాజస్త్రీలకడ పనులను
జేసికొనుచు, కన్యాంతఃపురమున నే మగవారును
రానటుల గావలి యుందురు. వీరివలెనుండిన ఆ
కన్యకు ఇరువదివేల మగలకుఁ దగ్గుదురా? అటుగాక
భోగముచానలై యుండిన ధనవంతులగు వారియొద్ద

నయవినయంబులజూపి, ధనము సంగ్రహించు మా ర్గంబునే చూతురు. వీరు అబులనుగాక వేటకాండ్ర వంటి మనలంజూచి పిలుచుటవలన వీరికేమి లాభము. మనచేతఁ గాసు వీసంబును లేదు. విల్లునమ్ములు మాత్ర మున్నవి.

చెలులు:—అయ్యలారా! మీరలు కొంచెమైనను నిదానిం చక మాటలాడెదరు. ఇదేమి యన్యాయము? మేము భోగము చానలము కాము. రాజాంతఃపుర పరి చారికలము. మా రాజకన్య మిమ్ముల దోడి తెమ్మ న్నది.

మరకతవల్లి:—ఔరౌరా! ఇదేమి వింత! మేము మీరాజ పుత్రిని నెప్పుడైన చూచియుంటిమా? మేము బాట సారులము. మమ్ముల మీరాజపుత్రి యేమెరు గును? తెలియనివారలను బిలువుమనుట యెట్లు? మేము రాము. మాకు కావలసియుండిన మీకడకు వచ్చియుండమా?

మనో:—ఇది యేటిమాట. పోపొండు. ఇష్టమున్నమీ రాజ పుత్రినే యిట రమ్మనుడు.

అని కోపమునటించిపలికిరి. చెలికత్తెలు భయంబు నొందిరి. ''ఇదేమి సిగ్గులచేటు, పురుషుడై వచ్చియుండిన మొద కన్యకలు కొంత బిగువు చూపవచ్చును. స్త్రీయే వలచి

వచ్చిన నింత మాత్రము గాక, మఱియెంతయగును? "పిలిచి పిల్లనిచ్చిన నీ కులమేమి గోత్రమేమి" యన్నట్లున్నది. మన రాజపుత్రి యెవరైన నేమి యందగాండ్రై యుండినఁ జాలు ననుకొన్నది. ఆస లేనివారిపై వలపుంచిన ఫలమేమి? కన్య వలచి వచ్చినందుననే వీరి కిట్టి యలక్ష్యమాయెను. ఛీ ఛీ యిదేమి సిగ్గులచేటు, ఎవరెట్టులైన మనకేమి? వీరు చెప్పిన సంగతిని నామెకుఁ జెప్పెదము. పిదప వారి యిష్టము. వీరి యిష్టమున్నది." యని తలపోయుచు రాజనందని కడకేగి పురుషవేషధారులు వచించిన సంగతినంతయుఁ దెలిపిరి. రాజపుత్రి బుద్ధిలేమికిఁ బరిహాసించి చప్పట్లు గొట్టి నవ్విరి.

వీరిటుల నివిధంబుగఁ జెప్పినది వినిన కోమలవల్లి వారితోడఁ దానును నవ్వి, సుదతులారా! తాఁ గోరిన కార్యంబునకు నౌకరులం బంపిన నాకార్యము నెరవేఱదని యందురు. బిడ్డను బంపిన యెడల, మఱి యొక విఘ్నమందురు. అన్యుల నంపినయెడల ననేకవిధ విఘ్నము లందురు. అటుల నీ విషయంబున నేనే పోయి యా యిరువురను సమాధానంబు చేసి మనయంతిపురంబునకు గొనిపోయి నేనే యాయిరువురను బెండ్లి యాడికొందు ననియె. ఆ మాటలను విని చెలికత్తెలు ఆశ్చర్యమునంది "అమ్మా! తాము చెప్పిన మాటలు మాకు వింత గొలుపుచున్నది.

అది మాకుఁ దెలియునటుల సవిస్తరంబుగఁ దెలుపుడు" అన కోమలవల్లి యది విని మంచిది నేను జెప్పెద. ఇపుడు నేనన్నమాట కనుగుణంబుగ నొకకథ నెఱింగించెద. సావధానంబుగ వినుడు.

ఒక వర్తకుఁడు తన సోదరుకడ భాగం బడుగుటకై యోచించి దీనికై మన మచటికిఁ బోవనేల? మన కరణమును బంపి విచారించుకొందము. అదియ మేలని దోచెడిని. అని యెంచి కరణంబును బిలిచి, అయ్యా! నా సోదరుఁడు నాకుఁ గొంచెము పైక మియ్యవలెను. నీవేగి లెక్క చూచి తీసికొనిరమ్ము అని పంపెను. కరణమును సమ్మతించి యావర్తకుని సోదరునింటికిఁ బోయి తన యజమానుఁడు చెప్పిన మాటల నెఱింగించెను. భాగం బియ్యమని యడిగెను. ఆవర్తకుఁడు మందహాసంబు చేయుచు నీ కడ నేనెటుల నియ్యనగును? ఆ సంగతి మీ యజమానున కెఱింగింపుమనియె. కరణ మా సంగతిని తన యజమానున కెఱింగించెను. పిదప తన కుమారుని తనయన్నకడ కంపెను. వర్తకుని కుమారుఁడు తన పెత్తండ్రి యింటికేగి తన తండ్రి చెప్పిన సంగతి నెఱింగించెను. అదివిని యావర్తకుఁడు సమయోచితములైన కథలను గొన్నింటిని జెప్పి "నాయనా! నేను పైకము నీయొద్దనిచ్చుట కభ్యంతరము లేదు. నేనిప్పుడే యిచ్చితినేని మీతండ్రి వృథాగాఖర్చుచేయగలడు.

కాన నాకడనే ద్రవ్యమును భద్రంబుగ నుంచియుంచెద. నీకు సరియైన వయసువచ్చినదే యిచ్చెదను. ఇపుడు దానితోనే మి"యనెను. చిన్నవాఁడు మన పెదతండ్రి చెప్పుమాటలు న్యాయయుక్తములని యెంచి మఱుమాట లాడక యింటికి వచ్చి సంగతి జెప్పెను. తరువాత వర్తకుఁడు పెద్దమనుష్యులం గొందఱినంపి యడుగ మనెను. వారటులనే వెడలి యడిగిరి. వర్తకుఁడు వారింజూచి, ''అయ్యలారా! వానికిచట భాగమేమి కలదు? వాని తాత ముత్తాతల సొత్తున్నదా? నేను బెద్దవాఁడుండునపుడు వీని కేమికలదు? ఇన్ని దినములవలె నూరకుండక చెప్పుడు మాటలను విని యాడునట్లున్నది" యనిచెప్పెను. వారును సమ్మతించి వర్తకుని కెఱింగించిరి. ఎవరిని బంపినను మంచిది గాదని తానే బయలుదేఱి వచ్చెను. అన్నంగని క్షేమసమాచారంబులరసి మాట పైమాటగా తన భాగం బడిగెను. అన్న యేమియు ననక వానిభాగము నంతయు సరిగా లెక్కదీర్చి యిచ్చెను. కనుక, నెవరైనను వారి వారి పనులను వారు వారేచూచుకొనుట మేలుగాని మఱియొకరిని బంపుట మూఢతనము. ఇది యెఱింగి యుండియు, మిమ్ముల నంపినందుచేతఁ బ్రయోజనంబు లేకపోయెను. నేనే పోయి యా కార్యంబును నెఱవేర్చికొని వచ్చెదను.

వెలులు:—అమ్మా! నీవు చెప్పినది యెవరును సమ్మతించు

నదిగానై యుండదు. వారిలో నెవ్వరు సమ్మతింపని వారై యున్నవారు. తాము మాత్రము పోయి వారి నెటులఁ దోడితెత్తురు?

కోమలవల్లి:—చెలులారా! మీరటులఁ దలంపకుడు. పూర్వము కాంతిమతి యను నొక కన్యక తాఁ గోరిన వరుని బెండ్లియాడినది.

చెలులు:—ఆకథ విన వలచెదము. వివరింపుడు.

కోమలవల్లి:—వయస్యలారా! హంసపురంబున సుందరేశుండను నొక రాజచంద్రుడు సౌందర్యఖనియై యుండియు నెవ్వరిని వలచినవాఁడు గాఁడు. ఇటులుండ సుందరపురి రాజగు నీలధ్వజ మహారాజు పుత్రి కాంతిమతి యా సుందరేశునిపై బద్ధానురాగయై యుండె. ఎవరేమి చెప్పినను వినక వారినే పెండ్లియాడెదనని పట్టుబట్టి యుండెను. తండ్రి కా సమాచారము తెలిసెను. తండ్రి యేమి చేయగలడు? కూతురి చిత్రపటంబును వ్రాయించి మంత్రిచేతి కిచ్చి "యీపటంబును గొనిపోయి హంసపుర వరాధీశ్వరుండగు సుందరేశునకుఁ జూపి నా పుత్రిని వివాహమాడు నటుల సమ్మతింపఁజేసి రమ్ము" అని పుత్తెంచెను. మంత్రి చిత్తమని యా పటంబు నెత్తికొని హంసపురంబు జేరి భూపతిని దర్శించి

తాఁగొనివచ్చిన రాజపుత్రి పటంబును మాటల సం దునఁ జూపెను. సుందరేశుఁ డదిచూచి "ఈ పట మేయూరు రాచ కన్యకది. ఇంతటి లావణ్యవతి యెందును లేదని యెంచి తెచ్చితివి కాఁబోలు! ఎంత లావణ్యవతు లైనను పురుష నిష్టంబు లేని దెటుల రూపవతులు కాఁగలరు. స్త్రీల లావణ్య మాతయు పురుషుల భావంబున నున్నయది. నాకేనారియు నందగత్తె గాజాలదు. నాకు నీపటంబును జూపియు ఫలము లేదు. నా యెడల రెండు నొక్కటియే" యనెను. మంత్రి యే మాటయుఁ జెప్పుటకు లేక యేమో యొక విధంబున మాటలను మఱపికొని యతనికడ సెలవు పుచ్చుకొని తన యేలిక కడకు వచ్చి, సంగతి నెఱింగించెను. రాజు చేయునది లేక తన కుమార్తెకుఁ దెలిపెను. కాంతిమతి యప్పటి కేదియు ననక యూరకుండెను. అటులఁ గొంతకాలంబు జరుగ నొకనాడు కాంతిమతి తన తల్లి కడకేగి "అమ్మా! హంపపురంబు దగ్గఱ నొక యరణ్యము కలదట. అందొక యుద్యానవనము రమణీయంబుగా నేర్ప ఱుపఁబడి యున్నదట. లోకంబున నుద్యానవనం బులు పురసమీపంబున నుండ నేఁజూచితింగాని అడవి యందుండుట నేఁజూడలేదు. అది యెంత రమణీ

యంబై యుండునో యని తన మనస్సులో యెంచెద. మన మందఱ మచటికి నేల పోవరాదు'' అని మెల్లనం జెప్పెను. తల్లి కూతురియింగితం బెఱింగినది కావున నా సంగతి తన పతి కెఱింగించెను. రాజు నొప్పు కొని తగుపరివారంబులతో బయలు వెడలి, హంస పురారణ్యమునకై ప్రయాణమయ్యెను. రాజు రాణియు కూతురును అరణ్యోద్యానంబున కేగిరి. అట యుక్తవిహారంబుల సంచరించుచుండిరి. సుందరే శుండు విహారార్థ మచటికరుదెంచెను. కాంతిమతి రాజు వచ్చుటంగాంచి యొక పొదరింట నేకాంతం బుగ నుండెను. సుందరేశుండు వనంబును బరికిం చుచు వచ్చి వచ్చి పొదరింటం బరుండియుండు లావ ణ్యవతియగు కాంతిమతిని జూచి "యిది యెవ్వతెయో! యిటకేలవచ్చి యున్నదో, ఇది దేవకామినియో. దేవకామినియైన నిట రాం బనియేమి ? మనుజకాం తయై యుండ నగును. ఇంతటి లావణ్యవతి నెందు నుం గానము. కన్యక లిట్టి యింపు సొంపులం గలవారలైన నిట్టి యువతుల పొందునట్టి పురు షుల భాగ్యం బేమనవచ్చు? నే నిదివఱకు నిట్టి చానలంగనని దోషంబుచే స్త్రీలయెడం బిచ్చి వైరా గ్యంబుబూని కాలంబు గడిపితిని. ఇది నన్నుం జేపట్టి

మన్మథరాజ్యంబునకుఁ బట్టంబు కట్టునో ? అటుగాక కట్టడిమై దిట్టతనంబున నెగదట్టునో ? యెటు దెలియు నని డోలాందోళిత మానసుండై దగ్గఱించెను. "చెలులారా! ఎంత గట్టి డెందంబుగల వాఁడైనను నింతుల నేకాంతంబునం గని మోహింప కుండునా" కచ్చడాల్గట్టుకొన్న ముని ముచ్చులును నొచ్చెంబులేక మచ్చెకంటులకు బానిసలై వర్తింపరా? ముఖ్యముగా స్త్రీరూపము తటస్థింపక వలపు పుట్టదు. దూరంబుననున్న వలపును దూరమే. లోకమర్యాద యిదియే. అది(యటుండనిండు, ఇటుల సుందరేశుఁడు తనపై వలపుంగొనివచ్చుటను గాంతిమతి చూచి, చివాలున లేచి కొంత మఱుగుగాఁబోయి యోరగా నిలిచెను. సుందరేశుఁడు వెనువెంట దగిలి, సుదతీ! నీవెవ్వరవు? నిన్నుం గనినదిమొదలు మదనుఁడు నిర్దయుఁడై వెనువెంట దగులుచున్నవాఁడు. పంచసాయకుని ఘాకనుండి నన్ను తప్పింప నీవే సమర్థురాలవు. నన్నుం గరుణింపుము'' అని యామెను బట్ట వచ్చెను. కాంతిమతి యిచ్చలేనటులఁ గొంతవఱకు వాదాడి "రాజేంద్రా! నేనుగన్యను. నాకు నీయిష్టంబు దీర్ప స్వాతంత్ర్యమున్నదే. మీరలు మాతండ్రి కడకు వచ్చి యడిగిన బాగుండును.''అని యొకవిధంబుగాఁ

దన యంగీకారంబును సూచించెను. సుందరేశుఁ డందులకుఁ సమ్మతించి, కాంతిమతితోడ నీలధ్వజు కడకువచ్చి యతని సమ్మతింబొంది సుందరపురికిఁ బరివారంబులతో నరిగి యట మహావైభవంబునం గాంతిమతిని బెండ్లియాడి సుఖంబుగ నుండెను.

చెలులారా! కాంతమతి సాహసంబును జూచితిరా! నేనేమి చెప్పిన మీకు నవ్వులాటగనే యున్నది. పుట్టి పెరిగి పెద్దవారైతి రను మాటయేగాని లోకానుభవంబు మీకుఁ జాలదు. లోకంబు నెఱింగిన వారలు నా మాటలందుఁ దప్పుపట్టరు. మీరేగినప్పు డారాజ కుమారులు జితేంద్రియులనలె మాటలాడి పంపిరి గదా. నన్ను జూచినవెనుక వారి జితేంద్రియత్వ మెఱుంగ వచ్చును. కంటి కింపగు సుందరియు నేకాంతమున లభించినచో జితేంద్రియు లింద్రియ జితు లగుదురు. ఇది యేటిమాట? మగవారిమాట మఱి నీళ్ళమూట యనుట యెవరెఱుంగరు? అని చెప్పెను.

చెలులు మఱుమాటలాడనేరక సమ్మతించిరి. ఔను గాదనక మిన్నకుండిరి. ఔనన్న నేమి వచ్చునో కాదన్న నీమె మనసునొచ్చునో? ఈబాధ మనకేల? యని యను కొనిరి. కోమలవల్లిని నడ్డగించువారలు లేనందున నామె

పురుష వేషంబు ధరించియుండు మనోరమామరకతవల్లు లుండుచోటికి నేకాంతంబుగ నేగి మనోహరులారా ! మీకు జోహారులని నమస్కరించెను. కోమలవల్లిని మనోరమ చూచి "ముదితా! నీ వెవరవు ? నీయూ రెయ్యది? పేరెయ్యది ? ఈ యడవి నొంటివచ్చుటకుఁ గతం బేమి ? వచ్చితివిపో; మా బోటి మగవారికడకు సిగ్గును భయంబును లేక వచ్చు టేల ? యని యడిగెను. కోమలవల్లి వారిరువురిని గ్రేగంటఁజూచుచు మందహాసంబుల నిగిడించుచు, తలయెత్తక కొంచెముగ వంచి నేల గీరలుగుచుచు నిట్లనియె.

కోమలవల్లి "మనోహరులారా ! నేఁ గన్యను. మాది కమలా పురంబు. పేరు కోమలవల్లి యందురు. చెలులతో వనవిహారంబు సలుప వచ్చితిని. నేనీ యూరి రాజ పుత్రిని. మిమ్ముల నిటం గనినది మొదల దేమి కార ణంబో కాని నామనంబు నాకు స్వాధీనమైయుండదు. దాన మీకడకు శరణంబు సొరవచ్చితిని. మీరలు నన్ను నాదరించి వివాహమాడి నామనంబు నచలం బుగ జేయుఁడు. నే నిదివఱకు నెట్టి వారినింజూచియు నిట్టుల వెతజెంది యుండ లేదు."

మనోరమ:—మేము యాత్రికులము. దినమున కొక చోటుగా నూరూరు తిరుగుచు బోవుచుండువారము. మమ్ము నీరీతి యడుగుట న్యాయమా ? రాజపుత్రి

వయ్యో నీకేల యది తెలియదు.

కోమలవల్లి:—సరసా! నే నిన్నిదినములవఱకు నెవ్వరినిం గోరక ప్రోషితనాయకి వలె నుంటిని. ఈ సమయం బున మిమ్ములఁ జూచినదే నామనం బానందపరవ శమై వలపుమీఱినది. కావున మీరు నన్ను వివాహ మాడి మనోల్లాసంబుగ నుండ నగును. మీరిరు వురిపై నేనెట్టి వలపును కలిగియున్న దాననో యటుల మీరిరువురు బద్ధానురాగులై యుండఁ దగుదురు. మీకు బదులు చెప్పుటకును దోచకున్నది.

మరకతవల్లి:—సుదతీ! పురుషులను జూచిన తోడనే పిశా చంబు పట్టిన దానివలె శివమాడ నొచ్చితివే. నీ విదివఱకు రెండఱు పురుషులను దోడుగా నుంచు కొని యుంటివి? ఇట్టి నడత గలదానికి నట్టులుండక తీరదు. నీవు పుంశ్చలివని తోచుచున్నయది. ఇట్టి వెలుచవ్రలంగలదానితో మాటలాడుటయు, గలసి మెలసి యుండుటయు బాపమూలంబు. పాపమూలం బననేల? ఇట్టివారు పాపమెవరు గనిరి, పుణ్య మెవరు జూచిరి. పాప పుణ్యములకు భేదమెయ్యది. పాప పుణ్యములే లేవు. అవి బలహీనుల మాటలేకాని మఱి వేఱుకాదని వాదు లాడుదురు. పాపులకుఁ బాపమన్న వారికిఁ దెలియదు. అది యాలోకంబు

మాట యందురు. దానితో మనకేల? ఈ లోకం బుననే వ్యభిచారులతోడి చెలిమి లోకంబుల పగకుఁ గారణంబై కొట్టుతిట్లకు లోనుగాఁజేయును. అందుల కేది లోటు?

మనోరమ:—సహోదరా! పలువురలో మన మొక్క రము గదా; మనలఁ గొట్టే వారెవరు? తిట్టు వారెవరు?

మరకతవల్లి:—అన్నా! మీరు చెప్పునది నాకే వింతయై యున్నది. ఎటులఁ జూచినను బురుషులు పలువు రొకటిగా నుందురు. స్త్రీలన్ననో యటులుండరు. ఒకరిపైనొకరు అసూయ చూపుదురు. చంపుటకును దెగింతురు. ఒక భోగముదాన మిగుల నందగత్తెయై తన్ను మోహించి వచ్చిన మనమోహనుండను రాజ నందను నొకరిని మనమోహను స్నేహితుండగు వివేకానందుఁడను మంత్రి కుమారునిం గొట్టి చంపఁ బ్రయత్నించెను. ఆ సమయంబున వివేకానందుని బుద్ధి సామర్థ్యముచే వారిరువురు తప్పించుకొనిరి. లేనిచో వారలగతి యధోగతి గదా. చెడిపెలకు నేస్త మెక్కడిది? వావి వరుస లెక్కడివి? చూచి నపుడు వారిపై గబ్బి యాస యుండును. వారి కోరిక తీఱిన వెనుక వారు వారే, వీరు వీరే.

మనోరమ:—అటులనా ? తమ్ముఁడా ! నీవింత తెలివిగల వాఁడవని యిదివఱకుఁ దెలియనైతిని. నీపై నతి సంతసం బందితి. ఇపుడు నీవు చెప్పిన మనమోహాను వృత్తాంత మెట్టిది ? నా కెఱింగింపుము విన వలచె దను.

మరకతవల్లి:—అన్నా! తమ యిచ్ఛమేర నాకథ చెప్పెదను సావధానంబుగ వినుడు.

---

సంబుజాక్షి యను దాసిచే మోసము చెందిన,

## రాజనందను కథ.

—o—

అంగజపురంబున నంబుజాక్షి యను నొక వేశ్య యుండెను. దానిని జూచిన వారలు వేఱు వారలం జూడ నొల్లరు. అది రతీదేవి విలాసంబును గ్రిందు చేయునది. అది యట్టి విలాసవతియై యుండుటంబట్టి పలువురు ప్రభువులు రాజులు దాని యింటిచుట్టును దిఱుగుచు నది వలసిన పదార్థంబుల ద్రవ్యంబుల నిప్పించుచుఁ దమ యిండ్ల నిల్లాండ్ర బిడ్డల పాపల గొడ్డు గోదల మఱచి దాని పాదసేవఁ జేయుచుండిరి. కాముకుల గతి మఱి యెట్టిది ?

ఇది యట్లుండ మనోలయ పురంబును బరిపాలించు రాజునకుఁ బుత్రభాగ్యంబు లేదయ్యెను. అతండు తనకుఁ బుత్రులు లేక గతులు లేవు గదా యని యోచించి, చింతాక్రాంతుఁడై యుండె. తన హితంబును గోరుచుఁ దన కడనుండు వృద్ధజనంబు లెన్ని విధంబులఁ జెప్పినను విన్న వాఁడు కాఁడు. పెద్దలారా! మీరలు చెప్పునటులఁ బుత్రుని వలన సకల దుఃఖంబులు పడయుదు మనుట నిక్కమే. దుఃఖములు లేని సుఖము లెక్కడివి? ఈ లోకమే దుఃఖ ప్రాయమైనది. అటులనని యన్న పానాది సౌఖ్యంబుల విసర్జించిన వారెవరు? ఎవరును లేరుగదా. అటులుండ నీ పుత్ర భాగ్యంబు మాత్రము నిసర్జనీయమని యేల యనెదరు. ప్రయత్నంబునఁ గొన సాగనిది యేది. ప్రయత్నములు లేకయే తనకుందానే వచ్చునని యుండిన నది కూడునే. నట్టింటఁ గూరుచుండి నాకుఁదిను భాగ్య ముండిన నానోటి కన్న మేల రాదు. అని యుండువానికి నన్న మెట్లు వచ్చును? కావునఁ బురుషప్రయత్నము కర్తవ్యము. పుత్రులు లేని వారెవరైనను నే ప్రయత్నములచేతఁ బుత్రులఁ బొందిరో యొతింగింపుడు. అట్టి ప్రయత్నంబునం జేసి నా కోరిక నెఱవేర్చికొందును అనియె. అందఱు యోచింపం దొడంగిరి.

మంత్రి తనలో నాలోచించుకొని యెవరైన నొక తపోధనుఁడు దొరకనేని నతనిం బిలుచుకొని వచ్చినయెడల

వారివలన నీ రాజునకుంగల భ్రమను బోఁగొట్ట నగును. ఈ పిచ్చి మన మాటలచేఁ బోవునదిగాదు. అని తలంచుచుండెను. దైవవశంబున నా పట్టణంబునకు నొక మహాత్ముఁడు వచ్చెను. వారి ఖ్యాతి పట్టణమంతట నొలయు వ్యాపించెను. మంత్రి యతని కడకేగి వదనంబు లాచరించి రాజసమ్ముఖంబునకుఁ దోడుకొని వచ్చెను. రాజు తపోధను నెదుర్కొని పోయి తగు విధంబుల వందన నందనాదికంబులం జేసి తృప్తుగ నొనరించి, యుంగ్రపీఠంబున నధిష్ఠింపఁజేసెను. రాజు తన కోఱతను నాతని కెఱింగించెను. అమ్మహాత్ముండు కొంతవడి యోచించి, "రాజా! పుత్రవాంఛ యీషణత్రయంబులలో నొకటి యనియు నది యనర్థ మూలకంబని యుఁ బెద్దలు చెప్పుదురు. అది సత్యమే. లోకులు వేదాదులందుఁగల విధి నిషేధంబులు సామాన్యములనియు నందఱు ననుష్ఠింపఁ దగినది యనియు భ్రమింతురు. ఈ విధి నిషేధంబులు సామాన్యములని విశేషములని యిరు దెఱంగులు. సామాన్య విశేషంబులు అధికారిం బట్టి యుండును. పిత్త రోగికి అపథ్యములైన వస్తువులు వాతరోగికి పథ్యములై యుండనగును. అందఱికి నొక్కటే పథ్యముంచిన యెడల రోగములకు బలమెక్కునే గాని తగ్గవు. ఆ రీతిని నీవిధి నిషేధంబులు నగునని గ్రహింపరు. ధనేషణ దారేషణ పుత్రేషణ లివి మనంబున జేర్పకుము అనుని షేధ వాక్యము

నకు దగిన యధికారి యెడవని మొదటఁ గనవలయును. ఇది సామాన్య నిషేధమై యుండిన యెడల నెవరును ధనంబు సంపాదింపరు. సంపాదింపనిచో యజ్ఞ యాగాదులం జేయం జాలరు. యజ్ఞయాగంబులే యుండవు. కాన యజ్ఞ యాగంబుల ప్రస్తావన వేదంబెట్లు చెప్పును ? వైవాహిక మంత్రంబు లేల చెప్పిరి? పుత్రునకుఁ దండ్రి సొత్తు చేరునని ధర్మశాస్త్రంబు లేల మొఱపెట్టును. చక్కఁగా యోచింపుము. నేను జెప్పుచున్నానని యేమఱి యుండకుము. అట్లగుటచేత నిది సామాన్య వాక్యమనరాదు. ఇది విశేష వాక్యమనియే చెప్పనగును. సన్యాసులకిది యుండరాదనుట నిర్వివాదాంశము. రాజోత్తమా ! ఈ మర్మము లెఱుంగని వారు వేదములు చెప్పునని భ్రమించి, నడివీధి మంటిని దలం బోసికొను నేనుగులవలె లేనిపోనివి కల్పించుకొని తాము చెడుటయేగాక, "తాఁజెడ్డ కోతి వనమెల్ల చెఱిచెనన్నట్టు ఇతరులను జెడుపుదురు. అదియునుం గాక నీవురాజవు ? రాజులేని యూరు ఏనుగులేని కొట్టంబువలెఁ బాడైపోవును. నీకు సంతానముండిననేగదా నీకుఁ బదంపడి యీ రాజ్యంబు నేలు వారుందురు. మా క్షేమంబును మీ క్షేమంబు నందే నిలిచి యున్నది. కావున సంతానంబు పడయఁ బ్రయత్నించుట కర్తవ్యము" అని మదలించెను.

రాజునకుండిన దుఃఖము మఱికొంతవృద్ధి యయ్యెను.

ముని చరణంబుల కెఱఁగి "స్వామీ! మీరలు సర్వజ్ఞులరు. మీ ప్రాపు వలననే నేను సంతానంబు పడయ వలయును. ఎట్టి ప్రయత్నంబుచేసిన నది సమకూరదు. నా కెఱింగించి పుణ్యంబు గట్టు కొనుడు" అని వేడెను. అప్పు డాతపసి రాజును గరుణించి "రాజోత్తమా! నీ వెందులకును భయంబు జెందకుము. నీకు బుత్రుండు పుట్టఁగలడు. పుత్రకామేష్టిఁ జేయింపుము. పూర్వము దశరథుం డీయాగంబు చేసియే తన ముసలితనంబునఁ బుత్రునిం గాంచెనని పెద్దలచే విను చున్నవారము. కావున నీవు నట్లులా జేసి పుత్రభాగ్యంబు నందుము." అని చెప్పి యా యాగంబునకు వలయు ద్రవ్యా దుల నెఱింగించెను. రాజు సంతసంబు చెంది యా ద్రవ్యంబు లన్నింటిని సమకూర్చి తపసికి నిప్పించెను.

ఆ తపోధనుఁడు చదుర్వేద పారంగతు లగు బ్రాహ్మ ణోత్తములచే యాగశాల నిర్మింపజేసెను. ఆ రాజును రాణిని మంగళ స్నాతులం జేయించి యాగశేషంబును వారికిచ్చి యాశీర్వదించెను. ఆయజ్ఞమహిమచే రాణి గర్భవతియై మగబిడ్డం గనియె. దాదులు రాణి మగబిడ్డ కనెనని రాజు కెఱింగించిరి. ఈ శుభసమాచారంబును విన్న రాజు మదినుప్పొంగి, చెప్పవచ్చిన వానికిని నితరులకును బసదనం బుల నిచ్చి సత్కరించెను. ఆబిడ్డకు మనమోహనుండని నామ కరణంబు చేయించిరి.

మనమోహనుఁడు పూర్వపక్షచంద్రునివలె వృద్ధినం దుచు నీడు తోడి బాలురతో నాట లాడుకొనుచుండెను. రాజు తన కుమారునకు విద్యగఱపువాఁడై యొజ్జలయొద్ద వద లెను. వాఁడు సకల విద్యలయందు నాఁతి తేఁటి వెలుంగు చుండెను. ఈ రాజకుమారుని తోడ వివేకానందు డను మంత్రి కుమారుఁడును సమాన వయస్కుఁడగుటంజేసి తోడి నీడవలె మెలఁగుచుండిరి. వారలు జీవదేహంబులంబోలె నొక రిని విడిచి యొకరుండరు. ఇట్లుండ వా రిరువురకుఁ బదు నాఱేండ్ల ప్రాయము వచ్చెను. వార లిరువురు నొకనాడు మనమీయూరియందే కూపస్థ మండూకంబులవలె నుండనేల? దేశాటనంబు చేసి లోకానుభవంబు నొందినంగదా ప్రజ లను రక్షించుటకు వలను గలుగును. ఆకలెఱుంగని వా డితరుల యాకలి నెఱుంగునే ? అని యొకరితో నొకరు మాటలాడికొనిరి. కావలసినంత ద్రవ్యము నెత్తికొని దేశా టనంబునకై యేగిరి. అనేక దేశంబులు గడచిపోవుతఱిఁ ద్రోవను మిథునపురంబుండెను. అచట మిగుల సౌందర్య ఖనియగు నొకదాసియుండెను. దానినిఁ జూచినవారంద ఱును మోహావేశులై దానికి బానిసలవలె, దాసి యడుగు ద్రవ్యంబుల నవారిగ నిచ్చి యందఱును గామోపభోగం బుల ననుభవింతురు. దేశాటనంబు చేసికొని యాత్రికుల వలె నుండు రాజకుమారుండు మంత్రి పుత్రుండును ఆ పురం

బునకు దగ్గఱనున్న యొక నందవనంబునకుఁబోయి కూర్చొని యుండిరి. అపుడు రాజకుమారుఁడు తనకుం గల మనోత్సాహంబుచే మంత్రి కుమారునింగని "మిత్రమా! వివేకానందా! మన మీ కొలంకున స్నానము చేయుదము రమ్ము" అని పిలిచెను. మంత్రికుమారుఁడు సమ్మతించెను. ఇరువురును తమ్మి కొలంకునం దిగి స్నానముజేసి నియమ నిష్ఠలన్నింటిని దీర్చుకొని వస్త్రాభరణంబు లలంకరించికొని యావనంబును జట్టి చూచుకొను చుండిరి. అత్తఱి నా యూరనున్న వేశ్య తనదు చెలికత్తెలతో నా నందవనంబునకు వచ్చి రాజకుమారుని మంత్రి కుమారుసిం గని వారి లావణ్యంబుల కతిశయిల్లి మెచ్చుకొని వా రిరువురితోడ సుఖానందమున దేలియాడుచు యన్నింటిని మఱచియుండెను.

దాసితోడ వచ్చిన చెలికత్తె లీసడిం గనుంగొనిరి. వేవేగ నింటికి వచ్చి యచటనుండు వారల కెఱింగించిరి. వారందఱు నిది విన్నతోడనే వారి మనంబులు పదరెను. ఆహాహా! ఇదేమి యాశ్చర్యము. ''కాచియుండిన వాని పిల్లను చూచుచుండిన వా డెత్తుకొనిపోయిన'' మోసముగా నున్నదే. ఈనగాచి నక్కలపాలుసేసితిమి. దీనికి మన మిందఱము దాసులమై యింటికి గావలియుండ నిది వారికి దాసియైనదే. ఇదేమి విపరీతము. ఆ దుష్టుల నిరువురిని తుండె తుండెములుగా నఱికి గ్రద్దలకు వేయవలయును.

ఊరక విడచుట పాడిగాదు. అని కోపోద్దీపిత మానసులై చెలికత్తెలు దారిచూప నందవనంబునకు వచ్చిరి. అచట నెవరును లేరు. ఎటకేగి యుందురని నలుప్రక్కలు తిఱిగిరి. ఒక దిడ్డ త్రోవ యందు నడుగులజాడను బరికించిరి. ఇటు బోయి యుందురని తీర్మానించిరి. పోవం బోవఁ ద్రోవ సాగినది కాదు. మఱల నీ యడుగులజాడ యొకతీఱున బోక మెలిదాఁరిం బడినది. దానిం బట్టికొనిపోవ నొక పూఁ బొదరింటియందు ముప్వురును సరససల్లాపంబుల నాడు చుండిరి. అది గన్నదే విటకాంద్రకు గుండె ఝల్లు రనెను. అందఱు నొక్క మొగి మూగిరి. కట్టుడు పట్టుడు పొడుపుడు అను కేకలతో వారలు జగడంబున కారంభించిరి.

అపుడు రాజకుమారుండగు మనమోహనుఁడు ఆ గడబిడఁజూచి దిగులొంది మంత్రి కుమారుండగు వివేకానందునిం గని మంత్రీ! ఇదేమి విపరీతముగానున్నదే. ఇందుల కేమి చేయవచ్చును. చెప్పుమని యడిగెను. ఈ జగడంబును గని యా వేశ్య వారి నదలింపక బెదరింపక మహాపతివ్రత వోలె నేడ్చుచు విటులకడకేగి యొదిగి నిలిచెను. ఆవిటులు తమ లంజపై నేరంబు లేదనియు వీరిరువురే బలాత్కారంబున నిలిపి కొనిరనియు నిష్కర్ష చేసికొనిరి. "అగ్ని నాజ్యముపోసి"నట్టు లయ్యెను. అపుడు వివేకానందుఁడు రాజపుత్రుం జూచి వయస్యా! ధర్మాధర్మంబులఁ బరికించు

చుండిన మన ప్రాణంబు లెగయును. వారును ధర్మాధర్మంబు లెఱుంగక యిద్దఱిపై నిన్నూరుగురు వచ్చిరి. దాన మన ప్రాణంబులు దక్కును. లేనిచో నుగ్గు నుగ్గగుదుము. నీ వెందులకు భయంబు నొందకుము. కష్టకాలంబున ధైర్యంబు సర్వార్థ సాధకము. ధైర్యంబు కన్న మించినది లేదు అని ధైర్యంబు చెప్పెను. రాజనందనుం డట్టులనే వారిపై బాణంబులను బరగించెను. వివేకానందుఁడును నిప్పుతోఁ జేరిన గాలివలె వచ్చిన పగవారిపై మర్మ భేదంబులగు బాణంబులను బరగించెను. పగవారలు దిగులొంది పఱువెత్తునట్లు సేసిరి. అపుడు వారలు పఱువెత్తుచు, ఓరీ వ్యర్థులారా! మీరు వీర్యవంతులరు కారు. అస్త్ర శస్త్రంబులు లేని మాపై బాణంబులఁ బరగించుట న్యాయమా? మీరు వీరంబు లేని వారగుటచేత నీవిధంబుగా బోరుచున్న వారలు. ఇదో చూడుము. ఇక నొక్క నిమిషంబులోపల మా సేనలం బిలుచుకొని వచ్చి మిమ్ములం బట్టికొని చిత్రవధం జేసెదము. ధైర్యంబు గల వారలైన నిలిచి యుండుడని శపథంబు సేసి పరువెత్తి పోయిరి.

అంతట మంత్రిపుత్రుఁడు రాజనందనుం దోడుకొని, తమ దేశంబునకు వచ్చెను. ఇరువురు రూపలావణ్యాతిశయంబుల మీరెడు స్త్రీలను బెండ్లియాడి సుఖంబుండిరి. వారలింటికి వచ్చినపుడు దేశాటనం బికపైఁ గారాదని తీర్మానించు

కొనిరి. ''మొగముగాలినపిల్లి పాలు త్రావున్నా?'' చెడిపెల తోటి సహవాసము ముప్పును దెచ్చును. ఆవిధంబున నీ కన్యకు నెందఱు పురుషులు తోడుగా నుందురో ? మన మీా పిల్ల నిచ్చగించితి మేని మనకు యమపురదర్శనం బగుట తప్పదు. అని నవ్వుచు పరిహాసంబుగఁ జెప్పెను.

ఆ మాటను కోమలవల్లి విని సిగ్గు నొంది రాజ నందనులారా! నేను భోగముచానను గాను. ఈ యూరి నేలురాజునకుఁ బుత్రిని. నే నిన్నిదినంబులు వివాహంబు లేకయుంటిని. నన్ను వరింపవచ్చిన యనేక రాజపుత్రుల నలక్ష్యపఱచినందున నన్ను మీారు దాసియని యలక్ష్యం బుగాఁ జెప్పితిరి. రాజకన్యలు తమకు దామ వరించుట లేదా? ఈవిధంబుగా నన్ను సామాన్యముగఁ బరిగణించుట నీతియే. వలపునిలిచియుండినదాని కెన్ని యంతరాయములు వచ్చినను నది వదలునే? కన్యకలు మగవారివలచుట నాతలనే పుట్టెనా? ఇదియెట్టిమాట. వలపునుగురించి ప్రాచీను లొక కథను జెప్పియున్నవారు. దాని నెఱింగించెద వినుడు. నా మాటలతోఁ జెప్పుటకన్న నా పుస్తకమునందలివి నాకు ముఖ్యములు. అట్టులన యప్పగించెదను.అందలివన్ని నెఱిం గింపఁబ్రొద్దుండదు. ముఖ్యాంశంబుల నెఱిగింతు వినుడు.

అన మనోరమయు మరకతవల్లియు నచ్చెరువంది రా జపుత్రీ అది యేమిగ్రంధము? దాని పే రెయ్యది?మాా కెఱిం

గింపుమనిరి. కోమలవల్లి, నాయకులారా! "వలపు గెలుపు" అని యీ గ్రంథము పేరు. వలపున కెన్ని యంతరాయము లేగుదెంచినను గడకది గెలుచుననుటయే దాని సారాంశము. విన వలచెదరేని నూకొను డనియె, వా రిరువురు సమ్మతించిరి. కోమలవల్లి చెప్పం దొడంగె.

---

## వలపు గెలుపు.

---

బాలాద్వీపమున సముద్రపు గట్టుననుండు నిసుకలో నొకబాలుడు పరుండి యెండ్రులు బొక్కనుండి వెలివచ్చుటయు, లోనికిఁ బోవుటయు, అవి యొకటితో నొకటి కలహించుటయుఁ జూచుచుండెను. వీ డీపని యందుండుట ప్రొద్దెక్కుట సహితము కన్నవాఁడుకాఁడు. చింపురు చొక్కాయలందు నెండ దూరుటయు వాని వీపునకుఁ దెలియకుండెను. ఎదుట నొక పిల్ల పొదలచాటున నుండి తొంగి చూచెను. వీడు భ్రమసి "లక్ష్మి"! నీవు వచ్చినది నేను చూడలేదు. ఇటురమ్ము. ఈ జగడంబును జూడుము చూడఁ దగినయది. నా మాట విను మనెను" వాని యెదురుగా ఇసుకలోఁ బోరగిలఁ బరుండి యొకరితల లొకరికిఁ దగులు నటుల "కన్నా! ఇంతవఱకేమి చేయుచుంటివి. అని యడిగెను. కన్నయ్య,త్వరగా "ఏమిలేదు. ఇటఁ జూడుము. అల్లదొ యుండు

వీరునిం జూచితే వాడు మిగుల ధైర్యశాలి. అబద్ధ మనుకొన కుము. దానికిని నదోయుండు నింకొకనికిని యుద్ధంబు ఘోరంబుగా జరుగుచుండెను. ఇపుడు వారలు కొంత సేద దీర్చుకొనుచున్నవారు. అదో మఱల జగడంబున కారంభించిరి. యుద్ధవీరా! నీవేమి చేయుదువు. వాడు మోటు కాడు. నీకు వందనము" అని చెప్పుచు వెలికిలకుఁ దిఱిగెను. లక్ష్మిని జూచెను. ఆనాడు లక్ష్మి యిన్నిదినంబులవలెఁ గాక చక్కని వస్త్రాభరణంబుల ధరించి యుండెను. అటు లుండుటకుఁ గారణం బెఱుంగడు. కన్నయ్య మొగంబున నుండిన భ్రమను లక్ష్మి యెఱింగెను. అదియు వెలికిలఁ బడుండి పక్కున నవ్వెను. ఆ నవ్వు కన్నయ్యకుఁ గోపంబు తెచ్చెను. లక్ష్మి! యీ డంభము లేకదా యెప్పుడును. ఇపుడేమో యెట్టులనో గుడ్డలు సొమ్ములు పెట్టికొంటివి. నా కదిచూపి నన్ను నూయూగ్రస్తుని జేయవచ్చితివా? నా చొక్కాయలు గుడ్డలు ఇపుడు చింపుగుడ్డలై యున్నను, ఎప్పుడైన నొక నాటికి మంచివి తొడుగనా కట్టనా? పో పొమ్ము అని కసరుకొనెను. లక్ష్మి మఱింతనవ్వి "కన్నా! నేను ఊరికిఁబోవు నాడే నాతో కలహము పెట్టుకొందువని యెంచలేదు. లేని యెడ నేనిచటికి వచ్చియుండను. ఇక నన్ను నెన్నటికిని జూడవు" అనియె. కన్నయ్య యది నమ్మలేదు. మఱలఁ బరిహాసంబుగా "నీ వెపుడును పోయెదఁ బోయెదనని చెప్పు

చునే యున్నావు. ఎపుడును బోయినది లేదు'' అనియె. లక్ష్మి అది నిజమే. ఈతూరి నేను పోయెదము. సత్యమ్మి సుమ్మి. చెన్నపట్టములో మా పెదతండ్రి యున్నాడని చెప్పి యుంటినిగదా, అతడు త్రాగి త్రాగి చచ్చినాడట. నాతండ్రి యిపుడు ధనికుఁడు. ధనికుఁడనుటయే గాదు. కుందపుర జమీన్‌దారుడు సుమా. నేనికపై నెంతయో గొప్పగ నుందును. నిత్యమును గుఱ్ఱపుబండ్లపై నెక్కి తిఱుగుచు నందవనంబులఁ జెఱలాడుచునుందునుగదా. నీ వేమితలంచెదవు అని చెప్పెను. ఈ మాటలు విన్నదే కన్నయ్య లక్ష్మి మొగంబును దేఱి చూచెను. నీ మాటలలో నొక యక్షరమును నమ్మను. నీవేమో గొంతెమ్మ కోరికలను గోరి చెప్పెదవు. నీ వెన్నడు నిజము చెప్పితివి? లక్ష్మీ! లక్ష్మి చేతులందట్టి కన్నయ చెప్పినమాటలకుఁ గోపగింపక, యీతూరి యబద్ధంబు గాదు నిజమే. మా తండ్రి కింత యాస్తివచ్చునని యెవరికిఁ దెలియును. అన్నియు భగవంతుని కృపాకటాక్షము. నేను వచ్చిన యోడలో నీ సమాచారముగల జాబు వచ్చినది. దానియర్థము నతండెఱుంగునంతలో రెండుమూడుమాఱులు త్రాగెను. వెనుకనే యతనికి జాబుసంగతి తెలిసినది. నాయొద్దఁ గొంత పైకమిచ్చి నాకుఁ గావలసినవి కొనుక్కొనుమని చెప్పెను. ఈ బట్టలను దీసి కొంటిని. నేడుసాయంత్రము పట్టము

నకు బోదుము. నా సామానులనన్నింటిని మూటకట్టుకొను మని చెప్పినను నీకుఁ జెప్పుటకై యిటకు వచ్చితిని అనిరెు. లక్ష్మి చెప్పినది సత్యమని కన్నయ్యకుఁ దెలిసెను. వీరిరువు రును జిన్ననాటనుండి కలసిమెలసి యాటలాడుకొనుచుండిన వారలు. కన్నయ్యకు లక్ష్మితప్ప వేఱు స్నేహితులు లేరు. వీని మనసు ఎట్టులో యయ్యెను.

"కన్నా! నేను చెన్నపట్టమునకు బోయిన నచటి కన్య లలో శ్రేష్ఠురాలనై యుందు"నని మాయయ్య చెప్పుచున్నాడు అని డంబములు గొట్టెను. "లక్ష్మి! యిప్పటికే నీకు మద మెక్కి యున్నది. అచటికి బోతివేని నీకుఁ గండ్లు తెలియ వని తలంచెద"ననెను. "నీవిట్లు మాటలాడు చుంటివేని నే నిక్కడ నిలువను. ఇపుడే పోయెదను—లేదు. లేదు. కన్నా! యిది మన కడపటి దినము. మొరటుగా మాట లాడకుము."

"నే నేమియు మొరటును గాను. లక్ష్మి! నీవీలాగు పోవుట నాకు సమ్మతిగ లేదు. నీవేల పోవలయును? మన మిచట నెంతో సుఖంబుగ నున్నవారము. క్రొత్త క్రొత్త కథలు ఎన్ని కావలసియున్నను జెప్పెదను. నీ వెన్ని పద్య ములు వ్రాయుమనినను వ్రాయగలను. పద్యములు నీ కింపు గదా. ఇచట నుండుపోయి పట్టమున నెక్కడిది? జలదారి గబ్బు, దోమల యుబ్బు.

"మఱల నే నిచటికి రానని తలచితివా ! ఏల రాను. మాకుఁ బైకమునకుఁ దక్కువే. పట్టణములోనుండ నవసర్యమైన యెడల నొకటి రెండు నెలల కిచటికి రానా? మా తండ్రి సామాన్యుఁడుగాఁడు. జమీన్‌దారుఁడు. అతనితోడఁ బోయిన నన్ని మర్యాదలు నేను బొందఁగలను."

"నీదేమో గొప్ప మర్యాదయని సొరకాయలు నఱికెదవు. నే నొకప్పుడు గొప్ప కవి నగుదును. చిత్రకారుండఁ గాఁగలను. అపుడు నా పుస్తకములను వేన వేలు వచ్చి తీయుదురు. నా పటము లెందరో కొనఁగలరు. జమీన్‌దారునికన్న నీ యుద్యోగము నింద్యమనెదవా? "జననాథగ్రణి యాత్మరాజ్యమునకు న్నిచ్చల్ పూజ్యుఁ డాసీమఁబా, సినదా గవ్వయుఁ జేయజాల డన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁడా, యనకన్నంగవి మేటి యూ" నను పెద్దల వచనంబుల విన లేదా? యని కన్నయ్య చెప్పెను.

"అపుడు మన మిరువురకుఁ బెండ్లి పట్టణములో నగును. అది మొదలు మనము సుఖులమై యుందుముగదా. కన్నా! మఱువకుము. నన్ను బెండ్లియాడునటుల మాట యిచ్చి తివిగదా."

నేను మఱువను. నేను మహాకవినై యుండునపుడు నీ కడకు వచ్చి నిన్ను పెండ్లియాడెదను. "లక్ష్మి ! జ్ఞాపక

ముందునా? నన్ను మఱువవు గదా;" యని యా బాలుఁడు చెప్పెను. "నాకు జ్ఞప్తి యుండును. నే నింటికి బోవలయు. మావారు నాకై వేచి యుందురు." అని పిల్ల యనెను. "నేను ఓడకువచ్చి నిన్ను నెక్కించి వచ్చెద. ఏమి చెప్పె దవు?" అని కన్నయ్య చెప్పెను. "అటులే రమ్ము. ఓడ మొదట వచ్చియుండెన." అని సెలవు పుచ్చుకొని యింటికిఁ బయవెత్తి పోయెను. బాలుఁడా సంగతినే కొంతసేపు యోచింపుచునుండి తనయింటికి మఱలెను. అపుడా యూరి వాఁడొకఁడు పఱువెత్తి వచ్చుచుండెను. సమాచార మే మని యడిగెను. మీతండ్రి నిన్ను వెదకినాడు. నీ వింటికి వచ్చిన వీపు బద్దలు చేసెదనన్నాడు. తనకు సారాయము తెచ్చియిచ్చువారలు లేరనుటయే కారణమని యెఱింగించెను. మంచిదని యా బాలుఁడు ప్రక్కయూరికి బోయి యంగ డిలో దూరెను. జనులు క్రిక్కిరిసి యుండిరి. వారిలో నొకడు ఒకమూల కూరుచుండ త్రాపుచుండి యీ బాలునిం జూచి యెచటికి వచ్చితివని యడిగి తెలిసికొని, నా యోడ కెపుడు వచ్చెదవని యడిగెను. మీ కిష్టముండిన నేడే వచ్చెద ననియె. అయితే సాయంత్రము రమ్మనని వాడు చెప్పెను. వీ డిదిచెప్పుట త్రాగుడువలననేగాని మఱివేఱు గాదు. బాలుడు రెండు సారాయి బుడ్లను కొనుక్కొని యింటికి వచ్చెను. కోపావేశపరుండై యుండు తండ్రి బుడ్లను

జూచినదే కోపము చల్లారెను. తండ్రికడ దానింబెట్టి యింట గల కొలంది భుజించి, తన సామానుల నెత్తికొని లక్ష్మి యెక్కియుండిన యోడకు వచ్చెను. వాని తండ్రి త్రాగుడు మైకముతో నుండుటచేఁ గొడుకు పోడక తెలియదు.

లక్ష్మియో ఓడ మొగదల నిలిచి యుండెను! కన్నయ్య దగ్గరకేగి "లక్ష్మి! మఱువవుగదా" యని మెల్లనఁజెప్పెను. ఏమి మఱువవు!—నేనొక గొప్పకవినైన పెండ్లియాడెదనన్న మాట—లేదు నేనుమఱువను. కన్నా! నీవు మఱతువేమో! ఆలస్యము చేయకుము.—నేను ఆలస్యము చేయను. దానికై నేడే యొకప్రయత్నము జేసితిని.—ఏమి మాటలాడెదవు!—ఏమియా? నీవు లేకుండిన నఱక్షణమైన నిట నుండను. ఈ యూరువదలి పాఱిపోవ నెంచియున్నాను. లక్ష్మి చేతులు తట్టి వికవిక నగియెను. కన్నా! ఈ బాలాదీవిని వదలి పోయెదవా! నీ కేమైన పిచ్చియా? ఎక్కడికి బోదువు. ఈ మాట వాని మర్మముల నాటెను. మొగము వాడెను. వాని ముఖ చిహ్నములనుజూచి లక్ష్మి, "కన్నా! ఇక్కడ నుండి పాఱిపోతివా చెన్నపట్ణమునకు రమ్ము, అచట మన మొకటిగా నాడుకొనవచ్చును. అని వారు మాటలాడు కొను చుండునపుడు ఓడ ప్రయాణ మగుటకు సిద్ధమయ్యెను. అది తెలిసి వారిరువురు నొకరి నొకరు ముద్దిడుకొనిరి. ఇదియే వారి మొదటి ముద్దు. లక్ష్మి నేఁబోయి వచ్చెద.

నన్నుదప్ప నింక నెవరిని వలవకుము. జ్ఞాపకముంచుము. ఓడప్రయాణమయ్యెను. కన్నయ్య సారాయియంగడి యందు మాటలాడిన వానియొద్దకువచ్చి యొకమూల దాగియుండెను. తెల్లతెల్లవారు నాయోడ బయలుదేరును. పగలు పండ్రెండుగంట లగు నంతవఱకుండి ఓడవానిం గనెను. వాడు చేయునది లేక పిల్లవానిని చీవాట్లుపెట్టి రంగూనులో దెచ్చి విడిచెను.

వాడటనుండి కొంత సైకము సంపాదించుకొని పట్ణము వచ్చి చేరెను. అట నెన్నియో కష్టములంది నాటకంబుల వ్రాసి యాడించి పేరు పొందెను. ఒక నాటకంబున లక్ష్మి తన మగనితో వచ్చిచూచి కన్నయ్యను కనుగొనెను. అది మొదలు మరల వారికి వలపులు తల చూపెను. ఆ సరికి కన్నయ్య యొకదానిని పెండ్లియాడి యుండినను దానిని సహితము చూడక యది మొరటుపట్టు కలదని రోసి యీ లక్ష్మితోడ కానరానిచోటికిబోయి తమ వలపులు దీర్చుకొను చుండిరి.

రాజకుమారులారా! యీకథ పెద్దదయ్యెను నూత్నముగ గాలవ్యవధి లేనందున ముగించితిని. వలపెట్టిదో చూచితిరా? ఎంతటిపనినైనను జేయనిచ్చును. అటుగాకున్న నేను బరిహాసంబులకు లో నగుదునా? తప్పు నాయదేగాని మీదిగాదు, అని కోమలవల్లి చెప్పుచుండ మనోరమయు

మరకతవల్లియు గోమలవల్లి మొగంబు చూచుచు మిన్నకుండిరి.

ఇటులుండఁ గోమలవల్లి చెలికత్తెలు అంతఃపురంబున కేగి రాజకుమార్తె చేసిన చిన్నదనమును రాజున కెఱింగించిరి. ఆ రాజు ఆశ్చర్యమంది "ఇదేమి పాపము ! బహు వింతగా నున్నదే. ఇన్ని దినములుగాఁ బురుషులన్న మొగంబునఁ గత్తులు కట్టుకొని యుండెను. నేడు ఎవరినో యిద్దఱిని జూచి వరించినదట. ఇందుల కేమి కారణంబో. ఒకపిల్లయే యొక మగవానిని వలచిన దనుమాట నమ్మువా రెవరు? ఇదేమి విపరీతముః ?" అని రాజు, మంత్రియు సేనాధిపతియు ప్రధానియు వెంబడించిరాగా వచ్చెను.

వీరు వచ్చుటను గాంచి పురుషవేషధారులగు మనోరమయు మరకతవల్లియు "చిన్నదానా ! నీవిదివఱకు మేము చెప్పినటులనే నీ మనోహారులు మమ్ము గడదేర్ప వచ్చుచున్న వారలు. మేలు మేలు. నీవిక నిటు నిలువకుము. వేగంబ నీ యునికికిఁబొమ్ము" అని నవ్వుచుఁజెప్పిరి. కోమలవల్లి మిగుల వెతనంది "నా మనోహరులారా! అల్లదో వచ్చెడివారు నా తండ్రి గారు. తక్కినవారందఱును మంత్రి ప్రధానులు మొదలగువారలు. మీ రేమి చెప్పినను నేను విన వలసినదే కదా" అని కోమలవల్లి పరితాపంబుగాఁ జెప్పుచుండెను. ఇది యంతయు రాజు ప్రధానులువిని కోమలవల్లిని సమీపించి,

రాజు:—అమ్మా! యిదేమి విపరీతము? నీ పాతివ్రత్యంబునకు మేమందఱము మెచ్చుకొనుచుంటిమి. మా మెప్పులు తప్పులగునట్లు మాకు తలవంపులగునట్లుచేయ నగునా? తల్లిదండ్రులము మేముండఁగా నీ వివ్వీధంబునఁ అస హాయవై యీ వనంబునకు వచ్చి బాటసారులపై నిచ్ఛయుంచవచ్చునా?

కోమలవల్లి:—తండ్రీ! లోకంబున స్త్రీలకుఁ బెండ్లియే గొప్ప జీవనము. కనుక స్త్రీలు పుట్టిపెరిగి యౌవనవతు లైన వెనుక,

చ॥ వరుఁగను నప్డు తండ్రికడఁ వచ్చెడివాఁడగు గోవిదుండు స
త్వరమునఁ దల్లి గోరు ధనవంతుని బంధులు వంశ విశ్రుతుఁ
గురుఁడు వివేకిఁ గోరు నిటు గోరిక లెల్లతి కీతి కత్తినన్
దరమిడి కన్యకామణులు తా మతి సుందరుఁ గోరు చుండరే?

యను నార్యోక్తులు మీ రెఱుంగ నివియే? వారి వారికిఁ దగినటుల వరుండుండినను నా వరునితోఁ గలయంత కాలము సుఖింప నెంచు సుందరులకు నిష్టము మేరకు నంద ఱును నడచుట యుక్తముగాని, యందఱి యిష్టముమేరకు కన్యక నడచుట సంభావ్యంబు గాదు.

రాజు:—అమ్మా! యొకరొకరును మేలునకే పాటు పడుదురు వానినెల్లను నీవు వేఱువిధంబుగాఁ దలప నగునే?

కోమలవల్లి:—తండ్రీ! పడుచులను బెండ్లిచేసి యిచ్చుట నెవ రెవరెటుల నెంచినను, కన్యక తనమది కెక్కు పురుషునే పెండ్లియాడి సుఖానందమున మనును. కావున నటులనే తాము కోరిన రాజపుత్రులను బెండ్లియాడనొల్లక, సమయము తటస్థించువఱకు మిన్నకుండితి. అతి సౌందర్యవంతులం గంటిని. వీరిపై నిష్టంబు నెందితిని. ఇందుగల తప్పిదం బేమి? వీరలే నాకు గూర్చు పతులు.

రాజు:—అమ్మా! నీవు చెప్పునది నీతిబాహ్యమై యున్నది. నీకు వీరలపై నిష్టంబు గలదేని మా కడకు వచ్చి మా కెఱింగింపవలయు. మేమును వారల నంతఃపురంబునకుఁ గొనివచ్చి, సమ్మతింపఁ జేసి, సకల దేశాధిపతుల కెఱింగించి రావించి పెండ్లి చేయుదుము. అటుగాక నీవీ తోటయందే వారితో పెనగులాడనేల? చింతింప నేల?

యని యామెకు ధైర్యంబుచెప్పి యంతఃపురంబునకు బంపి పురుష వేషధారులతోడను పరివారంబుతోడను నగరునకు రాఁజేరెను. కోమలవల్లి తండ్రిమాటలవిని కొంత ధైర్యంబు నొంది యంతఃపురంబునకుఁ బోయినను బెండ్లి యగునో కాదో యనుసందియంబుచే దిగులు నొందియుండెను.

చెలికత్తె లనేకవిధంబులఁ ధైర్యంబుచెప్పఁ గొంత నెమ్మది నొందెను.

మనోరమయు, మదనవల్లియు నంతఃపురంబున కేగిన తోడనే రాజున కిట్లనిరి.

మనోరమ:—రాజా! నా సోదరుండును నేనును నీ నగరంబును జుట్టి చూచుకొని వచ్చెదము. దయచేసి సెలవిండు.

రాజు:—అయ్యలారా! మీర లెందులకు భయంబు నొంద కుడు. ఈ రాచతిరకంబును, మీ చేతుల నున్న యది యని యనుకొనుడు. మీ కెట్టి ద్రోహంబును జేయను. కోమలవల్లి నెవరికైనను నిచ్చి పెండ్లి చేసి వారికే యీరాజ్యము నప్పగింపవలయుననియే యుంటిని. ఇన్నిదినంబులు నాకు నదియే యాలోచనయై యుండెను. దానివలననే నేను సకలదేశాధీశులకు నుత్తరంబు వ్రాసి పంపితిని. వారును మా రాజ్యంబునకు వచ్చి విచారించిరి. కోమలవల్లి సమ్మతించినది కాదు. రాజనందనులును మనస్సు విఱిగి వారి యిక్కల కేగిరి. ఇపుడన్ననో మిమ్ముఁజూచి నదే మరులు గొనియున్నది. మీరలు నామె యిచ్చ మేఱకు సమ్మతింపవలయు నని నా ప్రార్థన.

మనోరమ:—సరి! అటులనే మేమును సమ్మతించి యున్న వారము. అయినను మీనగరంబుననుండు వింత లన్నింటిని జూచిరావలయునను నాస జనించి యున్నది. రేపు తెల్లవాఱునంతలో వచ్చెదము. మా విషయంబున మీ కెట్టి సందియంబులును వలదు. లోకంబునఁ బుట్టినవార లందఱును సుఖంబునే ముఖ్యముగా గొందురుగాని దుఃఖమును గైకొందురా? అటులుండ నీ కోమలవల్లిని పెండ్లియాడినచో నీ రాజ్యంబున కధిపతులై యుందుముగా! "సిరి రా మోకా లొడ్డుదు రే?" దీనిని మేము వలదని నిరాకరింప నంతటి మూఢులమా?

అని నిశ్చయంబునఁ జేరాసగలవారివలెఁ బరితాపంబుతోఁ జెప్పిరి. వీరలు చెప్పినమాటలను విని రాజు మది నుప్పొంగి వా రిరువురితోడ భోజనశాలకేగి భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయంబులను చతుర్విధాహారంబుల దనివి తీఱ భుజించి లేచి వసంతమండపంబున కేగి కొంతసేపు మనోల్లాసంబుగ విశ్రమించిరి. తఱువాత వా రిరువురును దమ యిచ్ఛ మేరకు నగరును వదలి యా నగరప్రాంత్యంబుననున్న నందవనంబున నెవరికిని దెలియని యేకాంతస్థలమునందుఁ గూర్చొని తమ కాల వ్యత్యస్తమునకై చింతించి చింతించి, యడపగూడని నవ్వులతో మాట లాడికొనునపుడు మరకత వల్లి యిట్లనియె.

మరకతవల్లి:——అక్కా! మన మిన్నినాళ్ళు మగవేసంబు ధరియించి, తిఱుగులాడెదముగదా. మనల నెవ్వరును స్త్రీయని కనిపెట్టక పురుషులేయని భ్రమఁ జెందుచున్నవారు! అదియునుంగాక మనలను జూచునట్టి ప్రతి సుదతియు మనలఁ బెండ్లియాడఁగోరుచున్నది. ఇందులకుఁ గారణం బేదియో యూహింపఁ జాలకున్నాను.

మనోరమ:—అమ్మా! ఒకరొకరు అనుభవించునట్టి సుఖంబుల కన్నింటికి దైవసంకల్పమని తీర్మానించినను, వారు వారు పూర్వజన్మమునఁ జేసిన కర్మానుసారమే యగును. అందుల కొక పురాతనేతిహాసంబు కలదు చెప్పెద వినుము.

మరకతవల్లి:——నీ వట్టులనే చెప్పుమమ్మా! ఏలనని యంటివేని నాకు గొన్ని వేళల మదికి ధైర్యము తగ్గి యల్లల్లాడుచున్నది. అట్టి విట్టి యితిహాసంబులచే నివర్తి యగును. సందేహ నివర్తికాక యానందోదయ మెట్టులగును. ఆనందోదయంబు లేక మనంబచలమై యుండదు. కావున వేగ మెఱింగింపుము. అని యడుగ మనోరమ సంతసించి యిట్లు చెప్పదొడగె.

---

రాజుల జయించిన

# సౌందర్యవల్లి కథ.

—o—

అమ్మా, మరకతవల్లీ! పూర్వకాలంబున శాంతపురి యను పట్టణంబును వ్రతశీలుండను మహారాజు కీర్తి ప్రతాప ధుర్యుండై పరిపాలించుచుండెను. అతనికి ఇరువదుగురు మగబిడ్డలు. వార లెవరికిని భయపడని యసహాయ శూరులు. వారిపేరన్న లోకములు వెగడును. అటులుండ వ్రతశీలుని భార్య గర్భవతియై పదియవమాసంబున నొక శుభదినంబున నాడు బిడ్డను గనెను. ప్రక్కనున్న చెలికత్తెలు పఱువెత్తి వచ్చి రాజున కెఱింగించిరి. అదివిని రాజు భాగ్యమన్న నిదిగదా భాగ్యము. మగబిడ్డల నిరువదుంద్రఁ గని యింటికి యిరువదిగురు కోడండ్రు వచ్చిరి. ఇపుడొక యాడుబిడ్డ పుట్టెను. ఈ బిడ్డను చక్రవర్తి కుమారున కిచ్చి మహదానంద భరితుండ నగుదును. నాకు సాటి యెవ్వరు? అని యెంచెను.

దాదులు తల్లికిని బిడ్డకును మంగళస్నానంబు జేయించిరి. సౌందర్యవల్లియని నామకరణంబు బ్రాహ్మణోత్తములు చేసిరి. ఆబిడ్డ బాల చంద్రునివలె దినదిన ప్రవర్ధమాన యగుచుండెను. మూడవయేట విద్యాభ్యాసంబు

చేయించిరి. అచట సకల కళలయందు నాఱి తేఱెను. ఐదవయేట ధనుర్వేదంబును సాంగోపాంగముగా ననుభవ యుక్తంబుగా నేర్చెను. వింట బాణంబు యుద్ధంబు సేయు మార్గంబును అస్త్రంబులఁ బ్రయోగింపను, నుపసంహారంబు సేయను జక్కఁగా నేర్చి యట్టి దుండునాయని పేరొత్తెను. ఈబిడ్డ కుపాధ్యాయుఁడు రహస్యంబుననే నేర్పించుటంజేసి యీమె యింతటిదియని యెవ్వరికిని దెలియదు. అయినను తండ్రికి మాత్రము తన కొడుకులకు సమాన మెవ్వరును లేరని గర్వముమాత్ర ముండెను.

సకల దేశాధిపతులకును నొడయఁడై చక్రవర్తియను పట్టంబున దనరువాఁడొకడు దనకు సకలదేశంబులరాజులును కప్పము తప్పక గట్టుచుండుటయు శాంతపురిరాజుమాత్రము కప్పమును మూడేండ్లుగా కట్టకుండుటయుఁ కనిపెట్టెను. పరిజనుల నతండేల కట్టుటలేదని యడిగెను. పరిజనులు చక్రవర్తింగని "సార్వభౌమా, శాంతపురి రాజు మిగుల నుత్తముఁడు. వ్రతశీలుండను నామంబు గలవాఁడు. ఇదివఱకుఁ దప్పకయే కప్పము గట్టుచుండెను. ఇపుడు మూడేండ్లుగాఁ గట్టకుండుటకుఁ గారణము అనావృష్టియని తలంచెదము. లేనిచో నతని కప్పమే మనకు మొదట నందునదియని చెప్పిరి. అటులనే యుండవచ్చునని చక్రవర్తి తలంచెను. సజ్జనులు దెల్లనివన్నియు పాలనియు, నల్లని వన్నియు నీళ్ళ

నియు ననుకొందురు గదా. అది యటుండనిమ్ము. "చెట్టు చెడుకాలమున కుక్కమూతి పిందెలు పుట్టున"ను సామెత మేరకు, ఈవ్రతశీలుఁడు పేరాసఁగలవాఁడై, యుద్ధంబున మన కొడుకులు తేఱినవారుగదా. వారి సాహాయ్యంబున మనము చక్రవర్తిని నిరసించి, సార్వభౌమత్వము నేల చేకొనరాదు? మనకు వాఁడెట్లు చక్రవర్తి యగును. వానికిఁ గప్పము కట్టుటేల యని మూడేండ్లుగ చెల్లించిన వాఁడు కాఁడు.

చక్రవర్తికి వ్రతశీలుని దుస్స్వభావం బెటులఁ దెలి యును. అది తెలియనందున చక్రవర్తి యొకనాడు "మంత్రి వరా! నీవు శాంతపురంబున కేగి యాయూరి స్థితి గతుల నెఱుంగుము. రాజ్యము సుభిక్షమై యుండునేని వ్రతశీలునిం గనుము. అతడు చెల్లింప వలసిన బాకిని నడిగి వసూలు చేసికొని రమ్ము. అటుగాక కాటకంబుండునేని నతనిం గొని యిటకు రమ్ము. క్షామనివారణార్థమై ద్రవ్య సహాయంబు చేసెదము"అని చెప్పి పంపెను. ఆ మంత్రియు నట్టు లనఁ గానిమ్మని సమ్మతించి, తనకు సహాయంబుగాఁ గొందఱ సేనలనుఁబిలుచుకొని శాంతపురికి వచ్చెను. తన రాకను దూత మూలకముగా నెఱింగించెను. అపుడు వ్రతశీలుఁడు మంత్రి యెటువచ్చి యున్నాడను సంగతిని విచారింపక, తన కుమారులంబిలిచి, నా ముద్దుకుమారులారా! నేనొక సంగతిం

జెప్పెద వినుడు. మనయూరినుండి కప్పముపోయి యీ సారికి మూడేండ్లగుచున్నది. కప్పంబు గొని వచ్చుటకు దన మంత్రిని బంపియున్నవాఁడు. ఇందుల కొక యాలోచనఁ జెప్పుదురు గాక యని యడిగెను. వారలు మనోగర్వము నందినవారగుటం జేసి, తండ్రీ! మీరలు ఎందులకు భయం పడకుడు. వాఁడొక లెక్కయా? మే మిరువదుండ్రము విలువిద్యయందు నాఱితేఱిన వార మగుటచేత శత్రువుల చీకాకులై పఱువం జేసెదము. భయంబేల యని ధైర్యంబు చెప్పిరి. అంతట నావ్రతశీలుడు మంత్రిపంపినదూతతో "ఓరీ! మీమంత్రి కడకేగి నా మాటగా నిట్లనుము. కప్పమునకై యింతదూరము వచ్చితిరి. ఇట కప్పములేదు. నీళ్ళయందు నవారిగాఁ గప్పలున్నవి. కావలసినఁ బట్టుకొని పొమ్ము. నీవు చక్రవర్తివని మేము గైకొన్నగిదా నీకుఁ గప్పము వచ్చును. కప్పములేదు గిప్పము లేదు. మొగం బున మీసముగలవారలైన నిటకు రమ్మనుము, మేము విం టితో గప్పంబు గట్టెదము" అనియె.

ఆ మాటలను వినిన దూతలు ఆశ్చర్యమంది ఇదేమి కాలవిపరీతము. చక్రవర్తితో యుద్ధంబన వెన్న మ్రింగు నటువంటిదని యీ రాజు తలంచెచు గాబోలు, అని యొక రితో నొకరు చెప్పుకొనుచు, మంత్రి కడకువచ్చి యెఱింగిం చిరి. ఆ మాటలనువిని మంత్రిశేఖరుండు దిగ్భ్రమ నొంది

మనమిక నారాజునొద్దకు సమక్షంబునంబోయి విచారింప వలసి యున్నది. ముందు వెనుకలు యోచింపక చక్రవర్తి కడకుఁ బోయి, వీరి మాటల నమ్మి చెప్పరాదు. అతడేమి చెప్పెనో వీరేమి వినిరో, కడ కిది యెటుబోయి యెటువచ్చునో యని తలపోసి రాజనగరునకు వచ్చెను. మొగసలనున్న కావలివారలు రాజున కెఱింగించిరి. వ్రతశీలుఁడు తన్ను జూడవచ్చిన మంత్రిని దగువిధంబునఁ బూజించి, యర్ఘ్యాసనం బిచ్చి తన యొద్ద గూర్చుండఁ జేసెను. వ్రతశీలుని పుత్రులైన యిరువదుండ్రు ధనుర్బాణ తూణీరధరులై సభనువచ్చి కూరుచుండిరి.

అపుడు మంత్రి వ్రతశీలునింజూచి "రాజోత్తమా! మా చక్రవర్తికి మీబోటి రాజులందఱును గప్పంబు గట్టుచుండఁ దాము మాత్రము చెల్లింపకుండుటకుఁ గారణం బేమి?" అని యడిగెను. రాజు అధికోత్సాహముతో, "మంత్రివరా! చక్రవర్తికిఁ గారణం బెఱుంగ శక్తిలేకుండిన నుండవచ్చును గాని నీయట్టి మంత్రి కదిగోచరం బెకదా." అయినను జెప్ప వలయునని యడుగుటంజేసి చెప్పెద గమనింపుము. మీ చక్రవర్తికిఁ గప్పంబు గట్టువారలు అలతిరాజులు. వారితో సరిసమానంబుగా మమ్ములం గట్టమనుట పాడియే. దాక్షిణ్యమునకై కట్టితిమిపో; ఆ యల్పులు మమ్ము మదింతురా? కీర్తి ప్రతాపవైభవంబుల నాయట్టి వాఁడెవఁడు? ఇదో చూచి

తిరా? వీరు నాపుత్రులు. వీరి సామర్థ్యమును వర్ణింప నాదిశేషునకు నలవిగాదు. ఇక మీచక్రవర్తిమాటఁ జెప్పు౹? మేము కావలెనని మీదేశంబును గొల్ల గొట్టఁ గల వారము. మీ చక్రవర్తిని సహా యూరినుండి వెడలఁ దోలగలము. అయిన నితరరాజులు మిమ్ము లక్ష్యపెట్టరని యభిమానించి సహించియున్నవారము. కనుక మీచక్ర వర్తికి మా సామర్థ్యంబుల నెఱింగించి, మీ దేశంబును భద్రం బుగా నుంచుకొనుటకై మాతో సంధిచేసికొనుడు. అదియ మీకు మేలు. ఇకపై నెవరైన నిటవచ్చి కప్పమడిగిన వారికి యమపురంబు తప్పదని విప్పి చెప్పుము. ఈ తూరి మన్నించితిమి అనియె.

ఆ మాటలను విని మంత్రి యచ్చెరువంది, వింత వింతయని యెన్నుకొనుచు తన సేనలతోడఁ దన దేశంబున కేగెను. చక్రవర్తి యీ సమాచారంబుల నెఱుంగని వాఁడగుటచేత మంత్రింగని "ఆర్యా! శాంతపురికి తాము పోయివచ్చినసంగతి యేమైనది? ఆరాజ్యము సుభిక్షమా; దుర్భిక్షమా? వ్రతశీలుఁడు కప్పంబుగట్టుటకు నేమనుచున్న వాఁడు" అని యడిగెను. అందులకు మంత్రి "సార్వభౌమా! శాంతపురియందుఁ జక్కఁగా వానలుగురిసి పంటపైరులెక్క సుభిక్షమైయున్నది. అనావృష్టిగాని యితర యీతిబాధలు గాని యా రాజ్యంబునకులేదు" అనియె. 'అటులైన మనకు

గప్పమేల గట్టడు' అని చక్రవర్తి యడిగెను. "స్వామీ! యాకారణంబు చెప్పుటకు నాలుక రాకయున్నది. చెప్పినను దాము నన్ను బంపినందులకు నే విన్నంత కన్నంత యెఱింగించెదను. విన్నపం బాలకింపుడు. రాజేంద్రా! ఆ వ్రతశీలుని దేవరవారు కప్ప మడుగకుంటిరేని వాఁడేమియు మిమ్ముఁ జేయజాలడట. అతిక్రమించి యడిగిన దాను చక్రవర్తియగునట. కనుక వెల్లువ రాకమునుపే యన వేయుట మంచిది. అతని వింశతి పుత్రులును ధనుర్వేద పారంగతులు. వారిని ననాయాసంబుగా జయింప రాదు. మనమే నేఉనఁబోయి యుద్ధంబు చేసితిమేని వారెటులనైనను జయించి కొందురు. కనుకఁ దాము తమ యేలుబడికి లోఁబడిన రాజుల నందఱిని రావించి, యేకకాలంబున వానిపై యుద్ధంబునకుఁ బంపినయెడ నెంత బలముండినను దిగ్భ్రమ నొంది తమ ప్రాణములఁ గాచికొనుటకై పఱువెత్తి పోవుదురు. ఆ సమయంబున మన మానగరంబున కేగి యందు నుత్తమ గుణవంతుఁడగు నొకని నేరుపఱచి గౌరవంబును దక్కించుకొననగును. రాజు లెపుడు నిజ బలము, పరబలము, కాలబలములగు నీమూటి నెటింగియే యనుసరింపవలయును."

అని మంత్రి చెప్పినదే రాజు కొంత యోచించి, "మంత్రీ! నీవు వచించిన మాటలను నిరాకరింపను. అయినను

వాఁడట్టి ధైర్యవంతుఁడని తామెల్లెఱింగితిరి'' అని యడిగెను. "సార్వభౌమా! ఎవరికిని నెచట నెపుడును ధైర్యమే సర్వార్థ సాధకంబైనది. ధైర్యంబు గలవారు యుద్ధంబునకు వెనుకంజవేయరు. వారిని సమయోచితంబుగా జయింపవలయును. అటుగాక సమయము దొరకనిమ్ము. చూచుకొందమనిన నది సరిగాదు. కనుక నిప్పుడే యుద్ధంబునకు సిద్ధంబుగావలయు'' అని చెప్పెను.

ఆ మాటలనువిని, చక్రవర్తి యచ్చెరువంది చెప్పుచున్నాడు. ''మంత్రి శేఖరా! నీవు వచించినది నిక్కమే.

---

# గంధవతి.

—o—

తనకధిక బుద్ధి యుండినఁగాని వేఱొకరి ♦ తగుబుద్ధి వినఁగవలయుఁ
దానధిక శూరుఁడై తగుచున్న వెంబడిని ♦ దళములను జేర్చవలయుఁ
ఘనతఁగలవిద్వాంసుఁడై నతను మించఁగల ♦ కవి జనుల కణఁగవలయుం
గాశ్యపినినొక ఛత్రమున నేలువాఁడయ్యు ♦ గరువంపుమంత్రివలయుఁ
వినఁదగిన సంగీత సాహిత్య పరుఁడైన ♦ వెలయు నుతికాఁడు వలయుఁ
వెలుగఁగలదివ్వెయైనను జక్కనెగద్రోయ ♦ వెలుగుటకుఁబుల్ల వలయుం
బెనుపాపకవణంబు దినువారువముతోత ♦ వెన్నంటు లకలిమగఁడా
ప్రియమైన నాకోర్కులనుదీర్చి తనికాద్రి ♦ శ్రీమించు కొమరుసామి.

అని మహాత్ములు వచించియుండు శాస్త్రప్రకారము ఎవరైనను తనకెంత సూక్ష్మబుద్ధి యుండినను ఇతరుల బుద్ధిని విని తాను నడువవలయును. కనుక ఆలోచనల వచించుట మంత్రి ధర్మమను న్యాయ ప్రకారము, నగళ్ళయందు మంత్రుల యొకరొకరి యుక్తి తంత్రంబుల నిదానించియే రాజులు రాజ్యపారిపాలనంబు సేయుచుండుదురు. అదియునుంగాక దశరథుఁడు, ధర్మరాజు మొదలగువారు నట్టులనే మంత్రుల సహాయంబుచే రాచఱికంబు సేసి మెప్పు వడసిరని పురాణంబుల వినుచున్నవారము.

కనుక నేనును ఆప్రకారమే మీ యాలోచన ప్రకారమే రాచఱికంబు చేయుచుండుటచేత నాకెట్టి భయంబును లేదు. అమాత్యశేఖరా ! మీ యిచ్ఛమేఱకు నడిపింతురు గాక యనియె. అదివిని మంత్రి సంతసించి, సార్వభౌమా! మనము కప్పము వానికడఁ దీయకయుందుమేని వానికి మనము భయంబుసెంది యండంగి యున్నవారమని తలంచుకొని, మనపై యుద్ధంబుచేయ వాఁడు వచ్చునేని యితర సకలదేశాధిపతులును వాని పక్షమునఁ జేరి మనల నెదిరింపఁ జనుదెంతురు. అటులంగాక మునుపే మనము ముందుజాగ్రత్తతో నుండవలయును. అందుల కేదైనను బ్రయత్నంబునేసి యుద్ధంబు సలిపి మన మందు జయించి, పరునిరాజ్యమును గైకొనవలయునని నుడివెను. సకల దేశాధీశులకుఁ గమ్మ

వ్రాసిపంపుడు. అందఱును వచ్చి మూగిన వెనుక, వ్రత శీలు నెదిర్చి వాని శాంతపురంబును గ్రహింపుడని ముదల యిచ్చెను.

మదనవల్లి:—అక్కా! ఆ వ్రతశీలుని నిరువదిపుత్రులకు నిరువది దేశముల రాజపుత్రికలను దెచ్చి పెండ్లి చేయించియుండునుగదా.

మనోరమ:—చెల్లెలా! ఆ వ్రతశీలుఁడు తన పుత్రులకు తన సమానులగు రాజుల కుమార్తెలందెచ్చి పెండ్లి చేయలేదు. "చేతుల నిండిన బంగారంబు కంటె కంటికింపైనది మేలని" తలంచి, తన దేశంబున నుండు రూపరేఖా విలాసంబులంగల ఉత్తమ కులస్త్రీలను నేరితెచ్చి తనపుత్రు లిరువదుండ్రకు బెండ్లిచేసి పెట్టెను. అందువలన వీని కేరాజును బంధువుగాఁడు.

కనుక, తనమంత్రి చెప్పినట్టులే చక్రవర్తియు సమ్మతించి దూతలయొద్ద బత్రికలవ్రాసి పంపి, సకల దేశాధీశులను వేఱువేఱుగా రమ్మనునటులఁ జెప్పి పంపెను.

ఆ మాటలను వినిన దూతలును రాజు నుత్తరువు మేరకు సకల దేశంబుల కేగి ఆయా దేశాధిపతులయొద్దఁ బత్రికల నిచ్చి చక్రవర్తి చెప్పిన విధంబును దెలియఁ బఱచిరి. దేశాధిపతులును ఏలయో యేమియోయని సందియంబు నొంది, తమ మంత్రులకుఁజెప్పి సేనాసమేతులై

చక్రవర్తి నగరంబునకు వచ్చిరి. అపుడు చక్రవర్తి వారలం జూచి, "నా ప్రాణపదంపు నేస్తులారా! మీరందఱును మన సేనలతోడ శాంతపురంబున కేగి వ్రతశీలునితోఁ గయ్యంబు సలిపి, వానిని జయించి వత్తురని గోరెదను" అని చెప్పెను.

ఆ రాజులకును వ్రతశీలునిపై ద్వేషంబు కలిగియుండుట చేత మదినుప్పొంగి చక్రవర్తి కిట్టులనిరి. "సార్వభౌమా! మేము నిదివఱకే వానిని జయించి, వాని కనేకదుఃఖంబులం గల్పించి, చంపవలయుననియే తీర్మానించికొనియుంటిమి. అయినను తమ కెట్టి కోపంబువచ్చునో యని యడంగి యుంటిమి. అదియునుం గాక మేమొకరొకరమే యా వ్రతశీలునితోఁబోరి జయింప వలనుగాదు. ఏల నంటిరేని వాని కొడుకు లిరువదుంద్రు మహావీరులు. వారికడ మితిలేని సేనలున్నవి. తమకుఁ జెల్లించుకప్పమును రాణువవీరుల కొసంగి, వారల కందఱికిని యుద్ధాభ్యాసంబులఁగఱపుచుఁ దమ సార్వభౌమత్వమును దాఁగ్రహింప వలయునను దుష్ట యోచనం గలిగియున్నవాఁడు" అని చక్రవర్తి మనంబును బహు విధంబులం గలంచి, యుద్ధప్రయత్నంబులకుఁ బురికొలిపిరి.

ఆ మాటలను విని చక్రవర్తియు "మేలు మేలు! వాని కిట్టి దురాలోచన కలదా? మంచిది. వానిని గష్టపఱచి యైనను నా దేశంబువదలి వాఁడు పఱువెత్తునటులఁ జేసితి

రేని నా శాంతపురంబును మీకు నిచ్చి వేసెదను. మీరలు దానిని భాగించి మెత్తుకొని యందు రాఁగలకప్పమును నా కియ్యక మీరే యనుభవించుకొనుడు.'' అని యుత్తరు వ్రాసంగెను. దేశాధిపతుల కా మాటలు త్రొట్టివిఱిగి నేతిని బడినట్లుండెను. అట్టులన కానిండని సమ్మతించి వారలు తమ తమ దేశంబులకేగి రాజ్యంబుల మంత్రుల కప్పగించి, సేనాధిపతులకుఁ దమ యిష్టం బెఱింగించి, యీ క్షణమే సకల సేనలను బిలుచుకొని యుద్ధసన్నద్ధులు కండని యాన తిచ్చిరి. సేనాధిపతులును తమ యేలికల ముదల మేఱకు రథ గజతురగ పదాతులతో చక్రవర్తి కడకువచ్చిరి. వీరి సేనల మొత్తమును గనిన చక్రవర్తికి మనంబు చలించెను. ఔ కారా! యిదేమి వింత? వీరందఱును మనపై యుద్ధం బునకు వచ్చినను, మనమీ రాజ్యమును వదలి యెక్కడికైన పాఱిపోవలసివచ్చును గదాయని తీర్మానించుకొని ధైర్యంబు విడువక యుండెను. దేశాధిపతులు తమసేనల నొకచోట నిలిపి, రాజులుమాత్రము ఒకటిగాఁ జేరి చక్రవర్తికడకుఁ బోయి మహాప్రభూ! మేము నేటిదినమే శాంతపురికేగి యా నగరంబును కొల్లగొని వ్రతశీలుని జయించివచ్చెదమని నుడి విరి. అదివిని చక్రవర్తి ''ధర్మమార్గ నిరతులగు రాజులారా! రాజుచేసిన దోషంబునకై కాపులను బాధించుట న్యాయం బుగాదు. మీర లిటనుండిపోయి యావ్రతశీలుని వాని

పుత్రవింశతిని, మఱియు వారికి సహాయులై వచ్చువారినందఱిని జయించి యానగరంబున మీ రొక్కరొక్కరును ప్రతినిధుల నియమించి, యందు రాఁగల లాభంబును మీరే యనుభవించుకొనుఁడు" అనెను. అదివినిన రాజులందఱు నట్టులన కానిండని సమ్మతి నొంది తమతమ సేనలతో శాంతపురికై పయనమైరి.

ఇట వ్రతశీలుఁడు చక్రవర్తికి దాను మును ముందు తెలిపిన యుద్ధ కారణంబును బురస్కరించుకొని, "జయాపజయంబు లెవరికి సొంతము. మనము జయింతిమేని సకల దేశంబులకు చక్రవర్తి గాఁగలము. సుఖంబు పడయంగలము. అట్లుగాక చక్రవర్తికి జయమగునేని, మనకుండనివాసమేది?" యని యోచించెను. తన యభిప్రాయంబును గొడుకులకుఁ జెప్పెను. వార లొక్కరొక్కరు తమతమ సామర్థ్యంబులకుఁ దగినటుల "తండ్రీ! యుద్ధంబునఁ బ్రవేశించినపుడు జీవితమును గాపాడికొని లోకసుఖంబును నిచ్చగొనుట న్యాయమగునే! మనము వీరావేశంబుతో నెదిరివానితో పోరు సలిపి, జయంబు నొందిన యెడల, సకల దేశంబులకును ఏకచ్ఛత్రాధిపత్యంబు పడయఁగలము. లేక మనము యుద్ధంబు చేసి చచ్చితిమేని స్వర్గపదంబు నందుదుమని చెప్పిరి.

ఆ మాటలను విని సౌందర్యవల్లి యిట్లనుచున్నది. "తండ్రీ! నా సోదరులు చెప్పెడిమాటలు నాకు రుచింపవు.

ఏలనంటి రేని వినుడు. సామభేద దాన దండంబులను చతు ర్విధోపాయంబులచే శత్రురాజులను మనము జయింపవల యును. అయినను వెల్లువ రాకమునుపే యడ్డువేయుటవలెె ముందు జాగ్రతగా నుండుటయే శ్రేష్ఠమార్గం బగును. కనుక మన నగరినుండి మనుష్య సంచారంబులేని యరణ్యంబు వఱకు పాతాళంబున సొరంగ మొకటి చేసిపెట్టికొని యుంటి మేని, శత్రువుల బలాబలంబుల నెఱింగి, తనబలమును, కాల బలమును, శత్రుబలము నీ మూటిని యోచించికొని, దాని ననుసరించుట దొడ్డది. మనకు యుద్ధంబుచేయ శక్తి లేని పక్షమున మనము బొక్కసంబునుమాత్ర మెత్తుకొని సొరంగ మార్గమున నడవులకేగి యటనుండి యొకదీవి కేగి యట సుఖానందులమై యుండవచ్చును. పిదప మనకు మంచి కాలము వచ్చునేని శత్రువుల నెదిరించి భయములేక మన దేశంబును మరల కైకొనుట యుత్తమోత్తమ మార్గము.

అయిదేండ్ల ప్రాయంబుగల తన కూతురగు సౌందర్య వల్లి చెప్పినది వినిన వ్రతశీలుఁ డచ్చెరువంది, ఔరౌర! ఈ మనబిడ్డ లిరువదుంద్రు తమ తమ భార్యా పుత్రులతో సుఖానందులై యుండుటయే గాక సకల శాస్త్ర పురాణం బులఁ జక్కగాఁ జదివి యున్నవారు. అటులుండియు వీరికి యుద్ధక్రమ మిట్టిదని తెలియక యున్నది. మన కుమార్తెకు వయసు ఐదైనను యోచన యధికంబై యున్నది. కనుక

నీమె యిచ్చుమేరకు మనము చేయుటయే మేలని యోచించెను. తన బిడ్డం జూచి, అమ్మా! సౌందర్యవల్లీ! నీ యన్నలు యుద్ధంబున జయించితిమేని మనకు భూలోకంబును, చచ్చితిమేని దేవలోకంబును గలదని ముష్కర వచనంబు లాడుచున్నవారు. నాకు నది సమ్మతియే లేదు. నీవు వచించునదియే న్యాయంబుగనున్నది. కనుక నీ యిష్టప్రకారమే నడచుకొనుట యపాయంబు లేని యుపాయంబు అని చెప్పెను.

పదంపడి వ్రతశీలమహారాజు ఆ నగరంబున నుండు శిల్పశాస్త్రజ్ఞుల రావించి, వారికిఁ బసనంబుల నొసంగి, తన నగరునుండి నూఱామడల వఱకు నొక సొరంగము త్రవ్వి యడవియం దొకమూల తలుపును ద్వారంబు నమర్తురు గాకయని సెలవిచ్చెను. ఆ శిల్పులునేదియుఁ దెలియనివారగుటచేత, రాజాజ్ఞప్రకారము చేసి ముగించి యిచ్చితిమేని మనను ద్రవ్యసహాయంబు చేయగలరని తీర్మానించి పదునైదు దినములలో నన్నియు ముగించి రాజున కెఱిఁగించిరి. రాజు వారిని బహూకరించి పంపెను. వ్రతశీలుఁడు తన పుత్రి చెప్పిన తంత్రప్రకారము సొరంగము త్రవ్వబడియుండు వినోదంబును జూచి ఆశ్చర్యమంది, తన బొక్కసమున నుండు ద్రవ్యంబులను, వస్త్రాభరణంబులను, నవరత్నములను నెత్తి యిరువది రెండు మూటలుగాఁ గట్టి సిద్ధం

బుగా గుహాద్వారంబు కడ నుంచెను. తన రథగజ తురగ పదాతి సేనలను కోటకు నలుప్రక్కల పద్మవ్యూహముగా నగరు చుట్టును, నిలుచునటుల నుత్తరు విచ్చి యుద్ధ సన్నద్ధుఁడై యుండెను.

చక్రవర్తి యానతిమేఱకు సకల దేశాధీశులు ఏక కాలంబున సముద్రంబు పొంగి వచ్చునటుల, ఓ యను ఘోషంబుతో శాంతపురికోటకు నలుప్రక్కల ఎనుబది యామడలకు సరిగా నిలిచి చుట్టుముట్టిరి. వీరలు బయలుదేఱి వచ్చునపుడు చక్రవర్తి యూరివారిని దొందరవు చేయవలదని చెప్పి యుండుటచే నా యాపదనుండి యూరివారు తప్పిరి. లేనియెడ నదివఱకే యా నగరస్థులు గాలియందుఁ దగిలిన బూరుగ దూదివలెను, ఏనుగులకాళ్ళ త్రొక్కుళ్ళం బడిన కప్పల వడువునను జెల్లా చెదరై యుందురు. చక్రవర్తి యంతటి యుదారగుణుండెవ్వఁడు? ఈ సేనలంగనిన నగరవాసులు భయంబుసెంది వారి వారి యిండ్లకేగి, తలుపుల మూసికొని తాళంబిడుకొను వారుగను, మిద్దె మేడలపై దాగు వారుగను, నుప్పరిగల నెక్కి సేనాబాహుళ్యమును జూచువారుగా నుండిరి. మఱికొందఱు ధనుర్బాణతూణీరధరులై మనయిండ్లకువచ్చినఁ జూచికొందమని ధైర్యంబున నిలిచి యుండిరి.

శాంతపురి సేనావీరులును సమయ మెట్టుల నుండునో యెవరెఱుంగుదురని దిగులంది కోటచుట్టు పద్మవ్యూహం బుగా నిలిచియుండిరి. ఈ యద్భుత దర్శనంబును కోట బురుజులనెక్కి చూచుచుండిన ప్రతాపశీలుండును, వాని కొడు కులును దిగులందిరి.? ఔరౌరా! యిదియేమివింత! యుద్ధం బు సేయుట యన నొకడొకనితో పోరాడినయెడల సామర్థ్య ము తెలియును. అటుగాక ఒక దేశంబుపై ననేకదేశం బులు పొరలివచ్చుట యన నెట్టిది. వీరలు దుర్మార్గులు. వీరి జోలి మనకేల, మన సౌందర్యవల్లి చెప్పిన విధంబునం జేయకుంటిమేని మన మంగళమును నేడే బలికావలసి వచ్చును. లోకంబుపై వాంఛ యవుడే తొలంగి యుం డును. అటుగాక మన ప్రాణములు పోయినను బోనిమ్ము. వీరికిమన సామర్థ్యంబులు చూపవలయునని యనుకొంటిమిగ దా?అది సరివచ్చునది గాదు. పులి యెంత సామర్థ్యము గల దియై యుండినను లెక్కలేని పశువులు వచ్చి పొడిచిన నేమి చేయును. దానిసందునం దగులుకొని ప్రాణంబులు కోలు పోవును. సామర్థ్య మట్టిచోటం దెలియునా? వీరితో యుద్ధంబు సేయువాఁడు మూఢుడేకాని సామర్థ్యవంతుండై యుండడు. ఛీ! ఛీ! వీరివంటి యల్పులే వీరితో యుద్ధంబు సేయవల యును, అని గొల్లున నగిరి. అయిదేండ్ల ప్రాయంబుగల సౌందర్యవల్లి బుద్ధికుశలతకు మెచ్చుకొనుచుండిరి.

ఇంతలో నెదిరి సేనలు కోటను దగ్గరించె. కోటకు జుట్టునున్న యుద్ధవీరులు భ్రమచెంది, పిశాచకూటంబులఁ గనినవారివలె, మాటలు తడబడ చేతులు సోల, మైమఱచి కండ్లు దూదులుగప్పఁ జేయునదిలేక గుప్పు గుప్పునఁ గ్రింది కొఱగిరి. అదిచూచి శత్రువులు అట్టహాసంబు చేసి, వారి చేతులందలి యస్త్రశస్త్రంబులఁబుచ్చికొని, నిరాయుధులం జేసి, వారి నొకచోటఁ గూర్చుండఁ బెట్టిరి. ఆ గోడును జూచిన యబ్బ కొడుకులు అవమానమందిరి. అమ్మా! నీవు పసిబిడ్డవైనను, బుద్ధియందుఁ బెద్దదానవే. ముందు మేము మా తల్లి గర్భమున జనించితిమి. ఇపుడు మే మంద ఱము నీ కడుపున బుట్టిన వారమైతిమి. మాకు రాఁగల యపాయంబును దెలిసికొని, మునుమున్న యందులకుఁ బరి హారంబును గల్పించి యిచ్చితివి. మేము మగవార మన్న మాటయేకాని నీవే మా కన్న మిన్నవు, అని మెచ్చుకొనిరి. తా మిదివఱకు సిద్ధముచేసియుంచిన మూటల నెత్తుకొని తన బంధు వర్గములతో నా వ్రతశీలుఁడు సురంగ మార్గ ముగా నెవరి కంటికిఁ గనబడక పోయెను.

అంతట శత్రురాజు లొక్కటిగాఁ జేరి, శాంతపురి కోట ననాయాసంబుగాఁ జొచ్చిరి. పోయిచూడ వ్రతశీలుఁడు గాని వాని కొడుకులుగాని మఱి యెవ్వరైనను లేక పాడు పడి యుండెను. బొక్కసంబును బరిశోధించిరి. అందొక్క

చిల్లిగవ్వయైనను లేదు. ఇదేమి క్రొత్త వింతయై యున్నది. అని యచ్చెరువంది యచటనే నాలుగైదు దినంబులుండిరి. శత్రువులు లేని యింట నెవరుండరు!

సారంగముగుండాపోయిన వ్రతశీలుఁడును వాని కొడుకులు కూతురు భార్య, కోడండ్రు మనుమలు మనుమరాండ్రు తక్కంగల చుట్టములు మొదలగువార లేబదుండ్రు నూఱామడ లేగి యొక కాననంబున కేగిరి. అది మనుజసంచారము లేనిదై భయంకరమై యుండెను. వా రచట నుండు నొకచో జేరి గుడిసెలెత్తుకొని వంటఁజేయ నారంభించిరి.

మరకతవల్లి:—అక్కా! నీవు చెప్పినది విని యానందించితిని. అయినను వ్రతశీలుఁడును దక్కంగలవా రేబదుండ్రు సురంగమార్గముగా నూఱామడలదూరము వచ్చినపుడు వంటచేసి భుజింపక, యడవికి వచ్చిన వెనుక వంటచేసికొనిరన్న నెట్లు నమ్మునది? ఎంత వేగంబుగా వచ్చినను అయిదు దినములు పట్టదా? అంతవఱకు నోట నీరువోయక యుండిరా? వారికి ఆకలి బాధలు లేకుండునా?

మనోరమ:—చెలీ! ఎవరికిని ఆకలిదప్పులు నిద్ర యివి మానును నీడవలె నుండునదే కాని వదలి యుండదు. దాని వలననే సుఖదుఃఖంబు లందుట యని యెఱుంగుము. ఏ రేబదుండ్రు ముందుగనే చెడని యన్నం

బుల సిద్ధంబు చేసికొనియున్నవారుగాన దానితో నీయైదు దినంబులు కడద్రోసిరి. వారు సురంగమున నెట్టిబాధలు పడియుందురో ఎవరి కెఱుక? వాని నంతయును బ్రస్తాపించుకొని యుండుట మేలుగాదని వదలితిని.

అది యటుండనిమ్ము. వ్రతశీలుఁడును అతని కొడుకులును దనుర్ధరులై యడవుల కేగి, జింకలు, మొసళ్ళు, కొండ గొఱియలు మొదలగు జంతువులను జంపి వాని మాంసంబుల నన్నింటిని దెచ్చియిచ్చిరి. అటనుండి యొక సెలయేటికరిగి యందు స్నానాదికృత్యంబుల నెఱవేర్చుకొని మంచి బట్టలం దొడిగికొని మహోల్లాసయుతులై వచ్చిరి.

వార లటకు రాకమునుపే స్త్రీలందఱును తాము నగళ్ళనుండి తెచ్చిన బియ్యము మొదలగు సామగ్రులతో, వేటయాడి తెచ్చినమాంసంబును జేర్చి పొలవు, బ్రింజి, కిచ్చిడి, కుర్మా మొదలగునవి చేసి సిద్ధపఱచియుంచిరి. అందఱొక్కటిగాఁ గూర్చుని తనివిదీఱఁ దినిరి. మనోల్లాసపరులై యుండిరి.

అపుడు సౌదర్యవల్లిని జేరంబిలిచి, అమ్మా! నీయుక్తి వాదంబున మే మందఱము బ్రతుకుగొంటిమి. ఇక మేము నడచుకొనవలసిన పద్ధతులను దెలియం జెప్పుము. మేము నట్టిపద్ధతినే యవలంబించి కృతకృత్యు లయ్యెదము అని

యడిగిరి. ఆ మాటను విని సౌందర్యవల్లి కొంత నిదానం బుగ యోచించి యిట్లు లనియెను. తండ్రీ! మనమిక నిచ్చట నుండగూడదు. ఈ యడవినుండి యతి శీఘ్రముగా నడచి మన చక్రవర్తికి గోచరింపని ద్వీపాంతరమున కేగుదము. అచట నొక దేశంబున మనము నొక నగరవాసివలె నుందము. మనశ్చాంచల్యంబు లేక మన యొద్దనుండు ద్రవ్యంబుల నుంచుకొని జీవించుచుందము. నాకుఁ బండ్రెండేండ్ల వయసు రానిమ్ము. అపుడు మీకు నేను సేనాధిపతినై మా యన్నలతోడ మనపై నొకేతడవను వచ్చి యెదిరించిన శత్రు రాజులతో యుద్ధంబుచేసి, యొకరొకరి దేశంబును బట్టు కొనుచు వచ్చి వారి వారిని మనకు వశంవదులుగఁ జేసికొని వారితోడ చక్రవర్తిని జయింపనగును.

సౌందర్యవల్లి చెప్పినమాటలను వినిన వ్రతశీలుఁడు అచ్చెరువంది, అమ్మా! నీ యిష్టంబు మేరకు నడచుకొనియెదము అని చెప్పి తమమూటలతో యా యేబదుండ్రును బాటసారులవలెనడచుటయు, ఆకలెత్తునపుడు తినుటయు, రాత్రి వేళరాఁగా గుడారంబెత్తికొని యందు విశ్రమించుటయును గాఁ బోవుచుండిరి. ఇందు గొందఱు మేల్కొనియు గొందఱు నిద్రపోవుచు నుందురు.

అపుడు దుష్టమృగములైనను దొంగలైనను వచ్చిన యెడల, వ్రతశీలుఁడు నతనిబిడ్డలును ధనుర్బాణతూణీరధరులై

వాని బాధనుండి తప్పింతురు. ఈరీతి నడవియంతయు దాటి యొక దీవికిఁబోయి, యచటనుండు నొక దేశంబున కేగి, యచట నైదువేలవరహాలకుఁ దోటలు బావులు తీసికొని విశాలమైన యొకయింటిని నిర్మాణము జేసికొని, యా యే బదుండ్రు నందు గాపురముండిరి.

శాంతపురికి యుద్ధంబు కేగిన రాజులందఱును అంతి పురంబున కేగి చూడఁగా, నచట వ్రతశీలుఁడును, అతని భార్యయు బిడ్డలును లేకుండుటచేత నచ్చెరువంది, చక్రవర్తికి దెలియఁ బఱచిరి. చక్రవర్తియు నిదేమి యాశ్చర్యముగా నున్నది యని యెంచి శాంతపురికి వచ్చెను. అంతఃపుర మంతయు వెదుక నారంభించెను. వెదుకునపుడు అంతః పురంబున నొకప్రక్కను సొరంగమార్గము కనంబడెను. ఔరా ! వీరిసాహసంబున కేమనవచ్చును. రాజురాలా ! శాంతపురి యేలికయగు వ్రతశీలుఁడు మిగులఁ దంత్రంబు గలవాఁడు.మన సేనలనుఁ జూచినదే దిగులొంది యీ సురం గమార్గముగాఁ బోయియున్నవాఁడు కాబోలును. కనుక మనమీ సురంగమార్గముగాఁ బోతిమేని వాఁడును వాని బిడ్డలును కనఁబడుదురు. వారి నచటనే యపుడే చంపక ఖైదిగాఁ గొని తేగలము. వారిని విచారించి యొక్కొక రాజ్యాంగము నందును వారలను బానిసలవలెఁ గనుచు, కష్టములైన పనుల నిప్పించుచు, కడుపునకు జాలని జీతంబుల

నిచ్చి బాధింపవచ్చును. అప్పుడే వారిని బరిహసింపుచు నుండనగునని చెప్పెను. అందఱును సమ్మతించిరి. సురంగ మార్గముగా నందఱు బయలు దేరిరి.

వార లెంతదూరము నడచినను దోవ సాగినదికాదు. వార లచ్చెరువంది యీ సురంగ మెంతదూరము పోవునో చూచెదమని పోవుచుండిరి. వారి కాకలి యెత్తినపుడు భక్ష్యంబులఁ దినుచు నిద్రవచ్చునపుడు సురంగముననే నిదు రించుచు నిటుల నైదు దినంబుల కా సురంగమును దాటి యడవికి వచ్చిరి. వ్రతశీలుఁడు తన కుటుంబము వారితో భుజించిన తావును జూచి యాశ్చర్యపడిరి. వారి చేతలకు నందఱు కడుపుబ్బ నవ్విరి.

అంతటఁ జక్రవర్తి సామంతులంజూచి, రాజురాలా! ఈ వ్రతశీలుఁడు మహాతంత్రశాలి. వీఁడు తనకుండిన మనోగర్వంబుచే మనలఁజులకనగా దలంచినాడు. మన సేనా బాహుళ్యమునుజూచి భయంబునొంది పఱువెత్తిపోయె ను. ఛీ! ఛీ! వాఁడు శూరుఁడా! వాఁడు నిర్వీర్యుడు. దుర్మా ర్గుఁడు అయినను ఇట్టి గర్వితుడై యుండుటచేత వీనిని నూఱక విడువఁదగదు. ఎటులనైనను వెతకి పట్టి తెత్తురని కోరెద నని సామంతులకు జెప్పి యీ సురంగమార్గముగానే శాంత పురి అంతఃపురంబునకుఁ బోయెను. తక్కినవారును జక్రవర్తి తోడ అంతిపురంబునకు వచ్చి యచట నాలుగైదు దినములు

భుజింపుచుఁ ద్రావుచుఁ సుఖగోష్ఠినుండిరి. చక్రవర్తియుఁ దాను ముందు చెప్పినవిధంబుననే యందఱి రాజులకును ఆ పురంబును విభజించి యిచ్చెను. వ్రతశీలుఁ డెచ్చటనుండి నను బట్టితెచ్చుట మీ భారమని యాజ్ఞాపించి చక్రవర్తి తన రాజధాని కేగెను. పిమ్మట నందఱును చక్రవర్తి చెప్పిన విధంబుననే యొక్కొక్క రాజును నా శాంతపురియందు నొక ప్రతినిధినుంచి, వారివారి దేశంబులకు వారువా రేగిరి. ఆ శాంతపురియందు వచ్చు పన్నులను అందఱును విభజించు కొని, చక్రవర్తికిని గొంత పంపుచుండిరి.

ఇటుల నాలు గైదు సంవత్సరములు గడచెను. పిదప సకలదేశాధీశులును శాంతపురిని వృద్ధిపఱుపవలయు నని యెంచి, నగరమునకు నలుప్రక్కలును తొంబది మైళ్ళ దూరమువఱకుఁ గల యడవులను గొట్టి సమపఱచి, అంద మగు మిద్దె మేడల గుడి గోపురంబులను గట్టించి, వీధుల నేరుపఱచి, యందు నగరవాసుల గాపురము కుదురునటుల జేసిరి. ప్రాతయిండ్లను గొట్టి యా స్థలంబున నొక్కొక్క రాజున కొక్కొక్క కోటవంతునఁ గట్టునట్లు శిల్పుల కుత్తరు విచ్చి తగుధనంబుల నొసంగిరి.

ఆ శిల్పులు నొకరికన్న నొకరు పేరెత్తవలయునను నాసచే తాము నేర్చిన శిల్పముల నన్నింటిని నుపయోగపఱచి దేవ రాజధానియో యని చూపఱు లనుకొనునట్లు కట్టిరి.

ఒక్కొక కోటకుఁ జుట్టును, మల్లెలు, మొల్లలు, ఇరువాక్షు లు, చంపకములు, జాజులు మొదలగు వాసన పూలచెట్లను అమర్చి సువాసన లీనునటుల జేసిరి. అచటచట వసంత మండపములు జలక్రీడా మండపములును కనుల పండువై యుండెను. పూలచెట్లయందలి మకరందమునుద్రావి మన ముప్పొంగి ఝుంకారశబ్దంబు లొసంగు భ్రమరంబులు శ్రుతి శాంద్రముగను సంగీత సాహిత్యములయందు నాతి తేటిన ఘన పాటకులవలె నెమళ్ళు కోకిలలు కూయ నా పురంబొప్పు చుండెను. దీని విలాసంబును జూచి యాయాదేశపు రాజులు తమతమ శిల్పులకు బహుమానంబుల నొసంగి పంపిరి.

పిదప నారాజులు ఒక్కటిగా జేరియుండుటకై విస్తార మైన మేడ యొకటి యందఱును నొకటిగాజేరి కట్టించిరి. అందు సకలరాజులును మహా వైభవంబుతో వచ్చిచేరిరి. వారొకరినొకరు చూచుకొని రాజులారా! మనమొకనాటికి మన చక్రవర్తి నిచటికి రప్పించి, విందు సేయవలయునని చెప్పుకొనిరి. దూతలను జక్రవర్తి కడకు బంపిరి.

అట చక్రవర్తి తన మంత్రి ప్రధానులతో గొలువుండి మనోల్లాసంబుగా సంభాషించుచుకొను చుండెను. శాంతపురి వృత్తాంతము ప్రసంగవశమున వచ్చెను. అపుడు రాజులు పంపిన దూతలు చక్రవర్తికి నమస్కరించి తమ యేలికలు చెప్పిపంపిన వృత్తాంతమును నివేదించిరి. చక్రవర్తి యది

విని, సరి ! అట్టులనే వచ్చెదనని చెప్పి పంపి, తన మంత్రి ప్రధానులతో, రధగజతురగపదాతిసేనలతో మనోల్లాసంబుగా శాంతపురికి వచ్చెను.

చక్రవర్తి రాక నెఱింగిన సకలరాజులును పఱువెత్తి వచ్చి చక్రవర్తికి వందనాదికంబుల నొనరించి పిలుచుకొని వచ్చి, యందఱికిఁ జెందిన యేకాంతమగు సౌధమునందు సుఖాసీనుం జేసిరి. చక్రవర్తికి పుష్పమాలికల నలంకరించిరి. దగ్గఱఁ గూర్చొని యతి వినోదవచనంబుల నాడుచుండిరి. అపుడు స్వయంపాకులు అన్నాదుల సిద్ధంబుచేసి యా సమాచారమందిచ్చిరి.

చక్రవర్తియు సామంతు లందఱును స్నానాదివిధులను దీర్చికొని, శుద్ధ వస్త్రాలంకృతులై, భోజనశాలకేగి తగిన పీఠంబులఁ గూరుచుండిరి. స్వయంపాకులు వారలకు నరటియాకులను వేసి, పంచభక్ష్యపరమాన్నంబులతో బదార్థంబుల వడ్డించి, పాత్రంబుల మధువుల నించి, రాజభోజనమును సిద్ధపరచి యుంచిరి. పని నన్నింటిని జూచిన చక్రవర్తి మదినుప్పొంగి, ఔరౌరా! ఈసామంతులందఱును శ్రేష్ఠులగుటచేత, మన గౌరవమునకుఁ దగినటుల గౌరవించిరి. మర్యాదస్థులగుటచే మనతోఁ దులదూగుచున్నవారు. వీరొకరొకరు సహోదరులవలె నున్నవారు. అవ్రతశీలుఁడో క్రూరస్వభావుఁడు. మహాగర్వి. అట్లగుటచేత వీరినెల్ల పగచేసికొన్నవాఁడు. అంతటితో నుండక

మనల నెదరింపఁ బ్రయత్నించెను. మన సార్వభౌమత్వము హరింప నెంచెను. వాని దుర్గుణమే వానికి కీడుచేసెను. యాచకుడై తిఱుగులాడ జేసినది వాని గర్వమేకదా యని యెంచుకొనుచు విందు నారగించెను. అందఱును నారగించి లేచిరి. నవరత్న ఖచితమైన సింహాసనంబుపై రాజు అధిష్ఠించెను. సామంతులును తగుచోట్ల గూరుచుండిరి. ఆటకచ్చేరి పాట కచ్చేరులు మహదానందంబుగా జరిగెను. అందఱును ఆనంద కందళిత హృదయారవిందులై యుండిరి. అపుడు సౌందర్యవతులగు కన్యలు తమ్ములంబులం దెచ్చి మడిచి యిచ్చుచు, పునుగు, జవ్వాది, కస్తూరి, పన్నీరు మొదలగు వాసనలను చక్రవర్తిపైఁ బూసిరి. కొందఱు పూలమాలికలు వేసిరి. మఱియు నుండగలవారు తమ యిచ్చమేరకు నాడుచుండిరి.

ఇటుల పగలు ఇరువది గడియల వఱకు నందఱును వేడుకలను బ్రొద్దుపుచ్చుచుండ నాట్యస్త్రీలు కొందఱు నాట్యంబు సేయుచుండిరి. మఱికొందఱు ఆటలంబాటలను బ్రొద్దుపుచ్చుచుండిరి. మల్లురుకొందఱు మల్లయుద్ధంబు సేసిరి. ఇట్టి వినోదంబులచే ముప్పది గడియలు చెల్లెను. చక్రవర్తి రాజులతోడ ఫలాహారంబుల భక్షించి, మనోల్లాసపరుడై యుండెను. పిదప రాజులందఱును వస్త్రమాల్యాభరణాలంకృతులై; చక్రవర్తిని సర్వాభరణ భూషి

తుం జేసి యొక యేనుగుపై నెక్కించి తా మందఱును గుఱ్ఱం బులపై నెక్కి కోటచుట్టు నూరేగిరి. అపుడు చక్రవర్తి యొక్కొక రాజుయొక్క కోటను, వానియందు నవరత్న ములు చెక్కి చిత్రపుఁబనుల జేసి యుండుటయు, దానికి దగి నటుల బాణవినోదంబుల జరిపించుటయు, నా యాకోటలు దీపపుకాంతులచే ప్రకాశించు ప్రకారమును, జూచి యచ్చె రువంది, సామంతులారా! ఇదేమి? యీ శాంతపురియంత యుఁ గోటలుగనే కట్టి విడిచితిరే. ఈ నగరస్థు లెచట నున్నవారని యడిగెను.

అదివిని రాజులు మందహాసంబు చేసి మహాప్రభూ! మన నగరవాసులకు మేము ఎట్టి కొఱతయును జేయలేదు. అయిదేండ్లుగా నీ శాంతపురియందు మాకు లభించిన ద్రవ్యం బున మీకుఁ బంపినదిపోను మిగత ద్రవ్యముతో మా బొక్క సంబుల నుండుద్రవ్యంబును వెచ్చముచేసి యిట్టి యద్భుతం బులకు నెలవగు కోటలను గట్టించి, యరణ్యంబుల దిద్ది పట్ట ణంబు చేసి యది వాసయోగ్యంబగునట్లు మిద్దెలమేడలఁ దోటలను గట్టి పెట్టితిమి. మీ రటకువచ్చి చూడవలయు నని విజ్ఞప్తి చేసి కొనిరి. అట కందఱును బోయి యైదారు దినంబులు వేడుకలు మీఱ నుల్లాసంబున నుండిరి.

ఇటుల నుండునపు డొకదినము సామంతరాజులు చక్ర వర్తితోడ మనోల్లాసంబుగా నందఱికింజెందిన నేకాంతభవ

నంబున నుండునపుడు చక్రవర్తి యిట్లనియె. రాజులారా! మీరలు నామనంబునకుఁ బ్రియులై యుండుటచే, మీకు సకల సంపత్తులు చేకూఱినవి. ఆ వ్రతశీలుఁడు మదోన్మత్తుఁ డైన కతంబున, బహు దుఃఖంబులకు నాకరుం డయ్యెను. మరకతవల్లీ! యిటుల నారాజులందఱు సచటఁ బదునైదు దినంబులు వేడుకగాఁ బ్రొద్దు పుచ్చిరి. చక్రవర్తి రాజులచే వీడ్కోలంది తన రాజధానిం జేరెను.

శాంతపురినుండి తప్పించుకొని పాఱిపోయిన వ్రతశీలుఁడు తన కుమార్తె బుద్ధి చాతుర్యంబుచేఁ బ్రాణంబులు దక్కించుకొని వచ్చిన సామర్థ్యంబును బహువిధంబులఁ గొని యాడుచుండెను. అతని కొడుకులు అడవుల కేగి యట ధనుర్విద్య నభ్యాస పఱచుకొనుచుండిరి. సౌందర్యవల్లి తనకుఁ బదియేండ్ల ప్రాయము వచ్చినదే మగవేషంబు వహించి తన యన్నలతో నడవుల కేగి శస్త్రాభ్యసన పరయై యుండెను.

అపుడొకసన్యాసి తన తపోబలంబుచే ధనుస్సును శస్త్రాస్త్రంబులను సంపాదించి, తనకరంబున బూని యందు వలన మృగ చోరబాధల నందక నిర్భయంబున నుండెను. సౌందర్యవల్లి యప్పటికప్పు డతని చర్యలను జూచుచుండి నది గావున నొకనాఁడు అతని కడకుఁ బోయి, పాదంబులపై వ్రాలి భయభక్తులతో నొకయోర నిలిచి, "స్వామీ! నా

సందియంబు దీర్ప వలయును. అది మీచేఁగాక యితరుల వలనంగాదు. ఎఱింగింప ముదల యిచ్చితిరేని నెఱింగించెద'' ననియె. అతండు నీ మదింగలవాని దెలుపు. ఆ సందియము దీర్చెద ననియె.

సౌందర్యవల్లి:—స్వామీ! భగవంతుఁడు ప్రణవస్వరూపుం డని పెద్దలవలనను శాస్త్రముఖంబునను గనుం గొంటిని. అతని నితర సాధనంబులు లేక సులభం బుగాఁ దెలిసి కొనుటకు శ్రేష్ఠంబగునుపాయ మెయ్యది నా కెఱింగింపుడు.

సన్యాసి:—వత్సా! పరమగోప్యం బడిగితివి. అయినను నీ యందలి వాత్సల్యంబున నెఱింగించెద. సావధాన మతి నాలింపుము. భగవంతుని సులభంబుగ నెఱుంగు నుపాయము యోగ మగును. భగవద్గీత లందు శ్రీ కృష్ణుఁడు "సమత్వం యోగ ముచ్యతే'' సమభావమే యోగమని యానతిచ్చి యున్నవారు. అట్టియోగము అభ్యాస యోగమని జ్ఞానయోగమని రెండు విధంబులు. ఈ యభ్యాసంబును ప్రాణాయా మంబని వచింతురు. ఈ ప్రాణాయామము పాకృ తము, వైకృతము, కేవలకుంభకంబని మూడు విధం బులు. పాకృతమే మంత్రయోగము. అజపాగా యత్ర్యాది మంత్రానుష్ఠానరూపమై సప్తకోటి భేదం

బులనుండు నది మంత్రయోగము. వైకృతమే లయ యోగము. మనోలయంబనియు నందురు. తనంతటఁ దానుగా మ్రోగుచుండు దశనాదంబుల విని పదియవనాద మెచట వడంగు నచటఁ దోచు చిత్కళలందు మనంబు నుంచుటయే లయయోగము. ఇది లక్ష విధంబుల నుండును. కేవల కుంభకంబే హఠ యోగంబు. ధర్మాత్ముండగు రాజపరిపాలితంబైన రాజ్యంబు నందలి పుణ్యనదీతీరంబున శాస్త్రంబునఁజెప్పియుండు మేరకు మఠమును గట్టించుకొని గురునికడఁ బథ్యంబుల నభ్యసించి, వారు చెప్పనటుల నష్టవిధకుంభకంబులచే ప్రాణములడ్డగించి కాయసిద్ధినిబొంది అణిమాద్యష్టైశ్వర్యంబుల స్వేచ్ఛా మరణంబుల నందుటయే హఠయోగము. ఈ ప్రాణాయామయోగులకు మొదట నభ్యసింపఁ దగినవి యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము లనునాల్గు. వెనుక నలవఱచవలయునవి ప్రత్యాహారము, ధ్యానము, ధారణము సమాధి యని నాల్గు. అభ్యాసయోగము సమలచిత్తులకు యోగ్యంబైనది. దుర్లభమైనది. సిద్ధుల నొసంగుచు నాత్మజ్ఞానంబును ప్రసిద్ధపఱచును. జ్ఞానయోగము నిర్మలచిత్తులకు యోగ్యమై సులభమై

ఐశ్వర్యజ్ఞానమాత్రంబు నిచ్చునదియై యుండును. ఈ రెండు యోగములకు భక్తి కారణము. భక్తికి వైరాగ్యమాది. ఈ జ్ఞానయోగమే రాజయోగం బందురు. ఇది పరమ పావనము పరమ గోప్యము. మోక్షమార్గము, నిత్యానందము, ఆగమ సిద్ధము. దక్షిణామూర్తి హయగ్రీవులచేఁ గొనియాడఁ బడినది సుమా!

సౌందర్యవల్లి:—స్వామీ! అటులైన నాకీ రాజయోగ క్రమం బెఱింగింపుడు.

సన్యాసి:—వత్సా! ఈ పరమరహస్యం బగురాజయోగం బును భక్తితో ననుసరింప వలయును. అటులం జేయఁ జేతకాని వారై సంసారంబున మునుంగు చుందురు. ఇది యెల్లరికి లభింపదు. భగవంతుని కరుణాకటాక్షపాత్రులైనభక్తులకే లభించును. కావున నీవు వినుము. ఇది మోక్షమునకుఁ బోవు పెద్దబాట. దాపవలసినవానిలో నిది గొప్పది. విద్యలకు మేటి. ఇది తారకము, సాంఖ్యము, అమనస్కము అని మూడు విధంబులగును. అందు తారకము మన స్సును నిర్మలముగాఁ జేయును. సాంఖ్యము బ్రహ్మ మిట్టిదని తెలియం జేయును. అమనస్కము అప రోక్షజ్ఞాన మగును.

జననమరణమను సంసార సాగరంబును దాటించుటకుఁ దేవరమై యుండుటచేఁ దారకంబని యందురు. ఇది పాపంబుల నశింపఁజేయును. కామక్రోధములఁ దల నెత్తనియ్యదు. మఱపును దొలంగఁ జేయును. ఆత్మ సుఖానుభవంబును వృద్ధి సేయును. ఉపనిషత్ ప్రోక్తమైనది. ఈ తారకయోగమును నభ్యసించుటకుఁ బ్రాలుమాలి యుపనిషద్వాక్యములను నోటఁ బ్రేలుటచేఁ గుక్షిలాభంబు గలుగునే? వత్సా! వారికి బ్రహ్మానుభవంబు నీటిమూట. చక్కెర యని నోటఁ బలుకుటచే రుచి తెలియునే? దీపమని చెప్పినంతమాత్రాన జీకటి పోవునే? అన్నంబును వర్ణించిన నాకలి యడంగునా? ఈ యోగాభ్యాసంబుచేఁ బ్రాణముల గర్వ మడగును. మనస్సు చలింపదు. ఇంద్రియము లడంగును. కామక్రోధములు దాగును. తనకు సుఖానుభవము దొరకును. ఇది యభ్యసించువారికి నన్నియుమితముగా యుండనగును. అటుగాక అధికంబుగగాని లేక గాని యుండరాదు. జనశూన్యమైన నిర్మల సమ ప్రదేశంబున గుశాజిన వస్త్రంబులఁ బఱచి, దానిపై సుఖాసీనుఁడై నడుము, గొంతు, తల వీనిని వంపక నిక్కికొని ముక్కుకొనను జూచుచు రెండు జాములు బ్రహ్మభావంబున నితరముల నెంచక గురు ప్రోక్త లక్ష్యంబున నిలిచి యందుఁ దోచు కళను తన మనంబున జేర్చి నిష్ఠ నలుపవలయును.

సౌందర్యవల్లి:—స్వామీ! ఆ లక్ష్యంబు లెయ్యవి ఎఱిం గింపుడు.

సన్యాసి:—వత్సా! ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవియని లక్ష్యంబు లైదు. వీనికే ముద్ర లందురు. దీనిని గురూపదేశమార్గంబున నెఱింగి యభ్యాసంబు చేయఁ బ్రణవంబునందలి నాద బిందు కళల నెఱింగి ప్రణవలక్ష్యార్థంబగుబ్రహ్మమే తా నను నిర్వికల్పస్థితిని బొందును. అని యా పురుష వేషిణియగు సౌందర్యవల్లికి నా రహస్యంబుల నెఱిం గించి మఱియు నిట్లనియె. కుమారా! యీ ముద్రల నభ్యసించితివేని, నాదబిందుకళల విని కనగును. ఈ నాదబిందుకలయందే మానసేంద్రియంబులు ని లుచుటం జేసి శరీర వికారంబు లుండవు. కావున నీ మార్గమే శ్రేష్ఠమైనది. గాలంబులేక చేపలు దొరకనివిధంబున నాదబిందుకళల నెఱుంగక యిం ద్రియమనంబులు నిగ్రహింపఁ బడవు. కావున ష ణ్ముఖిముద్ర నభ్యసింపు మనియె.

అంతట సౌందర్యవల్లి యాముద్ర నభ్యసించునదియై రెండు చెవులను మూసి వినెను. సంతసించి చెప్పుచున్నది.

స్వామీ! చిణి, చిణి యని రెండు విధములుగ శబ్దించిన పిదప, ఘంట యొకటి వినంబడియె. పిదప శం

ఖంబు మ్రోగెను. ఆవల వీణానాదంబు చెవుల పండువయ్యె ను. తరువాత నెవరో యాడి పాడి నట్లుండెను. వేణు నాదంబువింటిని. పిదప భేరి భాంభాం అని మ్రోగెను. మృదంగధ్వని విన నయ్యెను. మెఱుపుదీగలతో మేఘంబు లురిమెను. ఇవియేమి ?

సన్యాసి:——బాలకా! ఈ పదియుఁ బ్రణవనాదంబు లందురు. దీనినభ్యసింపని వారిమనంబులు అల్లలాడుచుండును. కావున నిది యభ్యసింపఁ దగినది.పిదప సౌందర్యవల్లి కనుంగవలను గురుని యనుమతింగొని మూసి బొమల నడుమ దృష్టిని నిలిపి జితేంద్రియత నొప్పి కొంత యుండి యిట్లనియె!

స్వామీ! కృపాభూమీ ! మొదట నేదో యొకటి కనంబడినది. అందుఁ జూపులై కనులవెంట నొకటి పోవు చుండెను. అది యేమి?

సన్యాసి:——నీకు మొదటఁ దోఁచినది చిత్తాకాశము. కనుల వెంటఁ జూపులై పోవునది మనస్సు, అంతలి వింతలం జూచి చెప్పుము.

సౌందర్యవల్లి:——స్వామీ! స్వామీ ! నా కనులకుఁ గానం బడుచున్న చిత్తాకాశంబున రూపంబులేక యొకటియు గటికిచీకటిగ నొకటియు. కారు చిచ్చొకటియు, లెక్కలేనికాంతులనుగలిగి యొకటియు, కనులు

మిఱుమిట్లు కొలుపు వెలుగుగల దొకటియు నిటుల నైదు కనంబడు చున్నవి. అవి యేమి?

సన్యాసి:—వత్సా ! మొదటిది గుణరహితా కాశమనియు, రెండవది పరాకాశమనియు, మూడవది మహాకాశ మనియు, నాల్గవది తత్వాకాశ మనియు, అయిదవది సూర్యాకాశంబనియు వచింతురు. ఇక నా యాకాశ పంచకంబునకు నడుమ వెలింగెడి కళాస్వరూపంబును ముందుగాఁ దెలియంజెప్పెద వినుము. చిత్కళలు తేనె, మల్లె పూవులు, చందన సుమంబులు, కర్పూ రము, నక్షత్రము వీని కాంతిని గలిగి యుండును. మెఱుపు తీగెలవలెఁ దళుక్కు మనును. మిణుగురు పురుగులవలె నిలిచి నిలిచి ప్రకాశించును. నీలనీ రదంబునను నవరత్నములఛాతిని, అపరంజి జిగి వడు వునను మెఱయుచుఁ దళతళలాడుచు, తునియలు తునియలై గుంపులుగుంపులై నిండార గనుపట్టును. భ్రూమధ్యంబున మొకటఁదోఁచి హృదయాకాశంబున కెక్కి వృత్తిసాక్షియై, యావరణవిక్షేపంబులఁ బోన డంచి, జ్ఞానసూర్యుండు వెలుంగును. ఆ జ్ఞాన సూ ర్యుండు తోఁచుటకుమునుపే జాగ్రతనొంది భ్రాంతిని నందు పుట్టిన మఱపును విడిచి, వైరాగ్యమునుబూని ఉపరతులచే మలమును బోగొట్టి సాక్షిని నేనేయని

తలంచి, ఆనంద భష్పయుతుండవై సందియంబుల దిగనాడి మౌనమును వృత్తిరాహిత్యమును బొంది యఖండ చిదానంద మనుభవింపుము. అటుల నను భవించి ద్రష్ట్రు దర్శన దృశ్యముల నడంచి యఖండ స్వరూపుండవుకమ్ము. అరిషడ్వర్గములడంగ, దేహాభి మానముపోవ, సలయ విక్షేప కషాయ రసాస్వాద బుద్ధీంద్రియములు లయంబు కాగ, సాక్షి వివేక అఖండాకారవృత్తులు ప్రజ్వరిల్ల, ఎఱుక మఱపులు వేఱు వేఱు కాఁగా, మతసంబంధ భిన్నజ్ఞానములు తేలిపోవ, జ్ఞానచంద్రుఁడు నీ హృదయంబున శనన్యమై వెలుంగును.

సౌందర్యవల్లి:—స్వామీ! బుద్ధీంద్రియములకు నాలుగు వృత్తులను జెప్పితిరిగదా వాని వివరింపుడు.

సన్యాసి:—నిద్రయే సలయము. ప్రపంచవృత్తులను బొఁది తన్ను మఱచుట నిక్షేపము. ప్రపంచ వృత్తియుఁ గాక, నిజస్వరూపా లోకన వృత్తియును గాక స్తంభంబు విధంబున నుండుట కషాయము. జాగ్రద వస్థయే రసాస్వాదము. లేచి తిఱుగుటచే నిద్ర పోవును. నిగ్రహించుట వలన విక్షేపమేగును. సాక్షిత్వము ననుసంధించుటచే కషాయమరుగును. ఎదియుఁదలువక యూరకుండుటచే రసాస్వాదమునకు

నివృత్తి.

సౌందర్యవల్లి:—స్వామీ! తమకృపచే నెఱింగితిని. కడకు వచించి కృతార్థుం జేయుడు.

సన్యాసి:—కుమారా! అపరోక్షజ్ఞానమునే జ్ఞానచంద్రుం డనియు జ్ఞానసూర్యుండనియు వచింతురుగాని సూర్య చంద్రులట లేరు. అపుడు దహరాకాశంబున నున్నాదా వస్థ యందుండెడి ముక్తికాంతనుజేరి, సమస్త మును దిగవిడచి యానందింపుము. సమభావంబును విడువక ప్రాప్తంబులను గోరికలులేక యనుభవింపు ము. ధర్మకామంబుల నాసక్తినుంచకుము. అంతట నపరోక్షజ్ఞానము నీ హృదయంబున పాపభంజనమై యొప్పును. ఇదియే వహ్ని మండలం బందురు. పిదప రాగాదులను బ్రణవంబుచేఁ జంపి విషయాదు లను వాసనలతోడ విజ్ఞానంబున వేర్లుల్వుము. బ్రహ్మా నందం బనుభవింపుము. ఇపుడు నీకుఁ జెప్పిన అగ్ని సూర్య చంద్రమండలంబులకు నడుమ నీ మూటికి మొదలిదైన హిరణ్మయ మండలము తోచును. అది నీలతోయద మధ్యస్థ నీవారశూకంబు భాతి సూ క్ష్మమై నిర్మలమై వర్ణరహితమై యచింత్య ప్రకాశమై యుండును. వహ్ని హిరణ్మయమండలమును ఆత్మ జ్యోతి యందురు. అది యాజ్ఞాచక్రంబున నుండు

10

నట్టి చిత్కళ. ఆ కళమీఁద మొదలింటి వెలుగు వెలుంగును. అదియే పరబ్రహ్మము. ఆ మొదలింటివెలుగును జూచితివేని ననేకసూర్యులు అనేక చంద్రులు, అనేక మెఱుపుఁదీగె లొకటిగాఁ జేరి ప్రకాశించిన నట్లుండునో యట్లుండును. దానిని విక్షేపంబును దాటి ఆవరణమును దొలంగద్రోసి భ్రూమధ్యంబునఁ జూడుము. వత్సా! యీవిధంబున దోఁచు ఆకాశమండలము, తమోమండలము, మేఘమండలము, విద్యున్మండలము, నక్షత్రమండలము, జ్యోతిర్మండలము, సూర్యమండలము, చంద్రమండలము హిరణ్మయమండలము అను నీపదింటిని నాదంబులు పదింటిని హంసతత్త్వమునుగలిగి కార్యంబుల నంటక చిన్మాత్రుఁడై యన్నింటిని విభజించి వెలుంగు వాఁడె నాదబిందుకళాతీతుఁడగు ప్రత్యగాత్మ. నాదబిందు కళాత్మకయగు విజ్ఞానంబు నాశ్రయించి యాత్మయందు ఆత్మాకారా కారితవృత్తిఁ గలిగి వదలుము. నీ వపుడు ఎండయందుంచిన దీపకలికవలె ఇంద్రియప్రాణ మనోవృత్తుల దిగనాడి నిశ్చలాదులంబొంది రాజయోగ తురీయ సమాధిని బొందుదువు.

సౌందర్యవల్లి:—అట్టి సమాధి నొందుటకు నుపాయం బెయ్యది.

సన్న్యాసి:—బిందు చాంచల్యం బుడుగక మనోనిలంబు లుడుగవు. మనోనిలములు చలింప కుండిన పూర్ణ సమాధిం బొందనగును.

సౌందర్యవల్లి:—బిందు చాంచల్య మెట్లు లుడుగును?

సన్న్యాసి:—హంసతత్త్వంబు నెఱింగిన నుడుగును.

సౌందర్యవల్లి:—నాదబిందు కళలన నేమో దానిని, హంస తత్త్వంబు నుపదేశింపుడు.

సన్న్యాసి:—వత్సా! ప్రాణఘోషమే నాదము. దేహేంద్రియ ప్రాణ మనంబులకు నగ్రముననుండు బుద్ధియే బిందువు. ఆ బుద్ధిని దోచెడి ఆత్మబింబమే కళ. హంస యన జీవుడు. అని యా రహస్యంబుల బోధించి దీనిని దిన దినంబును రెండు జాములు నియమము దప్పక యభ్యసింపుము. ఈ సూక్ష్మ తారకయోగసిద్ధి నీకు గలుగును.

సౌందర్యవల్లి:—స్వామీ! నే నీయోగంబభ్యసించి ధన్యుండ నగుదును. నా బంధువులగు తల్లి దండ్రులును దోబుట్టువులును మిగుల నలజడిం బొందుచున్నవారు. ఊరిని వదలి పోరుగూరు గోడు కుడిచెదరు. వారికి సంభవించి యుండు నిక్కట్టు లెట్టులం దీరును.

సన్యాసి:—వత్సా! నీ వెందులకును భయంబు నొందకుము. మీ రాజ్యంబు మీకు దప్పక ప్రాప్తించును. వ్యసనంబు నొందకుము అని తాను తపోబలంబుచే సంపాదించినధనుస్సును బాణంబులు నిచ్చి, ప్రయోగోపసంహార మంత్రంబులఁ గఱపి, సుఖముండు మని దీవించి పోయెను.

వ్రతశీలుండు నతని కొడుకులు సౌందర్యవల్లిని జూడక వెదకి వెదకి యరణ్యంబునం గనిపట్టిరి. ధనుర్బాణతూణీరంబుల సన్యాసివలన తాఁగొన్నది యామె చెప్ప విని మహదానంద భరితులైరి. మన కికపై నెట్టి భయంబును లేదని తన కొడుకులతో ధైర్యంబు మాటలాడికొను చుండెను.

సౌందర్యవల్లి యొకనాడు వాడుక మేరకు తన తండ్రికిని అన్నలకును ధైర్యంబు చెప్పుచుండ, వ్రతశీలునిభార్య తన పుత్రియొక్క బుద్ధి చాతుర్యమునకు మది మెచ్చుకొనుచు, తాము తమ రాజ్యంబునువదలి పరదేశులవలె నితర రాజ్యంబున జీవించినను, బైట నిర్భయంబుగాఁ బోవుటకు లేకున్నది గదా యని వ్యసనపడుచుండెను. సౌందర్యవల్లి తల్లి మొగంబును, నామె కనులనుండి నీరు ధారధారగాఁ గారుటయుఁ జూచెను. తల్లి యేడ్చుచుండఁ గూతురెట్లుండును. మనసు తాళక, అమ్మా! మేము బ్రతికియుండగా నీవేల వ్యసనంబు నొందెదవు అని యడిగెను. మహారాణి కూతుంజూచి "నా

వెతల నే మందును! మనము శాంతపురిని నేలు కాలంబున సకల దేశాధీశులు మీతండ్రిని వీర ప్రతాపయుక్తుండని యుందఱును గౌరవంబుగాఁ బొగడుచుందురు. నీకు ముందుగా నీయన్న లిరువదుండ్రు పుట్టి శౌర్యధనులై యుండిరి. కడపట లేక లేకయుండి నీ వాడుదివై పుట్టితివి. నిన్ను జక్రవర్తి కుమారునకుఁ బెండ్లిచేయించి యిచ్చి నేత్రోత్సవంబుగఁ జూడవలయునని యాసఁగొని యుంటిమి. 'అగ్నీ కుళీ వృశ్చిక వేణురంభా వినాశకాలే ఫలముద్భవంతి, యథాతథా సజ్జన దుర్జనానాం వినాశకాలే విపరీతబుద్ధిః' అను నటులను, 'అత్యాశోబకో నష్ట'మన్నటులను ఏదియు విచారింపక, చక్రవర్తికిఁ గట్టవలసిన కప్పమును గట్టకుండుటచే, చక్రవర్తి యుత్తరువుమేరకు సకల దేశాధీశు లొక్కటిగాఁ జేరి, మన శాంతపురిపై దండెత్తి వచ్చిరి. అపుడు నీతండ్రి నీ మహిమచే భూమిని సురంగము ద్రవ్వుకొని, దాని మార్గముగా నడవికివచ్చి యీ దేశంబును జేరి జీవించుచున్నవారము. మన మిటకు వచ్చి నైదేండ్లయినది. మన కాపులు దళము లేమైనవో తెలియక యున్నదే యని యేడ్చెదను'' అనియె.

అదివిని సౌందర్యవల్లి "యిందులకై నీవు వ్యసనంబు నొందకుము. ఇదివఱకు నోర్చి యుంటివి. ఇక రెండేండ్లు నోర్చి యుండుము. నేను మన శాంతపురిపై దండెత్తిపోయి, యెదిరించి వచ్చెడి రాజుల నందరిని జయించి, యీూరు వెళ

లంగోట్టి యింతకును మూలకుండైన చక్రవర్తి దేశంబును గైవశంబు చేసికొని, మనకు వాఁడు కప్పంబు కట్టునటులఁ జేసెదను. వేడుక చూచుచుండుము'' అని చెప్పెను.

ఆ మాటలను దగ్గఱనుండి వినుచుండిన వ్రతశీలుఁడు మదినుప్పొంగి "బిడ్డా ! నీ విపుడు చెప్పిన విషయము సరియే. ముందు మనయూరిలో నుండినపుడు దండుదళము లుండినవి. అందఱు నొకటిగా వచ్చుటను జూచి జయింపలేమనుకొని వేఱుచోటికివచ్చి ప్రాణంబుల దక్కించు కొంటిమి. ఇపుడన్ననో మనకు రథగజతురగపదాతి సేనలును లేవు. మన మెట్టుల చక్రవర్తికన్ననో యందఱును దోడు రాఁగలరు. మన కెవ్వరు వత్తురు. సామంతరాజు సేనలను నీవు కనులాఱ గాంచి యున్నావు. అట్టి సేనలను మన మొంటరి గాండ్రయినపుడు జయించుటెట్లు ? ఈ నీ మాటల వినువార లెవ్వరు నమ్మెదరు?'' అనెను.

సౌందర్యవల్లి ''తండ్రీ! ప్రయత్నంబు గలవారికిఁ జేటు లేదు'' అనువార్త నీ నెఱుంగనిదియే. జయముండు వఱకు భయంబు లేదు. కనుక నే నింకను రెండేండ్ల లోపల, సకల దేశాధీశుల జయించి, వారి వారి దేశంబులఁ గైకొని యదేవిధంబుగఁ జక్రవర్తిని జయించి, నేఁ జక్రవర్తిని నయ్యెదనని శపథంబు చేసెను.

ఒకనాఁడు సౌందర్యవల్లి యొకకలంగని దిగ్గున లేచెను. అపుడు దగ్గఱనున్న తన తల్లియగు మహారాణి హెచ్చరించెను. సౌందర్యవల్లి యిట్లనియె. అమ్మా! నేటిరాత్రి యొక కలను గంటిని. అది యేది యన, నేను మన శాంతపురికేగి యుద్ధంబు చేయునట్లును, సకల దేశాధీశులు నాతో నధికకాలము పోరినవిధంబుగను, మాయన్నలు అలసి సొలసి పడిపోయినట్లును, నేనుమాత్ర మొంటరిగా నిలిచి పోరాడి నట్లును, పిదప రాజులందఱును నాకు భయంబు సెంది, సముద్రము పొంగి వచ్చునట్లు ఘోషజేయుచు పఱువెత్తినట్లును, నేనుజయించినట్లును, నాతండ్రియు నాయన్నలును నాకు మకుటాభిషేకంబుచేసి సంతసించి నట్లును, నేను దేశవిచారణ సేయుచుండినట్లును; నొక కలను గంటినని చెప్పెను. ఆ మాటలను వినిన మహారాణి తల్లీ! యిదియంతయు జ్ఞప్తి రూపంబగు కలయో జ్ఞప్తియో? కన్నది వ్యర్థమనియెంచక యది యొక కధగాఁ జెప్పెదవే? మంచిది రేపటికి నీ తండ్రి యొద్ద జెప్పి స్వప్నఫలంబును మన జ్యోతిష్కునిచే నెఱుగ దగునని చెప్పి రాత్రికాలమైనందున నిదురించిరి.

సౌందర్యవల్లి తెల్లవాఱినదే లేచి స్నానాద్యలంకృతంబుల నెఱవేర్చికొని భుజించి, ధనుర్బాణతూణీరధరయై తమ యింటియందలి యొక వసంత మంటపంబునకువచ్చి కూరు

చుండి, యికమనకు సత్కాలము వచ్చినదని తన మనస్సు నకు దగినటుల నేదేదో యోచించుకొనుచుండెను.

మహారాణిగారు రాత్రి తన కూతురుచెప్పిన మాట లంతయు తలంచి యచ్చెరువంది నప్పటయు, మన కిట్టికాల ము సంభవించి రాజ్యాంగమును వదలి పరదేశీవేషంబున నీ పురంబున నొంటరులమై యుండుట కైనదే యని వ్యసన పడుటయునుగా నుండెను.

అపుడు రాణిగారిపొరుగుననున్నదాదులు బహు విధం బులుగా ధైర్యవచనంబులచే రాణిగారికి సమాధానంబులు చెప్పి యోదార్చి, అమ్మా! పూర్వకాలంబున, నలుఁడు, పురూ రవుడు మొదలగు చక్రవర్తులును తమ రాచఱికంబును వదలి, తమ రాజ్యంబును శత్రువులేల దాము కానలకేగి వెతలనొందుచు మంచికాలము తటస్థించినపుడు శత్రువులను దఱిమి, తమ రాజ్యంబును గైకొని సుఖంబుగ నుండిరని భారతాది గ్రంధంబుల వినమా అని పురాణకథల జెప్పగా మహారాణిగా రదివిని యొకవిధంబున మనంబును దృప్తి పరచు కొనెను. దాదులును వారి వారికి దగిన పనులం జేయుచు నిన్నకుండిరి.

వ్రతశీలమహారాజు తనపుత్రి సౌందర్యవల్లిని బిలిచి రాజ్యవిషయకమగు సంగతుల విచారింప నెంచి, యానతో దన యింటికివచ్చెను. అపుడు రాణిగారు తన పురుషునిం

జూచి కిలకిలమని నవ్వెను. రాజు అచ్చెరువంది "చెలీ నీ కిన్నిదినంబులుగా నింతటి సంతసంబు లేదుగదా ! నీవు నేడు మాత్ర మిట్టి యానందమున నుండుటకుఁ గారణం బేమి" యని యడిగెను.

ఆ మాటలను వినిన మహారాణి "నాయకా ! నే నేమని చెప్పగలను. చెప్పెదమన్న నింతల నీనుచున్నది" అనియె. వ్రతశీలునకు రాణి యభిప్రాయంబు తెలిసినది గాదు. ప్రాణనాయకీ! వింతయున నెట్టిది? మనమో రాజ్యం బును వదలి పరదేశులమై యున్నవారము. మనకు నొక వింతయే. మన వేష మొకవింతగదా యనియె. ఆ మాట లను విని రాజేంద్రా ! తాము దీనినిగురించి కించిత్తును చింతింపకుడు.

క॥ కరినెక్కి గొడుగు నటను
నరుగున్నృపులు 'వెండ నడతు • రడవుల నీడుమఁగా

ఏనుగుపై నెక్కి గొడుగు నీడయందుండు రాజులును తమకుఁ గష్టకాలంబు వచ్చునపుడు రాజ్యంబును వదలి యడ వింజేరి మిడిమిడి యెండయందు నడతురు. అయినను వారికి మంచికాలంబు వచ్చినయెడల,

సరియైన వేళ భిక్షా
తురులును రాజ్యంబునందు • దురు నిశ్చలతఁగా॥

అను విధంబున గూడివచ్చు కాలంబున భిక్షమెత్తి కొని తినుచుండువారైనను రాజ్యాధిపతులై మనంగలరు. వీని నన్నింటికిని నీశ్వరేచ్ఛ కారణంబగును. మీ రిందు లకై వ్యసనంబు నొందకుడు. తాము చక్రవర్తితో ద్వే షించి కప్పంబు గట్టనని నిరాకరించిన సమయంబున, సౌం దర్యవల్లి యుక్తిచే బ్రతుకును గంటిమి. లేనియెడ శత్రు వులచేతం జిక్కి చావవలసినదే గదా. చావక తప్పిన పక్షమున నెన్నియో కడగండ్లకు లోనై యుందుము. మనము సౌందర్యవల్లిని బిడ్డయని తలంపక తల్లిదండ్రులవలె గౌరవించు టం జేసి తప్పి బ్రతికితిమి. లేనియెడ బొక్కసంబు మన కేమి కొఱతయని మఱల నవ్వెను.

మాటిమాటికి తనరాణి నగుటకు నేదో కారణం బుండవలయునని సూచించి, "సతీ తిలకమా! కారణంబు లేక నగవుండదు. ఇందుల కేదో హేతువుండవలయును. ఇదినఱకు దుఃఖమున మునుంగుచుండు నీకు నేడుమాత్ర మెటుల నవ్వు వచ్చును? అని యడిగెను. మహారాణి "ప్రాణ నాథా! నిన్నటిరాత్రి మనకూతురొక కలంగని లేచినది. దాని నామె యల్పనంతోషినై చెప్పుకొనుచుండెను. నే నదివిని నవ్వుచుంటిని. దానినే మఱల నిపుడు తలంచు కొనఁగా వింతయై నగవు వచ్చు చున్నది" అనెను. ప్రతశీ లుఁడు "అదేమికలయో నాకెఱింగింపుము. స్వప్న ఫలం

బును జ్యోతిష్కులవలన నెఱుంగనగును'' అని యడిగెను. రాణి తన కూతురు చెప్పినకలను సాంగముగా వినిపించెను. రాజందుల కేమి కారణంబోయని వెఱగందెను. ప్రాణపతీ! మనబిడ్డ నే నెంతజెప్పినను వినక ''మీ రట్టుల దలంపకుడు. నేగన్న స్వప్నము ఫలియించునే కాని జిత్తవోవ దనుచున్నది. ప్రాణపతీ! ముందు మనము దండుదళముతో నుండియు సామంతులయొక్క సేననుగని సురంగమున దూటి పాఱి వచ్చితిమి. ఇపుడో యెట్టి యాదరవునులేక యుత్తచేతు లతో మూరవేయుట యెట్లు? రాజులేడ మనమేడ? వారితో బోరుట యేడ? ఇదియంతయుఁ జూడ బాల్యచేష్టితంబు పగిది నున్నయది" అనెను.

వ్రతశీలుఁడు కొంత నిదానించి సతీ! నేఁజెప్పుమాటను గొంత సావధానంబుగ నాలోచింపుము. మనము పూర్వ జన్మమునఁ జేసికొన్న సత్కర్మపరిపాకంబుచే మనకు నతిశూరులగు కొడుకు లిరువదుండ్రు పుట్టిరి. వీరి గౌరవంబుచే నేను రాజులనందఱిని దృణీకరింపుచుంటిని. చక్రవర్తికిని గప్పంబుగట్టకున్న వీడేమిచేయునని మదంబు గొంటిని. వీరి ప్రాపుచే సార్వభౌమత్వమును బొందనెంచితిని. పిదప నీ సౌందర్యవల్లి పుట్టినది. పిదప మఱింత మదంబుగొని మనబిడ్డలకు విశేషంబుగా సామర్థ్యము వృద్ధినందినదియని తలంచి, కప్పంబుగట్టుటయే మానుకొంటిని. చక్రవర్తియు

తునగౌరవంబును యోచించియే ఏమియు నడుగక మిన్నకుం డెను. అయినను సామంతులకు నాపై నసూయకలుగుటం జేసి చక్రవర్తికిఁదోడయి యొకటిగా వచ్చి మనదేశంబున యుద్ధంబొనరింప వచ్చిరి. అపుడు మన సౌందర్యవల్లి బుద్ధి చాతుర్యంబుచే నడవివలతో క సారంగమును ద్రవ్వి యందు ప్రవేశించి వచ్చి యీదేశంబున నిలిచితిమి. కనుక మన బిడ్డ తలంచెనేని మనము సకలదేశంబుల కేకచ్ఛత్రాధిపతు లమై యేలగలము. ఇందులకు సందియంబు లేదని చెప్పి ఫలాహారంబుల భుజించి తృప్తుండై వసంతమంటపంబునకు వచ్చెను. అపుడచ్చట సౌందర్యవల్లి పురుషవేషంబును ధరించి, ధనుర్బాణ తూణీర ధరయై, రాత్రి కన్న కలను జింతించుచుండెను.

వ్రతశీలుఁడు తన కూతురింగాంచి "ఏమి విశేషము. నీవు నేటి దినము ఏదో యొక విధమగు నాలోచన యందు న్నట్లు కనంబడియెదవు. దీని నిజంబును విశదంబుగా నెఱుం గఁ బల్కుము" అని యడిగెను. ఆ మాటలను విని సౌం దర్యవల్లి, "తండ్రీ! ఇన్ని దినంబులు లేక నేటి రాత్రి యొక కలను గంటిని. కలలు కలవరింతలని అమ్మ చెప్పుచున్నది. ఇన్ని దినంబులు లేని కల నిన్న యేల రావలయును. భగవంతుడికపై జరుగువానిని ముందుగాఁ గలలయందుఁ జూపుచున్నాడని పెద్దలు చెప్పుదురు. ఇపుడు నేను గన్న

కల నిజముగా జరుగునని తలంచెదను. నీవును మా యన్న లును దోడురా మన శాంతపురికి నేను బోయి, యుద్ధంబు చేసితిని. అందు మీరు మూర్ఛ నొందితిరి. నే నొక్క-తెనై యుండి వారల నోడ్చితిని. పిదప నే నన్ని దేశంబులకుఁ జక్రవర్తినినై పట్టాభిషిక్తురాలనైనటుల నొక కలం గంటిని.'' అని చెప్పి, 'తండ్రీ! మనము నేటిదినమె మన యూరికిఁ బోవలయును' అనెను. వ్రతశీలుఁ డట్టులన కాని మ్మని సమ్మతించి, తన కుమారులకును నీ సంగతి నెఱింగించెను. వారును సమ్మతించిరి. తనయింటి వరవుడు కాంద్ర నందఱిని నొక యేకాంతస్థలంబునకుఁ గొనిపోయి వ్రతశీలుం డిట్టులనియె. "మే మందఱమును ఇచటికి వచ్చియై దేండ్ల కాలమైనది గదా! ఇంతవఱకు మే మెత్తుకొని వచ్చిన ద్రవ్యము నుంచుకొనియే బ్రతుకుచు వచ్చితిమి. ఎంత గొప్ప మొత్తమైనను గొంచెము కొంచెముగ వ్యయము చేయుచుండినఁ దఱుగకుండునా? ఆదాయముండి దానికి దగిన వ్యయము చేయుచుంటిమేని మొదలు తఱుగక యుండునని యెల్లఱకు దెలిసిన విషయమే, గావున ద్రవ్యార్జనకై మేమిపుడు వర్తకంబుసేయ బోవుచున్న వారము. మేము తిఱుగవచ్చునపుడు ఆయా దీవులందలి విచిత్రవస్తువులను గొని తెచ్చెదము. మీకు దానినిచ్చుటయేగాక మూడు

నెలలజీతమును బహుమాన మిచ్చెదము కాన భవనమును కాచియుండుడు" అని యొప్పఁ జెప్పెను.

వారును మది నుప్పొంగి "మహానుభావులారా! మీ ప్రాపున మేమింతవఱకు బ్రతుకుచుంటిమి. తిని లేదను పాపి గలడే. ఇంకను దమ యనుగ్రహంబునకే యెదురు చూచెదము. మీరున్నపుడైనను మేము అజాగ్రతగనుండవచ్చునే గాని లేనియపుడు మా స్వంతయింటివలెఁ జూచుకొనమా? యజమానుని యక్కఱకు రాని సేవకులేల? యజమానున కున్నంతవఱకు నిచ్ఛకంబులాడుచుఁ బెఱికికొని తిని, లేనియపుడు వా డేమి యిచ్చెను. మేమేమి తింటిమని మాటలాడు చెనటులు కలరు గాని మే మట్టివారముగాము. మేమెంత యిపుడు చెప్పినను అదియంతయు నాత్మస్తుతియై యుండునే గాని నిక్కమని తెలియదు. మీరు తిరిగి వచ్చినపుడు మా గుణావగుణంబుల నరసికొనుడు. జరిగిన వెనుక నేమి చేయ నగునని తలంచెదరేమో? ధర్మప్రభులరగు మీకుఁ గీడెన్నటికిని రాదు. లోకము భగవంతుని యాధీనమునన్నది. కొందఱు మూఢులు ఎఱంగినవారివలెఁ దమకుఁబ్రాప్తించిన సంపదలు కాకతాళీయన్యాయంబులనియు భగవంతుఁ డెట నున్నవాఁడనియుఁ దలంతురు. అది సర్వసమ్మతంబని చెప్పువార లెవరు? దేవరా! మీపాదపద్మంబుల శరణంబుగఁ బొందిన మామాటలనమ్మి మనంబున నెట్టి కళంకము నుం

చక సంతసంబున బేరంబునకుఁ బొంకు. ఏంష్లు పూండ్లయి నను, నూఱాలులైనను మీా గడపను దాటము. మీాగడ పనుదాటి యిట్టిపనియే మఱియొకచోటను జేయవలసినదే కదా. ఆ పనినే మీాకడ నేల చేయరాదు" అని నమ్మఁ జెప్పి తమతమ పనులకుఁ దామేగిరి.

వ్రతశీలుఁడు వారిమాటలనువిని యానందించెను. పుత్రులారా! మనభాగ్యమే భాగ్యము. మన మిపుడు చేపట్టిన దెల్లను బంగారమగుటకు సందియంబు లేదు. మన బేరంబును సారంబై తేలునని యెంచెద. లేనియెడ మన కడనుండు సేవకులైకకంఠ్యంబుగ నిట్టి గట్టిమాట యిత్తురే. మగవార లింటనుండునపుడే సేవకు లాకపసిం జేయుదురు. ఒకపనిం జేయరు. చేసినపనియైన సమగ్రంబుగ నుండదు. ఇటులేల చేసితిరన గొణుగుకొందురు. ముఖమును ద్రిప్పి కొందురు. ఇంట మగవాడు లేనపుడు చెప్పవలసినదేమి. మనసేవకు లట్లుగాక మన యిచ్ఛవచ్చినట్లు నడచువారు. లేనియెడ నిట్టి గట్టిమాట నిత్తురే. మనమెత్తుకొన్నపని యో యగాధమైనది. ఇల్లు వాకిలియని చూచిన నగునే? మనమిపుడు ఇంటివిషయమై చేయవలసిన బందోబస్తులను జేసితిమి. ఇకపై మనవలనఁ గాగల కార్యమేమి? అన్నిటికి భగవంతుడున్నవాఁడు అని కొడుకులకుఁజెప్పి యింటి కేగెను. సేవకులందఱును వారివారి భార్యాపుత్రులతో వ్రతశీలు

నింటియందు వచ్చిచేరిరి. వారిచుట్టములు ఎచట నుద్యోగం బున నున్నవారని యడుగ ధనవంతుఁడై యొక యోడవ్యా పారియింటఁ గొలువున్నవారమని ఘనతగాఁ జెప్పుకొందురు. వ్రతశీలుఁడు తన యింటనుండు భార్యాపౌత్రులకు ఓడ బేరం బునకుఁబోయివచ్చెదమని యుపాయంబుగఁ జెప్పెను. యుద్ధం బున కేగెదమన్న నొప్పదురే. వారును నింటఁ గూర్చొని తినిన యెన్నిదినంబులకు వచ్చునని తలంచినవారై మంచిది మీరుపోయి వేగరండు. ఆలస్యముచేయకుడు. మీతోడ మన సౌందర్యవల్లియు వచ్చునేని మాకును మనస్సు దిటవుగా నుండును. ఆమెయు వచ్చునేయని యడిగిరి. వ్రతశీలుఁడు ఆమెలేక యేకార్యము మేము చేసెదము. వర్తకంబులందు నామెకు మించి తెలిసినవార లెవరు? ఆమెను వదలి మే మేమి చేయఁగలము అని చెప్పిరి. అందఱును సంతసించిరి. వ్రతశీలుఁడు తన పుత్రీ పుత్రులతో శుభలగ్నంబున గావల సిన ద్రవ్యమెత్తుకొని బయలుదేరి సముద్రపు గట్టునకు వచ్చి రి. అపుడే యోడ శాంతపురి మార్గంబును బట్టి పోవుటకు సిద్ధమై యుండెను. ఆ శుభలక్షణంబున కందఱు విస్మ యంబు చెంది కేవును చెల్లించి, యోడపై నెక్కిరి. ఇతర దేశంబులకుఁ బోవువారు నందుండిరి. ఓడ కదలి సముద్ర మధ్యంబునకు వచ్చెను. గాలి యనుకూలంబుగ వీచుటం జేసి యెట్టి తొందరయును లేక యోడ నడచుచుండెను.

ఓడయందలివారు పురుషవేషధారిణియగు సౌందర్యవల్లి ముఖవర్చసును సౌందర్యాతిశయంబును జూచి మక్కువగొని యీబిడ్డ నోరార నొక కథవిని తనియ నగునని యోచించి, దగ్గఱించి కూర్చొని యిట్లనిరి.

---

# వ జ్ర క న్య క థ.

—o—

అబ్బాయీ! నేడు ప్రొద్దు పోవకున్నది. మా యందఱిచెవులు పండువులగునట్లు ఒక కథఁజెప్పి మమ్ము ధన్యులం జేయుము. పెద్దవారలు చెప్పెడి కథలకన్న నిప్పటి పసివారల కథలే ముద్దులై యుండును. అని చుట్టు మూగిరి. సౌందర్యవల్లి వారినిం గని, అయ్యలారా! మీ రెఱుంగని కథలు నే నెఱుఁగుదునే. అయినను మా గురువర్యునికడ నే విన్నకథ యొకటి కలదు. అది మీకు విన నింపో కాదో యను సందియంబు నా హృదయంబును గలంచుచున్నది. ఒకరికి రుచియైనది మఱి యొకరికి నరుచియై యుండును. కొందఱికి పునుగు జవ్వాదులు పరిమళంబులు. కొందఱికి దుర్గంధప్రాయమై యుండును. అందఱికి మెచ్చువచ్చునటులఁ జెప్పుట యెట్లు? అని చెప్పెను. వారలు సౌందర్యవల్లి బుద్ధి విశేషంబులకు మదిమెచ్చుచు అన్నా! కథ యింప

యినను గాకున్నను నీనోటి నుండి వచ్చెనేని, నింపుగాక మాకునా చెప్పుము చూతమనిరి. సౌందర్యవల్లి చెప్పుచున్నది.

నడురేయి జరిగి రెండుగంటల కాలమయ్యెను. అప్పటికిని గుళ స్థలంబున నుండెడి జనులు మేలుకొనియుండిరి. పల్లవుల కరుణాకటాక్షంబుచే, గౌడదేశంబునకంతయు, రాజగు ఆనందుఁడు మహోన్నతపదవి నుండువాఁ డగుటచేత, ఖడ్గనారాయణ చక్రవర్తి గౌరవార్థమై యొక పండుగఁ జేసెను. అది చూచుటకు వేనవేలుజనులు దిక్కుదిక్కుల నుండి వచ్చిమూఁగిరి. వారుమాత్రమే గాక ధనవంతులును జూడవచ్చి యుండిరి. వారి గుడారములు సముద్రపు టొడ్డున కొన్నిమైళ్ళ దూరంబువఱకు వ్యాపించి యుండెను. సత్రములందుఁగాని, చావిళ్ళనుగాని, రాజభవనములందుఁ గాని చోటుచిక్కలేదు. వచ్చినవారు మిద్దెలమీఁదను, వీధులయందును, భవనప్రాంగణములలోను, తోటలయందును నిద్రించిరి. సూర్యుఁ డస్తమించినవెనుకఁ దేనెతెట్టెను గలిపిన చందమున నా పట్టణమంతయు ఘోషతో నిండి యుండెను. నాటకరంగములందు సమర్థులగునటులచే నాటకము లాడబడుచుండెను. నాటకాంతమున ప్రేక్షకులు తమతమయిండ్లకేగుచు జయధ్వనులు జేయుచుఁ బాడుచు బోవుచుండిరి. నటకులు కొందఱు నాటకంబున నటులఁ

దా మాడినదియు నితరు లెటులాడినదియు జెప్పుకొనుచు నవ్వుకొనుచుఁ బోవుచుండిరి. నేఁడేమియాట. రేపటిది గదా చూడ సొంపైనదని కొందఱు ముచ్చటించుచుండిరి.

ఆ పురికి దగ్గఱనుండు నొక తిప్పమీఁదఁ దుఱక ఱాళ్ళతోఁ గట్టిన యొక సౌధముగలదు. అది యిండ్లిండ్లుగా విభజింపఁబడి యుండెను. ఆ భవనమునకుఁ జుట్టు నొక ప్రహరిగోడయు దానిచుట్టును కందకం బొకటియుగలదు. ఆ భవనము చెఱసాలగా నుపయోగింపఁ బడుచుండెను. తిప్పకు దిగువ మల్లరంగం బొకటి యుండెను. మల్లరంగంబున రాత్రియంతయుఁ బనిచేయు వారల కేకలను చెఱసాల నుండువారు వినుచుండిరి. ఆ కేకలు వారిలోఁ గొందఱికి నానందకరమై యుండెను. ఏలననఁ దెల్ల వాఱినదే మల్లయుద్ధంబుచేయు సమయంబు దటస్థించునుగదా యని. ఆ చెఱసాలయందలి యొకభాగంబున దుష్టులగు గాఁడులు కొంద ఱుండిరి. వారలు రాజకీయ నేరంబులచేఁ జెఱబడినవారు. పశుప్రాయులగు నిద్దఱు భిల్లులతో నొకఁడు జగడమాడ వలయు. వారలు గుఱ్ఱంబునెక్కి, దేహంబునఁ గవచంబు లేక కత్తి యీఁటెలతో పోరుసలుపవలయు. ఈ గాఁడులకు మాత్రము కవచఖేటకంబుల నిత్తురు. గాఁడభిల్లులు ఒక గడి యనేపేశాని యంతకుఁబై జగడంబు చేయవలసిన యక్కఱ లేదు. ఇరుతెగలయందు నెవరు బ్రతికియుందురో వారలు

స్వేచ్ఛను బొందుదురు. పిఱికితనము చూపినను, వ్యర్థం బుగా నొకరిని జంపుటకు నిష్టంబు లేక యుండినను ఆనంద మహారాజుగారి దయగల యుత్తరువుచే యమునింటికి విందగును. అందఱికిఁ బ్రాణముతీపే. ఇట్లుండుటచేత నందఱుం దమతమ శక్తిమేరకు పోరుసలుప సిద్ధమై యుండిరి.

చెఱయందలి యింకొకభాగంబున వేఱొక తెగవారుండిరి. వారలేబదుమంద్రకు మించి లేరు. ఆ భాగము విశాలంబుగ నుండుటచేత వీరికి వసతిగనుఁ భద్రముగ నుండినది. ఎనమండ్రు పదుండ్రుతప్పఁ దక్కిన వారందఱును ముసలి ముతుకలే. నడివయసున నుండు మగవారి నందఱిని మల్లయుద్ధంబునకై వేఱుచేసియుంచిరి గావున నీ గుంపులో నాడువారును బిడ్డలుమాత్రమే యుండిరి. వీరలు క్రొత్తగా నేర్పడిన చైతన్యమతస్థులు, చైతన్యుని ననుసరించువారు. వదంతిమేరకు నీ చైతన్యుఁడు పౌర్ణమినాడు పిచ్చితలకెక్కి చిలుక సరస్సునఁబడి చచ్చినవాఁడు. ఈ పిచ్చివానికిఁ గొంతగౌరవ మెక్కసాగెను! కొందఱు వీని నొకదేవునిగ భావించి, వీని యుపదేశంబుల శ్రుతిస్మృతులకు విరోధంబుగ నుపన్యసింపఁ జొచ్చిరి.

వైష్ణవ శైవస్మార్తులందఱు నొకటిగఁజేరిరి. ఆనంద మహారాజు నాశ్రయించిరి. చైతన్యుల నిశ్శేషముగ చేయుమనిరి. వీరిపట్టును మానుపలేక మహారాజు చివర కొప్పు

కొనెను. విద్యావంతులగు పల్లవులవలె నీయానందునకు మత మొక్కటియు లేదు. కాశికిఁబోయి గంగను స్నాన మాచరించి, విశ్వనాథుని గుడియందు బుద్ధునిం బూజించిన వాఁడు. గయకుఁబోయి యందు జిను నర్చించెడివాడు. వాఁడు తనకు నందఱికి నన్నిగా నుండువాఁడు. కాల మొక్కరీతి గడుపవలయు నను వారిలో మొదటివాఁడు. తా నెపుడు నీ చైతన్యులవిషయమై విచారించినవాఁడు కాఁడు. ఏలవిచారించును? వారలో యనామధేయు లగుకొందఱే. ధనధాన్య సంపదలుగాని, చెల్లుబడి గాని కలవా డొక్కడును లేఁడు. వారిని గాఱియలఁబెట్టుట సులభము. అది గౌడుల కిష్టము. కనుక వారిని బాధింపఁ జొచ్చెను. ఈ చైతన్యుని శిష్యుడగు నొకనిని గాశియందుఁ దలగొట్టెను. మఱి యొక్కని జెఱయందుంచి, వానిశిష్యుల ననేకులంజంపెను. కొందఱిని గౌడుల స్వాధీనంబుచేసి ఱాళ్లంగొట్టి చంపునటుల నొనరించెను. మగవారినింబట్టి మల్లయుద్ధంబునఁ జంపించెను. వయసు నందమునుగల కన్యలగువారిని అమ్మించెను. నడివయసుగను ముదుసళ్ళుగనుండు నాడువారిని వన్య మృగంబులకు వేసెను.

ఈ చైతన్యుల గతియు నట్టిదే. మల్లయుద్ధంబు జరిగిన వెనుక మిగిలియుండు చైతన్యులు అరువదుండ్రు ముసలి మగ వారుగను, పెండ్లియైన స్త్రీలుగను బిడ్డలుగనుండుటచే వీరిని

నెవరును దీయరు. కావున వన్యమృగంబుల కెఱగా వేయ బడునని ప్రకటించిరి. వీరిపై నాకొన్న పులుల ముప్పదింటిని విడువ నెంచిరి. పులులు తినక విడిచిపెట్టినవారికి గుడ్డలును గొంతపైకము నిచ్చి వదలి వేయవలయు నని కరుణాపూర్ణుఁడగు ఆనందుఁ డుత్తరువు చేసియుండెను. అతని కెంతకరుణయో? విడుదలచెందిన వారు గాఁడులను సమాధానపఱచి కొని తమకుఁ దామే యన్యోన్యముగా బ్రతుకవలయును. గాఁడుల కిష్టముండినఁ జంపను వచ్చును.

పల్లవుల నాటికాలమునఁ బ్రజల హృదయంబుల నీతు లట్లుండెను. పిచ్చివానినిఁ బూజింపుచు వాని నేతప్ప నితరులను గుళ్ళయందైనను మఱియెచ్చటనైనను బూజింప నొల్లని వారిని ఆకొన్న పులులు, సజీవులైన బిడ్డ పాపల ముదుసళ్ళ స్త్రీలను గాఱికితినుట వారికి వినోద కరమైయుండెను. పులులు తినక విడచువార లెందఱో యా సంఖ్యగల టిక్కెట్టును గలవారికి మొదటిబహుమతి దొరకుటచేత ననేకులు ధన మొసంగి టిక్కెట్లు తీసిరి. ఇందువలన విశేషధనము చేరెను.

ఈ చైతన్యు లుండినభాగంబునందలి ద్వారంబున నీటెలను జేఁబూని కావలియుండిరి. వారికిఁ గొంత దూరంబున, నొక్కవ్రమానుక్రింద నిద్దఱాడు వాండ్రు కూర్చుండిరి. వారి కిరువురకుం గలవ్యత్యాసము చూడ వింతయై

యుండెను. ఒకతె యిరువదేండ్లకు మించని గోడి. ముఖ మున గండయును మాటలేదు. కనులుసోగగను సొంపుగ నుండెను. ముఖంబునను, ప్రత్యవయవమునందును వంశ గౌరవము వర్ధిల్లుచుండెను. ఆమెస్థిరపురంబున మేటి సాహుకారియు గోడవంశతిలకంబునగు భానునేక పుత్రియు, ఘనసారవంశస్థుఁడగు మాధవునియిల్లాలు నగు చంద్రకల. రెండవయాడుది నలువదియేండ్లు ప్రాయము గలది. ఆమె రాజపుత్రస్థానంబునఁ బుట్టినది. పసితనంబుననే గోడు లీమెను చేకొనిరి. వారి కడనుండి మార్వారు లెట్టులో కైకొని స్థిరపురంబున నమ్మిరి. ఆమె పొడువుగను, ధైర్య వంతురాలుగ నుండెను. ఆమె మొగంబును గాంచువారు ఎంత గట్టిగుండెఁ గలవారైనను భయంబునొందక మానరు. ఇట్టి సంకటకాలంబునను నామెమొగంబున దైన్యంబు దోచకుండెను. అయినను దనయెదుటఁ గూర్చొనియున్న చంద్రకల మొగంబును జూడఁజూడ మది కఱగుచుండెను. భానుఁ డీమెను దీసినపుడు ఈమెకు దాత్రమయుని పేరు పెట్టెను. తామ్రమనరాగి. ఈమె దేహకాంతి రాగి వర్ణము. ఆమె పుట్టినదేశంబున నీమెకుఁ దారయని నామ ధేయము. ఈ పేరే చనిపోయిన తన యజమానురాలగు భానుని భార్యకుఁ దెలియును. ఇపుడు చిన్నప్పటినుండి సాకిపెంచిన చంద్రకలకు నీ పేరే తెలియును.

ఆ రాత్రియందు ఆకాశము నిర్మలమైయుండెను. వెన్నెల పిండారఁ గాయుచుండెను. ఎవరైనను వీరిని జూచు చుండినయెడల, వీరి చేష్టితములు ముఖవిలాసములం గని యుండవచ్చును. ఎవరు చూతురు? అందఱును వారివారి పనులయందు నుండిరి. తార గుదికాలిపైఁ గూర్చొని తనచేతిని మడిమెనుంచి యాకాశంబును జూచుచుండెను. అప్పుడే చంద్రకల చేతుల దిగువనుంచి యాకసంబును జూచి నిట్టూర్పు విడిచెను.

తారా యిదే మనకడపటిరాత్రి. చంద్రుఁ డాకసం బునఁ బోవుటను ఇకపైఁ జూడఁజాలమని తలచెద నని వ్యస నంబుదోఁపఁ జెప్పెను.

తల్లీ! మరల చూడమమ్మా. మనకు బోధించిన వన్నియు నిజములైన పక్షమున చంద్రుని నీ జగమంతయు నెప్పుడును జూచుచుండుదుము. కానిపక్షమున వెలుతురు చీకట్లు మనలబాధింపవు. అయినను నే నొక్కటిచెప్ప దను. మనమిద్దఱిలో నెవరును రేపటికిఁ జావమని నిశ్చ యంబుగా నమ్మెదను.

చంద్రకల మందహాసంబుచేయుచు, తారా! నీ వెటుల నివర్తింపగలవు. పులులు నరులను గౌరవించునది కాదే.

అమ్మా! నా దేహంబును పులులు గౌరవించునని

తలంచెద. నాకని నిన్నును గౌరవించును.

తారా! నీ మాటల కర్థమేమి?

అర్థమా? నేను పులులకు భయంబునెందను. అవి మాయూరనుండు కాపులు, నాయుయ్యాలచుట్టును దిఱుగు చుండునవి. మా దేశంబున మా తండ్రికి వ్యాఘ్రేశ్వరుం డని బిరుదనామము. అతఁడు పులులను మఱుపువాఁడు. ఏమి యటులఁజూచెదవు? మా చేతులార వానికి నెఱ వేతుము. అవి మాపైఁ బిల్లులవలె వచ్చి రాచికొని పోవును.

తారా! ఆ పులులెప్పుడో చచ్చియుండును. కడమ వాని కెట్లు తెలియును.

అవి చచ్చియుండు నని తలవను. రక్తపాశ మెవరిని వదలును? వ్యాఘ్రేశ్వరుని కుమార్తెను పులు లెఱుంగకుం డునా? అవి యెవరిని దినినను మనము తప్పించుకొనం గలము.

తారా! నాకట్టి దిటవులేదు. త్రేపు భయంకర మగు చావు తటస్థింప నున్నది. తన యజమానియగు పల్లి వేంద్రునకు ఆనందుఁడు ఆనందము లొనరించుఁగాక.

అమ్మా! నీ వటుఁదలంచితివేని మన మిపుడేచచ్చె దము. మృగములు మనదేహంబును జిందఱ వందఱ చేయ నేల? ముక్కిడిగుంపుల వినోదంబునకే మన మీదేహ మెత్తి

నది. నా కొప్పునందు విషమును దాచియున్నాను జూడుము, దీనిం ద్రావెదము, మిుగించుకొందము, దీనిచే నెట్టిబాధయు లేదు, అతి వేగంబునఁ బనిం జేయును.

తారా! అది మంచిదికాదు. ధర్మంబుకాదు. ఆత్మ హత్య పాపహేతువుగాదా ?

బులులు పెఱుకుకొని తినఁజాలవు. అవశ్యమైనయెడల మొట్టమొదట నీ చురియతో నీ ఱొమ్మున గ్రుద్ది చంపెద, వారు నా కత్తిని దీసికొనిరేని గొంతుపిసికి చంపెద, అటు గానిచో నచటి స్తంభములనుగొట్టి తల పగులం జంపెద నని తామ్రచెప్పెను.

తారా! అది మహాపాతకము, నీవు వడిగట్టకుము, నీ యాత్మ వ్యర్థమగును?

నా యాత్మయా? నా యాత్మ యెటులయిన నేమి? నీవే నా యాత్మవు, మీతల్లి నన్నుఁ బక్షంబుగాఁ గను చుండెను. నీవు బిడ్డవై యున్నపుడు నా ఱొమ్ములపై నుంచి కొని నిదురింపఁజేసితిని. నీ పెండ్లి పీటను వేసితిని. అవశ్య మైనయెడల పులులకడంజిక్కు యవస్థ నొందనియ్యక నిన్ను జంపెదను, పిదప నీపయింబడి నా ప్రాణంబుల విడిచెదను, తరువాత దేవుఁడో దయ్యమో, యెదియో, నా కక్కఱ లేదు. నా యాత్మను స్వర్గంబుననో నరకంబుననో యుంచ నిమ్ము.

నీవు చచ్చిన నీ గర్భమునందలి బిడ్డయుఁ జావవలసి నదే గదా. నేఁడో రేపో, ఎప్పుడో యొకప్పుడు, ఎప్పుడైన నేమి?

తారా! రేపు ఎటులనుండునో యెవరెఱుంగుదురు. మనము చావక యీ యానందుడే చచ్చునేని బిడ్డ బ్రతికి యుండదా? అన్నియు భగవంతుని యధీనంబై యున్నది. భగవంతుఁడు పరిశీలించుఁగాక.

తల్లీ! నీకై చైతన్యనైతిని, అవును, అది యట్లులే నేనొకటి చెప్పెదను, నేను బ్రతికియున్నంతవఱకు నిన్ను

అన, చంద్రకల నిట్టూర్పుల విడుచుచు "తారా! నీకు నాపై నధికప్రేమ యుండుటచేత నిటు లాడెదవు, అట్టి మాటలాడకుము. నేను ననాయాసంబుగఁ జచ్చి నామగనితోఁ గలిసికొనవలయు ననుటయే నా కిష్టము. బిడ్డ యొకటియున్నది గదా, మేము ముగ్గురము జననమరణంబులులేక శాశ్వతంబుగా నుండగలము, తారా! మఱచితిని, మఱచితిని, మగడు బిడ్డ వీరివలె నీవు నిపుడు నాకుఁ బ్రాణపదయగుటచే ముగ్గురము కాము, మనము నలువురమును అని చెప్పెను.

అట్లు జరుగదు. అట్లు జరుగవలయు నని కోరదు. నీ పనికత్తె నీ యింటికుక్క యటులఁ దలంచునే? నా దేహమైనను పులులకిచ్చి నిన్ను గాపాడఁగలను, అని చెప్పుచు

పండ్లు పెటపెట గొఱుకసాగెను. తటాలుమని వంగి చంద్ర కలకు ముద్దిడి యో యని యేడువసాగెను.

విను ! పులులు బొబ్బ పెట్టుచున్నవి ! అని చంద్రకల చెప్పెను.

వేటకాఁడు అడవియందు పులిబొబ్బను వినునటులఁ దలయెత్తి తామ్ర వినెను. అచటనుండు కావలివాఁ డొకఁ డదివినియెను. ద్వారంబునుందర నిటు నటు ఫారాదిరిగెడి పల్లవుడుగాఁడు. చెఱసాల కాపరి. వానిచేత నొక పెద్ద కత్తియుండెను. వానిపేరు నిర్వాణుడు. విని, ఆహా ! ఆహా ! దానిని వినుడు. అందమైనపిల్లికూనలు కూయు చున్నవి. కూనలారా ! అవసరపడకుడు. మీకడుపాఱఁ గొంతసేపటికి మేతదొరకును అని చెప్పెను.

తామ్ర కూతల నెంచుకొని "పులులలోఁ దొమ్మిది ముసలివి వానికూతలు విన్నదే నేను బసిదాన నైతిని. అవు నవును. అడవివాసన కొట్టుచున్నవి. మాయ మ్యాగుడార మునుండి పొగరేగుటయు జూచుచున్నాను. బిడ్డనై యుండి నపుడు నేను వానిని వేటాడితి. ఇపు డవి నన్ను వేటాడును. వానికిఁ గాల మిది.

నాకుఁ దలదిఱుగుచున్నది. బొమ్మ దిమ్మరించు చున్నది. అని చంద్రకల చెప్పుచు తామ్రమకై యొఱగెను. తామ్ర కరుణావివశయై చంద్రకలను జవిరిత్తుకొని దగ్గఱ

నున్న యూటకడకేగి జలంబుల మొగంబునఁ బ్రోక్షించి, కొంత త్రాగించెను. చంద్రకళకుఁ దెలివివచ్చి యటనుండెడి యొకకాలితిన్నె కొఱఁగికొనెను. ఆ ప్రదేశము నీటిపట్టునకు దగ్గఱ నుండుటచే జిల్లుమని యుండెను. అయినను నిద్ర కనులఁ బట్టినది కాదు. ఱేపుచావు నిశ్చయమని తెలిసి యెట్లు నిద్రించును ?

వీరీ విధంబున నుండ నొకతలుపు తెఱువంబడెను. మగవారు స్త్రీలు బిడ్డలుగ ననేకులు వచ్చిరి. ద్వారము నందుండిన చెఱకాపరి వీరింజూచి "స్థిరపురంబుననుండి పులుల విందునకుఁ దప్పక వచ్చినవారు వీరు. చైతన్యులారా ! లోపలికిఁబొండు. మీమీ యలవాటుమేరకు భుజింపుడు. కావల సినవన్నియు యథేష్టముగా నున్నవి. మీరు ఆకలిచెంది యున్నారు. తృప్తిగ భుజింపుఁడనెను.

ఆ గుంపులో వెనుకవచ్చెడి యొక ముసలవ్వ నడువ లేక నడచుచు వచ్చుచుండి పరిహాసముచేయు కాపరిం జూచెను. ఓరీ మూలకుక్కా ! భగవంతుని దూషింపకుము. దూషించుపో ! నీకు దగిన ఫల మనుభవ మగును. అనాగతంబు నెఱుంగు శక్తినింబొందిన ఆర్యనగు నేను దుష్టుండవగు నీకు హితంబుచెప్పెదను. నీ వింతకుమున్ను చైతన్యుఁడవైయుంటివి. కనుక నీవు రెంటికిం జెడినవాఁడవు. నీవు నేడు తిన్నతిండియే కడపటిదని యెన్నుము అనెను. అదివిని

యూ రౌద్రుఁడు పొట్ట కూటికై మతంబును వదలిన వాఁడగుటఁజేసియు, నతని తోడు నీడలుగ నుండిన చైతన్యుల నిపుడు గాఱియ పెట్టుటచేతను మిగులఁ గోపించి, తాఱు మాఱుగ దిట్టి మొలనున్న కత్తినిం దూసెను. అపుడార్య, ఓరీ! కత్తిని దూసెదవా ఆ కత్తివలననే చావుము. అని శపించి, యటనుండ నొల్లక యామె కుంటుచుఁ దనవారిం గలిసికొనెను. శాపాక్షరములు వాని చెవులకు ములుకులై, సోక, తనవు చెమర్చెను. గడగడ వడంకెను. మొగము తెల్లనయ్యెను. వాఁడు ముందు చైతన్యుడై యుండినపు డీమె మహాత్త్వంబులఁ గనులాఱఁ గాంచినవాఁడు. వీరందఱును చంద్రకలయుఁ దామయుఁ గూర్చొనియున్న యూట కడకు వచ్చిరి. చంద్రకల "జయ మగుం గాక" యనియె. గోరంగు నకు జయము అని వారలు ప్రత్యుత్తరమిచ్చి యితగు లున్నచోటికిం బోయిరి. అందఱికి వెనుక కొంత దూరము నందు ఆర్య వణకుచు గుంటుచు నల్లనల్లన కొయ్య నాను కొని వచ్చుచుండెను. ఆమె వచ్చుటతోడనే చంద్రకలలేచి నిలువంబడి నమస్కరించి కౌగలించుకొని, "తల్లీ! ఆర్యా! నన్నెఱుంగవా? బాణునికూతురు చంద్రకలను" అని తన్నె ఱింగించికొనెను. "చంద్రకలా! కుమారీ! అయ్యో! నీ విట కెట్లువచ్చితివి? అని భ్రమనొంది యడిగెను. తల్లీ! నీ వెఱుంగని దేమున్నది. మనము చైతన్యులము త్రొక్క

వలసిన దారి యిదియేఁగదా''యని విచారంబుతోఁ జెప్పుచు ''అమ్మా! ఇట విశ్రమింపుము. నీ వలసియున్నావు, తారా! యీమెకుఁ జేలాగిమ్మ్మ''అనియె. మెల్ల మెల్లన ఊటకడఁ గూరుచుండెను. బిడ్డా! నాకు నీళ్లు త్రావింపుము. స్థిర పురంబునుండి నన్నొకబండిలోఁ దెచ్చిరి. నే నలసి దప్పిగొని యున్నాననెను. చంద్రకల జలమును తన చేతులతో నెత్తి త్రావించెను. ఆపె పది పంద్రెండుసారులు ఆతురతతో ద్రావెను. వారికిపాత్రలు గిత్రలు లేవు. చేతులే పాత్రలయ్యెను.

ఆమె కొంతసేదదిరివి "భగవంతునకు వందనములు. నీ వేమిచెప్పితివి? భానునికూతురు చైతన్యవా? ఇపు డిక్కడను భగవంతునకు జోతలు. నే నీమాట వినలేదు. నేను రెండేండ్లుగా నుత్కలపురంబున నుంటిని. గతవారమే స్థిరపురికిఁ బట్టి తెచ్చిరి.

అవునమ్మా! అప్పటినుండియే నేనుము త్తయిదువగను విధవగ నైతిని.

ఎవరిని పెండ్లియాడితివి బిడ్డా?

మాధవ వర్తకుని. ఆరునెలలకు ముందు అతనిని మల్లరంగమునఁ జంపిరి అని చెప్పుచు వెక్కి వెక్కి యేడ్చెను. నా సంగతి వింటివి, అది మేలైన సంగతియే. * అతని

యాత్మ మోక్షసుఖంబున నున్నది. భిల్లులతో పోరుసలుప నని చెప్పినందున ఆనందుఁడు తలంగొట్ట నుత్తరువిచ్చెను. అమ్మాయీ యేడువకుము. నీ కథ కొంతచెప్పుము. కన్నీరు విడుచుటకుఁ గాలంబుకాదు. కన్నీరు విడువకుము అని ఆర్య చెప్పెను. చంద్రకల కనులం దుడిచికొనెను.

తల్లీ! నా కథ నేమని చెప్పుదును. నేనిపుడు దుఃఖ సముద్రంబున దేలియాడుచున్నాను. మాధవుఁడును నేను నొకరిపై నొకరు బద్ధానురాగులమై యుంటిమి. మాతండ్రియు మాధవుడును స్నేహితులుగారు. వర్తకంబున నొకరితో నొకరు పోటీలు సలిపినవారు. మాధవుడు ముందేమియు నెరుంగనివాడగుటచేత గౌడుల మతంబగు వైష్ణవంబు నవ లంబించి యుండెను. మాధవుఁడు తన బద్ధవైరి యైనను తన వలె వైష్ణవుండుగ నుండుటచేత నన్నుతనికిఁ బెండ్లిచేసి యిచ్చెను. ఇద్దరునుగలిసి భాగస్థులుగా వర్తకంబు సలుపు చుండిరి. గౌరంగస్వామి శిష్యులు స్థిరపురంబునకు వచ్చిరి. వారి బోధలనువిని యమందానందులమై చైతన్యులమైతిమి. మాతండ్రి వీరవైష్ణవుడు: చైతన్యులమాట కలనైన వినడు. నా మగఁడు పైకి వైష్ణవుండుగను లోనికి చైతన్యు డుగనుండి బూటకంబులఁ జూపువాఁడుకాడు. కావున జరి గిన వర్తమానంబును నా తండ్రి కెఱింగించెను. తల్లి! యే మందును? నా తండ్రి భూమిపగుల దన్నెను. కేకవేసెను.

మమ్ము శపించెను. మా మతంబును నిందించెను. నేను నా సంగతిని మా తండ్రికి దెలిపినపుడు మతి పదింతలు గోడువచ్చెను. కన్నకూతురని కూడ నెన్నక నన్నును నా మగనిని మహంతునకు బట్టియిచ్చెను. మహంతు పల్లవుల గొప్పగించెను. వారలు మమ్ము చెఱయందుంచిరి. మహంతులును పల్లవులును దోచుకొన్న సొత్తుకాక మిగిలిన సొత్తంతయు నా తండ్రి యొద్దనే యున్నది. అనేక నెలల వఱకు నామగండును నేనును నిచట జెఱయందుంటిమి. కడకు నతని మల్లరంగమునకు గొనిపోయి నఱికిరి. ఈ తాత్రమతోడ నే నిక్కడ నిలిచితిని. మాతో నీమెయు చైతన్య మైనకతంబున నీ గతియే ప్రాప్తమయ్యెను. నేను ఆనందుని యుత్తరువుచేత నా ప్రాణములును నీమె ప్రాణములును గోలుపోవఁ గాలము వచ్చినది.

పుత్రీ! యిందులకై యేడలనేల? ఇక్కడకు వచ్చినందులకై సంతసింపవలయును. నీ మగనిని గోరంగుని జూడఁగవు గదా!

తల్లీ! నాకు సంతోషమే. నా స్థితిని గంటివా? ఇంత విచారమును ఈ బిడ్డకై యేగాని రొయిందుగాదు. ఇది మాత్రము తప్పి బ్రదుకునేని మనమందఱముఁ జచ్చినను క్లేశంబులేదు. బిడ్డ చావఁగూడదు. కూడదు.

ఆర్య యుజిమి చూచెను. కుమారీ! నీవు పసి దానవై యుండియు నిది కావలయును, ఇది గూడదని దేవు నెదుట జెప్పుటకు ధైర్యంబు గొంటివా? కాఁగల కార్యం బులు భగవంతుని కరంబుల నున్నవి. ఈ యానందుఁడు, మీ తండ్రి, పల్లవులు, గాడులు, బొప్పెడిపుఃబులు అన్నియు దేవుని చేత నున్నవి. అతని యిష్టము కాక వేఱు విధంబుగ నెట్లగును? కావున నతని నుతింపుము. ఆనందింపుము. తేపన్నమాట నెన్నకుము. ఈ దుఃఖభాజనంబగు లోకం బుననుండి గోడుగుడుచుట కన్న భగవంతుని పాదారవిందం బులం జేరుటయే యుత్తమోత్తమంబు.

తల్లీ! నీవన్నమాట సరియైనదే. ధైర్యంబుననుండఁ బ్రయత్నించెద. నా కేదియైన సంభవింపనిమ్ము. నాస్థితి నన్ను బలహీనం జేసెడిని. నిజంబుగా నా యాత్మ సంత సించుచున్నది గాని మనస్సు దుర్బలమైయున్నది. ఎవరో పిలిచెదరు, వినుము. భగవంతు నారాధింపఁ బిలిచెదరు. ఇదియే మన కడపటి యారాధనంబు. అని చంద్రకల లేచి ఇతరులున్న చోటికిం బోయెను.

ఆర్యను లేవనెత్తుటకై తాను యచట నే యుండెను. చంద్రకల కొంతదూరము పోగనే యవ్వకై వంగి, తల్లీ! నీవెఱుంగుదువు. నా యజమానురాలు బిడ్డను సురక్షిత ముగా బ్రసవించునా? యని యడిగెను. ఆర్యకను లెత్తి

నింగిక్తై చూచి మెల్లన నిట్లనియె. "బిడ్డపుట్టి దీర్ఘకాలము జీవించును. పులులు మనల నెవ్వరిని తేపటికి తినవు. అయినను మనలో గొందఱు వేఱువిధంబుగ జత్తురు. నీ యజమానురాలును కొద్దిదినములలో దివికేగును. నా కిది తెలిసియుండియు తెలుపరాదని యుంటిని" అని చెప్పెను. అంతటఁ దామ్రయు, "అమ్మా! నేనును జచ్చిన బాగుండు నని యెన్నెద" ననియె. ఆర్య, "ఏలనే తామ్ర? యజమానికి తోడెవరు? తామ్రా! అట్లుకాదు. ఆమె బిడ్డను సాకుటకు బ్రతికియుందుము. అంతయు ముగించిన వెనుక దివికిఁబోమ్మ." అనెను.

అది యెండకాల మగుటవలన, ప్రతిదినమును ప్రదర్శనంబులు తెల్లవాఱినదే యారంభమై పదునొక్కగంటలకే ముగించునటుల నుత్తరువు చేయుబడి యుండెను. ఆ ప్రదర్శన రంగము ఇరువదివేలకన్న నధికజనంబులఁ బట్టునదియైనను, మితిలేని జనంబులు వచ్చుటచే నది చాలకుండెను. రాత్రి పండ్రెండు మొదలుకొనియే టిక్కెట్లను కొన నారంభించిరి. తెల్లవాఱుటకు మునుపే రంగము నిండియుండెను. అచట స్థలమెంతమాత్రము లేకుండెను. కాని రాజ రాజు పరివారము, సామంతరాజులు, పులుల కెఱగాఁగల చైతన్యులు వీరుమాత్రము వచ్చి కూర్చొనుటకు చోటు వదలి యుండెను. ఈ చైతన్యుల నందఱను జూచుటకై పులుల

కడ విడుచుటకు మునుపే రంగమున వచ్చి కూర్చొని యుండు నటులఁ జేసిరి. చంద్రకల యితరులతో వచ్చి కలసికొను నపుడు, పూజ కారంభింపఁ బడియుండెను. పూజ నారంభించిన యాతఁడు చైతన్యుని కనులారఁగాంచి యతనికి శుశ్రూషలం దనరుచుండిన అగ్రశిష్యుఁడు. ఒకప్రక్క పులుల బొబ్బలు, ఒకప్రక్క చూపరుల కూతలు, ఒకప్రక్క మరణభీతులు ఇవన్నియు నొకటిగానుండ నీ పూజయేమి? ఇట్టికాలమునందును మరణభయంబులేక భగవంతు నారాధించువారి భాగ్యమె భాగ్యము. వారు చావునకు భయపడుదురా? పెండ్లికి పోవువారివలె నానందముగాఁ బులుల కడకుఁ బోరా?

అపుడగ్రపీఠ మందున్న పూజారి, సోదరులారా! మీ కానందమే యనియె. అందఱు నేక వాక్యంబున నానంద మానంద మనిరి. బిడ్డలును నటులనే బలికిరి. ఓరా! భగవద్భక్తి విశేషము! వారు భగవంతుని మాటిమాటికి భజించిరి. ఆ ముసలయ్య యందఱిని దీవించెను. అందఱును ప్రదర్శన రంగమునకువచ్చి కూరుచుండిరి. చంద్రుఁడు గ్రుంకెను. సూర్యుఁ డుదయించుటకు నింక నొకగంట కాల ముండెను. కావున రంగమంతయు జీకటిని మునిగెను. అచటచటఁ గొందఱు దివిటీలు పట్టుకొని యుండినందున చీకటికొంతయు వెలుతురు కొంతయునుగా నుండెను. అపుడు

పూజారి "సోదరులారా! రాజులారా! మహారాజులారా! పల్లవులారా! గౌడులారా! ఓఢ్రులారా! ద్రావిడులారా! తక్కుంగల మహానుభావులారా! చావుటకు సిద్ధమైయుండు ముదుసలినగు నా మాటవినుడు. మీకు నిష్టముండినయెడ చిలుకసరస్సున మునిగిపోయిన మహానుభావుని చరిత్రంబు వినుడు. నిజము తెలియుటలో మీకు బాధకంబు లేదు" అనియె. అపుడు చెఱకాపరి నోరుమూయుము. మీ పిచ్చి మతము నుపన్యసింపకుము అనెను. ప్రదర్శనంబు చూడ వచ్చినవారలు అతనిని వదలుడు. అతని కథను మేము విన వలయును. అడ్డగింపకుడు అని కేకలు వేసిరి. ముసలివానికి కొంత ధైర్యంబు వచ్చెను. ఇరువది నిమిషముల వఱకుఁ దన సామర్థ్యమును జూపుచు నుపన్యసించెను. అందఱు ప్రమాణపడి వినుచుండిరేగాని వలదన్న వాఁ డెవడును లేడు. అపుడు దూరంబుననుండి వినుచుండిన యొకడు ఈ చైత న్యులు మనకన్న బుద్ధిమంతులుగ నున్నారు. వీరేల చావ వలయును అని కేక వేసెను.

అత్తఱిని నీ ముసుసలి పూజారి యిట్లనియె. సేస్తా! ఆనంద మహారాజుగారి చిత్తానుసారంబు మా మరణంబు. మమ్ముల జంపుటకు భగవంతుఁ డతనికి శక్తిని ప్రసాదించి యున్నవాఁడు! మేము భయంకర మరణంబును బొందెద మని దుఃఖింపకుము. మా జన్మము సఫలమగు మంచికాల

మిది, ఓ జనులారా! ఆనందునికై దుఃఖింపుడు. అతని చేతులు మా రక్తములచేఁ దడపఁబడుటకైనదే యని యతనికై వగవుడు. మీకై మీరే చింతింపుడు. మా సమీపవర్తినియగు మరణము మీలోఁ గొందఱి దగ్గఱను ఉండును. పాపమరణాకృష్టులగు మీరెట్లు మేలుకొందురు. అల్ల సింహాసనంబును భగవంతు డసిధార ముంచిననేమి వానిని భగవంతుఁడు పిలిచికొన్ననేమి? ఎవ రడ్డుపడుదురు. మీరు మాత్రము ఇచటనే స్థిరంబుగ నుందురా? మీరు చేసికొన్న సుకృత దుష్కృతములు తప్ప భూమియందు నిలిచియుండునదియేది? ఓ నరులారా! సమయము చిక్కినపుడే కార్యమును నిర్వర్తించుకొనుడు. అసువులు బొంది యున్నపుడే భగవంతు శరణంబు వేడుడు, మీకీసంగతిని జెప్పుమని హృదయంగముఁడైన యీశ్వరుఁడు, పులివాతబడు నాకుఁ బ్రేరకుఁడైన కతంబున నొక్కిచెప్పెదను. భగవంతుని మీరు చూడకున్నను మిమ్ముల నతండు దగ్గఱనుండియే చూచుచున్నవాఁడు. ఇట్టి పాపకృత్యపరులగు మిమ్మును మీ రాజును క్షమింప భగవంతుని ప్రార్థించెద. కుశలము కుశలము.

"మిమ్ముల నతండు దగ్గఱనుండియే చూచుచున్న వాఁడు" అనుమాటలు సభవారి చెవులంబడినదే, యదేమి మాయయో, యందఱును నలుప్రక్కలఁ జూడసాగిరి. చూ

డుడు చూడుడను కేకలు వినంబడియె. అందఱును దలలెత్తి చూచిరి. చీకటియందు నేదో యొకటి సద్దులేక వారితలల మీఁదుగాఁ బోయెను. అది రెండుమూఁడుసారులు కనబడి రాజసింహాసనంబు ప్రక్కఁబోయి మాయమయ్యెను. అప్పు డొకడు భగవంతుఁడని యఱచెను. ప్రజలందఱు దుఃఖించిరి. మఱియొకడు, మూఢా! యేమి యంటివి. అది యొక పక్షిరా యనెను. ఇంకొకడు రాజునకుగాను భగవంతుఁడు గూబయై వచ్చెనుగదా యనెను, కొందఱు నవ్విరి. అనేకు లూఱకుండిరి. ఆనంద దివాంధచరిత్ర మూరివారికి దెలిసిన విషయము. కుశస్థలియం దితనికి మకుటాభిషేకంబు జరుగు నపుడు గూబ యొకటి కనంబడెను. అపుడు శాస్త్రజ్ఞులు, రాజా! యిది జయ సూచకంబు. అయిన నిదియే యెప్పుడైన మఱియొకతూరి కనిపించునేని మరణ మాసన్నమని యెఱుంగు మని చెప్పియుండిరి.

ఆ సమయమునందే మంగళ తూర్యంబులు నగరున మ్రోగెను. ఆనంద మహారాజు తన పరివారంబుతో జను దెంచు చున్నవాడని దూతలు చాటిరి. వాద్యములు దగ్గ ఱించెను. ఆనందుఁ డానంద సహితుఁడై రంగంబున కేతెంచి సామంత రాజులతోడ సింహాసనాసీనుం డయ్యెను. మల్లులు మొదలైనవారలు తాము చచ్చుటకు మునుపు రాజు నకు జైవారంబుచేయుట యలవాటు. కావున దానికై

మునుముంద నన్న యియ్యబడెను. మల్లులు వివిధాయుధ ధరులై రాజున కభిముఖులై జయజయ శుభీభవ ఆనంద మహారాజా! మరణ సిద్ధుల మగుమేము మిమ్ము నమస్క రించెదము, అనిరి. రాజు మందహాసంబు చేసెను. నభి కులు చేతులు దట్టిరి. ఒకరివెంట నొకరుగ ననేకులు కైవా రంబు చేసిరి. కడపటఁ జైతన్యులువచ్చిరి. వారి పూజారి వాక్యంబులను విని త్వరపడిన ప్రజలు వా రానందమునఁ బోవునపుడు గొల్లుమని చేతులుతట్టి నవ్విరి. ఆ నవ్వులను వారు లక్ష్యపెట్టక రాజు సమ్ముఖమునకు వచ్చిరి. ప్రజలు కైవారమని యరచి పూజారి చేతిని జూపెను. అందఱు నూఱకుండిరి. సన్నని యెలుగుతో, రాజా! చచ్చుటకు సిద్ధులమైయుండు మేము నిన్ను క్షమించెదము. భగవంతుఁ డటులం జేయుగాక యనెను. చూపఱులు నవ్వుల నిలిపిరి. రాజు కోపంబుతో నావల పొండని సైగచేసెను. ఆర్య మూడుకాళ్ళ ముదుసలియగుటచే మెల్లమెల్లన దూరమున వచ్చుచుండి కొంతవడికి రాజు నెదుటికివచ్చి యచటనిలిచెను. పరివారము తొలగుమనిరి. ఆమెకదలను లేదు మెదలను లేదు. అట్టె నిలువంబడి మిన్నకుండెను. తన చేతికఱ్ఱపై నానుకొని రాజును దదేకదృష్టిగ వీక్షించెను. రాజు ఆర్యను జూచెను. ఇద్దఱి చూపులు ఏకమైనదే రాజునకు మొగంబు తెల్లనాయెను. ప్రయాసతో ఆర్యనిలంబడి తన కఱ్ఱతోఁ

మీఁదఁజూపెను. అందఱును మీఁదఁజూచిరి. ఏమియుఁ గనఁబడలేదు. రాజునుజూచెను. రాజున కేదియో తోఁచినందున తటాలున దన సింహాసనంబుపై నొఱగెను. ఏదో యోచించుచుండెను. ఆర్య గిఱుక్కుమని తిఱిగి కుంటుచు బరువెత్తివచ్చి తనవారితోఁ గలిసికొనెను. వారి వారి తావులందు వారు వారు చేరిరి.

రెండవతూఱి మనస్సును గుదురుపఱచుకొని, ఆనంద మహారాజు సింహాసనంబునుండి లేచ్చెను. సూర్యకిరణంబులు వాని మొగంబున సూటిగాఁబడెను. ఆనందుఁడు పొడవును గాంభీర్యమునుగలవాఁడు. అతని వస్త్రాభరణంబులు దేదీప్యమానంబులై వెలుంగుచుండెను. నీడనుండి చూచిన ప్రజలకు నతనిదేహము వెండివలెఁ బ్రకాశించును. అతని కిరీటము, కవచము, వస్త్రములు అన్నియు రజత ప్రాయములు. ఆనందుడటులలేచి, ఖడ్గ నారాయణ చక్రవర్తి పేరిట, చక్రవర్తిగారి గౌరవార్థమై వినోదములఁ బ్రారంభింతురుగాక యని ముదల యిచ్చెడ ననియె. మూఁగియుండిన జను లొక్కపెట్టున "భగవద్వాక్యము భగవద్వాక్యము ఆనంద భగవద్వాక్యమని" ఘోషించిరి. ఆనందుఁడు వలదన్నవాఁడుగాఁడు. ఇఱువదివేలగొంతు లొక్కపెట్టున మ్రోగుటచే సురను ద్రాగినవాఁనివలె పరవశుండయ్యె. కొంతవడి యట్టులన నిలిచెను. సూర్యకిరణం

బులు వాని నుదుటఁ దాండవ మాడుచుండెను. ప్రజలు వాని నామంబును భగవన్నామంబుగ గొనియాడుచుండిరి. వానికనులు మిఱుమిట్లు గొలుపుచుండెను. ముక్కుపుటములు పెద్దవయ్యెను. అల్లనల్లనఁ జేతులవీచెను. అట్లగుటకు గారణంబు క్షుద్రజంతువగు తనకిట్టి గౌరవమెట్లు కలిగెనను నాశ్చర్యమో, లేక, తాను భగవంతుఁడేయను నిశ్చయమో యేదియో యొకటి యుండవలయును. ప్రజలు వానిని భగవంతు నట్లే పొగడుచుండిరి. వాఁడు నిలుచుచుండెను. కడుపున వేదనయొకటి కలిగెను, తాను నశ్వరుండగు జీవుండని యెంచుకొనెను. చావు సమీపించినదనియు నెఱిఁగెను. వాఁడు కడుపును బట్టుకొని, “అయ్యో! నేను భగవంతుఁడను గాను. మీవలె నేను నొక మనుజమాత్రుండనే. మనుజులకు సహజ ధర్మమగు మరణ మాసన్నమైనది’’ యని యఱచెను.

అపుడు తన తలకు సూటిగానుండి యొక గూబయందఱికిఁ గనఁబడి యొకమూల దాగెను. అపు డానందుఁడు ప్రజలారా! చూడుడు! చూడుడు! నాకు శుభంబును గూర్చినపక్షి నన్ను వదలిపోవుచున్నది. నేను చచ్చెదను, చచ్చెదను,’’ అని యఱచెను. ఇంతకు మునుపే తానే యీశ్వరుండను మమతచే బూజలంగొన్న వీడు బాధచే నేడ్చుచుండెను. పరివారజనంబులు దబ్బునబోయి రాజు

నెత్తికొనిరి. నన్నిటనుండి తీసికొనిపొండు అని రాజు వడ్చెను. అపుడు దూతయొకడు "ప్రజలారా! రాజునకు దేహము జబ్బయినది. వినోదములు జరుగవు. మీ మీ యిండ్లకు బొండు" అని యెలుగెత్తి పలికెను. ప్రజలు భయాక్రాంతులై కొంతవఱకచటనే కూర్చుండిరి. గోల గోలమను శబ్దము కొంతసేపటికి బుట్టి మహాఘోష మయ్యెను.

"చైతన్యులు చైతన్యులు. వారే రాజునకు చెడుపును జెప్పిరి. రాజునకు తోడుబోతు పెట్టిరి. వారు మాంత్రికులు. వారిని జంపుడు చంపుడని" యొకడరచెను. తోడనే వేన వేలు జనులు చైతన్యులుండు చోటికి వచ్చిరి. వారికిఁ జుట్టును బోడుగుగోడలుండుటచేత దగ్గఱకు రారైరి. కాపరుల నావలికి నెట్టిరాఁ జూచిరి. చైతన్యు లేమి చేయుదురు! ఒకరి నొకరు త్రొక్కులాడిరి. వారి యం దొకరు నేటికి చావు నిజముఅనియె, అట్లుకాదు, మన ప్రాణములు దక్కును, వెంబడింపుఁడు, నాకు దారి తెలియును. అని తామ్ర చంద్రకల నదుమును పట్టుకొని బరబర యీడ్చుచు వెనుక దిడ్డ త్రోవనుదూరెను. అచటి తలుపు తెఱువ బడియుండెను గాని యోధుఁడు కావలియుండెను. వాడు తన యీటెనుజూపి వెనుకకు నిలువుమని యదలించెను. తామ్ర మఱుమాటలాడక చురియనెత్తి వాని బొమ్మన

నొక పోటుపొడిచెను. వాడు కుయ్యో మొఱ్ఱోయని దిగువబడెను. వెనుక వచ్చెడివారు వానిని త్రొక్కి చంపిరి. రంగమునుండి భయంబునఁ బారిపోవుజన సమూహంబు లతోఁ జేరి పలువెత్తసాగిరి. అందు గొందఱు కత్తి వాతఁ బడిరి. మఱికొందరు త్రొక్కుళ్ళ నలిగిరి. కొందఱు ప్రాణములతోఁ దప్పించుకొనిరి. వారిలో నీ తామ్రయు చంద్రకలయు నొకరు. ఒక చోట వీరుచేరి, 'తామ్రా! యిపు డెచటికి, అమ్మా! యిక్కడ నిలువకుము. ఎక్కడికో యొక చోటికి బోదమురమ్మ' అనియె. కడమ వారి గతియేమి యని చంద్రకల యడిగెను. 'అమ్మా మనవలనంగాదు. భగవంతుఁడు రక్షించును' అని తామ్ర చెప్పెను. 'తారా! నన్ను వదలుము, నేఁ జచ్చితి. నీ ప్రాణములను దప్పించుకొమ్మ' అని చంద్రకల చెప్పి దిగువఁ గూర్చుండెను. తామ్ర ఆమెను జవిరి యెత్తుకొని నా యజమానికి, పల్లవ భామినికి, త్రోవ త్రోవయని యఱచుచుఁ బఱువెత్తెను. జనులు తొలఁగిరి.

ప్రదర్శన రంగమును వదలి యొకవీథికి వచ్చెను. ఎక్కడ దాగుదురు? చైతన్యులని తెలిసిన కొట్టి చాకులకు వేతురు. అటు నిటు చూచెను. ఒకపాడు మేడయుండెను. దానియందు నిండ్లులేని బిచ్చగాండ్రు వసించుచుందురని యట నుండు బూడిదె భొగ్గులచేఁ దెలిసికొనెను. అట నుండు

టయు బ్రాణాపాయమే, బిచ్చగాండ్రు వచ్చి చూడరా ? ఆ మేడనుగలయు వెదకెను. మెట్లు కనబడెను. దాని పై నెక్కి చూడ నొక గది తలుపు మూతతో నుండెను. ఇక నేమిచేయును. దిగుదమని దిగఁబోయెను. ఇరువదేండ్ల ఆ కఁ దానిని ఎత్తుకొని ఎక్కుటయే కష్టము దిగుట యెట్లు ? తలుపును ద్రోసెను. వెంటనే యది తెఱచుకొనెను. ధాన్యపు మూటలందుండెను. ఆ ప్రదేశ మిపుడు రాణువ కుపయోగించుటలేదని యెఱిగికొనెను. చంద్రకల నటఁ బరుండఁ బెట్టెను. తలుపును దెఱచికొని మెట్లు దిగి దిగువనుండిన నీళ్ళకుండ నెత్తికొని పైకి నెక్కి గడియ వేసికొనెను. చంద్రకల మొగంబున నీళ్ళు జల్లెను, కనులు దెఱచిచూచి అంతయు నైనదా ఇదేమి స్వర్గమా యనియె. తల్లీ! యిది స్వర్గంబుగాదు గాని యా నరకంబునుండి వచ్చినమనకు నట్టులేతోచును. అది పోనిమ్ము నీరు ద్రావుమని నోటి కందిచ్చెను .చంద్రకల త్రావి నా ప్రాణము లిపుడు కుదిరినవి. మనమెట్లు అల్లరిగుంపును దాటి వచ్చితిమనుచు నడిగెను. శ్రమ యేమియు లేదు. ననక కుండనీరంతయు చంద్రకల ద్రావెను. అవల జరిగిన దంతయు వినెను. తారా ! నీవలన నేను బ్రతికితిని, నీవు లేనిచో జచ్చియుందును. నీకెంతబలమో తారా! నీ కెంత ధైర్యమో గదే, యన, చంద్రకలా! యట్లనకుము. మనల భగవంతుఁడే రక్షించెను. లేనిచో నాపోటు తగిలియుండునా యని శ్రమ

యనియె. ఏమి ? వానిని జంపితివా? యని యడిగెను. ఆశ్యాంబ మునుమున్న చెప్పినవిధంబున వాడు కత్తి పోటున మడిసెను. ఇవుడుజ్ఞప్తికి వచ్చినది. నా చరియయందు నెత్తురు మరకలుండును. మనము వానిని జంపితిమనుటకు వేఱు సాక్ష్యము కావలయునే యని మంటితో రుద్ది నీటితో తుడిచి భద్రపఱచెను.

ఈ పనియైనదే యొక సందడి వినబడెను. అమ్మా ! నీ పుణ్యము నూఱకుండుము. అని చెవిలోఁజెప్పి, యా చప్పుడును జెవియొగ్గి వినుచుండెను. వీరిని వెదకుకొని మువ్వురు పురుషులు వచ్చిన చప్పుడది. అందులో నొకఁడు "అన్నా ! యీ వీధిగుండా యొక రాచపుత్రస్త్రీ గాఁడస్త్రీ నొకతెను జేతుల నెత్తికొని వచ్చినట్లు ఒక తాత నాకు చెప్పెను. ఇక్కడ లేకపోయిన మఱి యెక్కడనుండురు ? అనియె. మఱియొకడు సరేరా! యీ చోటు నిశ్శబ్దముగా నున్నది. మన మిటనుండి కదలుటయే మేలు. వినోదము లిపుడు జరుగునట. చూడఁబోవలయును అనియె. ఇం కొకడు మన స్నేహితుని బొడిచినది రాచపుత్రస్త్రీగదా, యని యడిగెను. వా రట్లనే చెప్పెదరు. వాఁడు గ్రిందఁ ద్రొక్కబడి పడియుండెను. వాని నెత్తునపుడే తల కాళ్ళు మొండెము వేఱువేఱుగను శిథిలంబుగా నుండినవి. ఇది యిట్లని నిర్ధారణచేయ వీలులేదు. వాని స్నేహితులు

గాఁడ రాచపుత్ర స్త్రీలను బట్టి తెండనుచున్నవారు. వారేమి చేయఁగలరో ఎవరికెఱుక యనియొకఁడు చెప్పెను. మొదటివాఁడు ఏమి మాటలురా మనము పోరాదా రెండవ వాఁడు నిదానించి చూచి, ఓరీ! నీ కంట్ల దప్పులుబడ ఇదో పడికట్లున్నవిగదరా. పైకిఁబోయి చూచివత్తము. ఇది యెవరి కుపయోగమురా. ఆ మార్వాడినొంగ అభిరాముఁడు ధాన్యములను నిట దాచియున్నాడు. వాడు తెఱచి యుంచి యుండునని ఎవరు తలంతురు? అనియె.

తోడనే యెవరో యెక్కివచ్చుశబ్దము వినఁబడెను. తలుపును దగ్గరించునటుల దోచెను. చంద్రకల కనుల మూసికొని ధ్యానించెను. తామ్ర కుడిచేతఁ జురియ నుంచుకొని యెడమచేతఁ గడియను బట్టుకొని పులివలె నిలిచెను. పురుషుడు అటవచ్చితన శక్తినంతయు వినియోగించి, తలుపును ద్రోసెను. తలుపు తాళము వేసియున్నదని తృప్తి చేసికొని దిగెను. తామ్రకు ధైర్యంబు వచ్చెను. చెవి యొగ్గి వినెను.

మిద్దె యెక్కి వచ్చినవాఁడు తాళము వేసియున్నది. అభిరాముని దగ్గఱకుబోయి తాళములు తెచ్చి తెఱచి చూచుట మంచిదని చెప్పెను. ఒక డదివిని ఔరా! నీ సంగతి యిపుడు తెలిసినది. నీవు రాచపుత్ర స్త్రీపైననో గాడి విూదనో మరులుకొని నట్టులున్నది. చైతన్యులబట్టు

వారిలో నగ్రగణ్యుండ నని రాజున కెఱింగించెద. రాజు ఉదర వేదనలో నెటుల నున్నవారో పోయి చూడవలయును. ఒకవేళ నా నొప్పి మనబాకీల నిచ్చివేయుమని చెప్పుటకు వచ్చి యుండును. ఈ తడవ బాకీలు తీర్చినా నరే, లేని యెడల నేపని మైనను జూచుకొనియెదను. అనెను. లేదు, లేదు. అభిరాముని కడకేగి తాళము తెచ్చి తెఱచి చూచుటయే మంచిది అని రెండవవాడు చెప్పెను. అభిరాముని దగ్గఱనైనను బొమ్ము కాముని దగ్గఱనైనను బొమ్ము. ఈ యింటి బీగములైన నరకబీగముల నైన దెచ్చుకొమ్ము. వాడిటకు రెండుమైళ్ళ దూరములో నున్నాడు. అని కోపంబుతో నధికారి చెప్పెను. అందులకు గాదండి కాదండి నేను నడువ వలయునని కోరి చెప్పినది కాదు. చైతన్యులను వెదకుచున్నవారము గదా. బీగములను దెచ్చి తెఱచి చూచిన మంచిదని జెప్పితిని అనెను, మువ్వురునుబోయిరి. తారకు నోట తడివచ్చెను. "కరుణాకరునకు నమస్కారములు వారుపోయిరి" అని యామె యనెను. "తారా! వారు మరలరారా? వారు మఱల వత్తురని దిగులందెద." అని చంద్రకల చెప్పెను. వారిక రారు. వారి యధికారి కోపించుకొనెను. అభిరాముని కడకుబోయి బీగము తెచ్చు నంతటి శ్రమను బుచ్చుకొనరు. ఈ పండుగలలో ధాన్యము కొని పోవుటకు అభిరాముడు వచ్చునని మాత్రము భయ

పడెద. ఈ మాటలు తామ్రము నోటినుండి వచ్చినదో లేదో బీగములు గలగలమను శబ్దము చెవులఁ బడెను. తలుపును త్రోసెను. గడియ పడిపోయినది, తలుపు తెఱువఁబడెను. అభిరాముఁడు లోనికివచ్చెను. మఱి యెవరును రాలేదు. మఱలఁ దలుపు మూసికొని లోనితాళంబు వేసికొని, తాళము నందులోనే యుంచెను. అచటనుండిన యొక చిన్న మేజా కడకు రాఁగనే తామ్రము చివాలున లేచి తలుపుకడఁ బోయి నిలిచె. అభిరాముఁ డులికిపడి ఎవరు నీవు అని యడిగి దిగువఁ గూర్చొనియున్న చంద్రకలనుగని యచ్చెరువంది నీ వెవరవని యడిగెను. మీరు పిశాచములా? దొంగలా? బసచేయుటకు వచ్చిన వారా? వీరభటులు వెదకికొని పోయెడి చైతన్యులా? యనెను, తామ్ర మందుకొని "ఔను మే మాచైతన్యులమే. మల్లరంగమునుండి ప్రాణంబుల దక్కించుకొని వచ్చినవారము. ఇచట మమ్ములఁ జూడ వచ్చి మమ్ముగానక వెడలిపోయిరి" అన నభిరాముఁడు "సరి మిమ్మనేల. ఇంటిని తాళంబు వేయక యుండినందుల కీలాభము. మీ రేమియు ననుకొనకుడు. అది నాతప్పు గాదు, నా జీతగానిది. వానిని మందలింపవలయును. అది నేను జెప్పెదను లే" యని తలుపునొద్దకు వచ్చెను. నీవు పోగూడదని తామ్రయడ్డగించెను. నీ వెటుల నడ్డగింతు వని యడిగె. ఇంతకుముందు ఆ తామ్రుని పాడిచిన బిచ్చ

నాతో నిన్ను పొడిచి నిలుపలేనా? యనియెను. నీయొద్ద బిచ్చువా యుండిన నేమిచేతువని మార్వాడి యడిగెను. అది నిజమైన నేదీ నీ కత్తిని దీయుము. మగవాఁడో యాఁడుదో యెవరు గట్టివాఁడో చూతము. బనియా! కలమే నీకత్తి. రసపుత్రమైన నాతో నీవు దీటురావు అని తామ్ర చెప్పెను. అవును అది నిజమే మొరటు గుంపుల కదియలవాటు. నీవనినట్టులే నాయొద్ద కత్తియు లేదు గిత్తియు లేదు. ఇపుడు నన్నుఁ జేయుమన్నదియేమి? యని యభిరాముఁ డడిగెను. అపుడు తామ్ర "నీకుఁ దెలియుచుండలేదా? నన్నేల యడిగెదవు. ఈ కుశస్థలినుండి మమ్ముఁ దప్పింపుము. అదియు మాకోరిక. అటులఁ జేయక వేఱువిధంబునఁ దలంచితివేని మనమందఱ మీకత్తివాతఁ బడుదుమని నమ్ముము. అదియునుం గాక నన్ను బానిసగాఁదెచ్చి యమ్మిన మీ మార్వాడి జాతిపై నాకుఁ గంటు కలదు. ఈ వాకత్తి నీ ఱొమ్మున దూరనిచ్చెదవా? యని కత్తిని దూసెను.

అవునవును. నాకది తెలియును. ఏల కోపంబులు జూపెదవు. మీరు ఈ యూరినుండి వేఱూరికిఁబోవలయునని కదా మీయిష్టము. నన్ను వెలుపలంబోయి సిద్ధంబు చేయనిమ్ము" అని యభిరాముఁ డనియెను. "ఓరీ! నీకుఁ బట్టియున్న పిచ్చి మాకుగూడ బట్టియున్నదని తలంచితివా? నీవు వెలికిఁబోయిన మేమును నీతోడ రావలసినదే! ఏల

వ్యర్థంబుమాటలాడెదవు వినుము. ఈ భాగ్యవతి భీమన గారి యేకపుత్రి. స్థిరపురంబు సాహుకారినుమా! నీ వలని మెఱుంగవా" యని తామ్ర యడిగెను. "భీమన గారా తెలియును తెలియును. నాతో రెండుమూడు తూరులు బేరంబులాడెను" అని యభిరాముఁడు బదులు చెప్పెను. "సరి! అతడు ధనవంతుఁడని నీ వెఱింగిన సంగతియే. ఈ యాపత్తునుండి యీమెను దప్పించితి వేని పెద్ద మొత్తము నియ్యగలఁడు." అని తామ్ర చెప్పెను. అతడియ్యవచ్చును గాని యది నిశ్చయం గానరాదు. అని యభిరాముఁ డనియె. నా కది నిశ్చయమే. మా యజమాని నీ కొక హుండి యిచ్చుచున్నది. దానిం గొనిపోయి యతనికిఁ జూపితి వేని నీ కియ్యఁడా? యని తామ్ర యనియెను.

అభిరాముఁడు:—నిజమే ఇప్పుడుండు సందేహమెద్దియన నతఁడాహుండిని గౌరవించునా? అతఁడు వీరవైష్ణవుఁడు. గాడులలో గాడుడు. చైతన్యులం గన్న గాల్చువాఁడు.

తామ్ర:—అతడు గౌరవించునని తలంచెద. నిజముగా గౌరవించును. అపని నీది బనియా! యిటు చూడుము. గొంతుకోతకన్న సందేహహుండీ మేలు గదా.

అభి:—నిజమే నీ వాదమే శ్రేష్ఠము. వీరిటనుండి తప్పించు కొనఁగోరెదరు. నన్నిచట నేయుంచి యుండిన నెటులఁ జేయఁగలను.

తామ్ర:—అది నీవు యోజించుకొమ్ము. మాతోఁగాక నీ వొంటరిగాఁ బోవరాదు. మా మదికి భయము తోచినదే నిన్ను మొదట బొడుతును. హుండీ తీసికొమ్ము.

అభి:—హుండీవలదు. నే నొకమాట చెప్పెద. నాకుఁ జైత న్యులపై మచ్చరములేదు. బేరసారంబుల వారలు గారవస్థులు. నేటిరాత్రికొక యోడ స్థిరపురంబు నకు బోవుచున్నది. దాని నెక్కిపోయెదరా ? ఈ తూరి నేను బోవ నుద్దేశింపలేదు. నామాట నమ్ముడు. గణేశుపైఁ బ్రమాణంబుచేసెద. నే బయటికేగి యన్నపానంబులఁ గొనివచ్చెద. మిమ్ము లనుబట్టి యిచ్చుటలో నాకువచ్చులాభమేమి ? ఒక వేళ భీమనగారికిఁ దనకూతురిని దప్పించితినను విష యములో సంతోషమై యేదైన నిచ్చునుగదా. అటుచూచిన లాభమున్నది.

తామ్ర తుదకొప్పుకొనెను. అభిరాముఁడు అన్న పానంబులను కొంతద్రవ్యము నందెయుంచి తెచ్చియిచ్చెను. వా రాకలిగొన్న వారయినందునఁదినిరి. అతడు మార్వాడి

వారి దుస్తులనిచ్చి తొడిగించి రాత్రియైనదే యోడ కడకుఁ దెచ్చి వీరలు మావారు స్థిరపురంబునకుఁ బోయెదరు. భద్రముగాఁ గొనిపోయి విడువుఁడు” అని తనయోడవారికి కట్టుదిట్టములు చేసెను. తామయుఁ చంద్రకలయు సంత సించిరి. అభిరాముఁడు వారికడ నుత్తరవుతీసికొని యింటికి వచ్చెను. ఓడ లంగరెత్తి పోవుచుండెను. రాత్రి మూడు గంటలకు జడివాన పట్టుకొనెను. పగటికంతయు నదితు పానుగా మారెను. నడిసముద్రమున బోవుచున్న యోడ యొడ్డునకై వచ్చుచుండెను. ఓడ వారివలన నిలుపుటకు సాధ్యంబుగాక పోయెను. ఒక చేతిపడవమీద నందఱు నెక్కికొనిరి. తామను చంద్రకలను మాత్ర మెక్కింపకుండిరి. వీరు చైతన్యులనియు వీరివలననే యీ యాపద వచ్చెననియు వారిభావము. ఉన్నట్టుండి యల యొకటి లేచెను; ఆ యురవడిచే వారలు బంతులవలెఁ బైకి నెగురఁ గొట్టబడి సముద్రంబున మునిగిరి. ఈ యోడయు బైకి లేచినది. చంద్రకల భయంబుచెంది కనుల మూసికొనెను. తామ భగవంతుని ధ్యానించుచుండెను. కొంతసేపటికి తామ ధైర్యంబు తెచ్చుకొని వెలివచ్చిచూడ నోడ గట్టు నకు దగ్గఱ నిసుకలో నిలిచి కదల మెదలక యుండెను. వాన నిలిచెను. సాయంత్రము మూడుగంటలైనది. ఓడనుండి దిగి దగ్గఱ నేదైన నూరుండిన బోవుదమని తలంచుచుండ,

చంద్రకలకు ప్రసవవేదనగలిగెను. రాత్రి పన్నెండు ఘంటలకు నొక యాడుబిడ్డను గనియె. దగ్గఱనున్న తారను జూచి "తారా! నే నొకమాటను జెప్పెద వినుము. ఈ బిడ్డ యొకగంటసేపు బ్రతికినను లేక యొక నూఱేండ్లు బ్రతికినను తాను చైతన్యకావలసినదియు అదియునుగాక చైతన్యుఁడుకాని యెవరిని బెండ్లియాడరాదని బోధింపుము. ఈ యభిప్రాయము తల్లి దండ్రుల యభిప్రాయమని నొక్కి చెప్పుము అనియె. అప్పుడు తార మూలుగుచు "అమ్మా నీవేల యిట్లనెదవు." అని యడిగెను. అప్పుడు చంద్రకల "తారా! నీకు దెలియదా! నేనుజత్తును. ఏమియును జెప్పకుము. నా కది చక్కగ దెలియును. నా ప్రాణము లుబ్బుచున్నవి. ఈ బిడ్డను గనుటకే నన్ను నింతవఱకు భగవంతుఁడు ఊపిరితోడ నుండజేసెను. నా ప్రార్థన లతనికి విన్నది కాబోలు. నీ విటనుండి స్థిరపురంబునకుఁ బోవలదు, అట మాతండ్రి దీనినికూడ వీరవైష్ణవునుగా జేయును. చిలుక సముద్రంబు కడనుండు వేదాంతుల గ్రామంబునకేగుము. అచట నా మేనమామ ఈశానందుని గనుము. నా మెడనుండు నీగుఱుతుల నతనికిఁ జూపుము. ఏదియునుదాచక కడవెళ్లఁ జెప్పుము. అతఁడు చైతన్యుఁడుగాఁడు. అయినను కరుణగలవాఁడు. సన్మార్గదర్శి. చైతన్యనాశమునకై మాతండ్రికిఁ గ్రూరమైనజాబులను

వ్రాసినవాఁడు. మొదలఁజెఱమండి విడుదలఁ జేయుటకుఁ బ్రయత్నించినది నీవెఱుంగవా? అతని చెల్లెకుమార్తెనగు నాపైఁగరుణించి నాబిడ్డను నిన్నును గాపాడునటుల నేను జెప్పితినని చెప్పుము. అటుచేయఁడేని భగవంతునకు నీ కార్యము నొప్పించవలయునని చెప్పుము. నాబిడ్డ హిత మును మార్చుక యామెకుగావలసినవి తనవలన నైనంత మట్టునకు హితవిషయంబులయందు సహాయుండగునటుల చెప్పుము'' అనిచెప్పి మూర్ఛరాగానే కనులుమూసికొనెను. ఇంతలోఁ దెల్లవాఱినదే చంద్రకల బిడ్డను జేత నెత్తుకొని ''తారా! యీబిడ్డకు మాతల్లిపేరును బెట్టుము. ఇక నే పేరునక్కరలేదు'' అనిచెప్పి పడుకొని తీర్ఘనిద్రజెందెను. తానుచేయునది లేక యటనుండిన తనపైకమును ఓడవారు విడిచిపోయిన పైకము నెత్తుకొని యా యోడకు నిప్పం టించి యటనుండి దిగివచ్చి గట్టుచేరెను. ఆ యోడయందు దైవవశంబున నూనె యుండుటచే దానికంటుకొని కాలిభస్మ మాయెను. తామ్ర యో యని యేడ్చి యూరికై మఱ లెను.

తామ్ర యూరిలోనికిఁబోవునపుడొక యాడుది గోడపై నానుకొని నిక్కిచూచుచుండెను. దానింజూచి యిటనీవేల నిటులఁజూచెదవని తామ్ర యడిగెను. ఆమె తల్లీ! పల్లవులకై చూచుచున్నాను. మా గ్రామాధికారి

కల్లవృలకుఁ బన్నుఁగట్టనని నిరాకరించెను. వారందులకై కినిసి నిన్నటిదిన మిచటికివచ్చి యూరివారలఁజంపి కొందఱిని బట్టుకొని పోయిరి. ఈ కలవరములో నాచిన్నబిడ్డను వదలి పాఱిపోయితి. వారలా బిడ్డలగనికరంబు లేక చంపిరి" అని యేడ్చెను. అమ్మా! నీ వెవరవని యడిగెను. అంతటఁ దాత్రమ అమ్మా! నేను ఓడదరిలెట్టి విఱుగఁ దప్పించుకొని వచ్చినదానను. నాకథఁ జెప్పుట కేదులు పుడులుపట్టును. నాయొద్దఁ జిన్నబిడ్డ యొకటియున్నది. దానికెవరైన పాలిచ్చువారిండిన జీతమిచ్చెదను, ఎవరైనంగలరే యని యడిగెను. ఆ యాడుది యాశతో "నాయొద్దనిమ్ము. నాకేమియు వలదు" అనియె. తాత్రమ యామెనగా దిగఁజూచెను. బిడ్డనిచ్చి తాత్రమ వెనువెంట నడిచెను. వారలొకయింటి కేగిరి. బిడ్డకు నాయమ్మ పాలిచ్చెను. బిడ్డ నిదురించుచుండెను. ఇంతలో మగఁడింటికి వచ్చెను. తినుటకు వారికి గూడు లేకుండెను. తాత్రమ దాది మగని చేత రెండు మొహరీలుంచెను. వారు మిగుల సంతసించి, యింటికి కావలసినవి తీసికొని సుఖంబుండిరి. తాత్రమ వారి కడ నెలదినము లుండెను. నెల కడపటఁ దాత్రమ మఱల రెండు మొహరీలిచ్చి చిలుక సముద్రమునకుఁ బోవలసిన సంగతిసి జెప్పెను. వాడు మఱింత సంతసించి యాఱవ నెలకు బిడ్డ కొంచెము పెద్దదగును. అప్పుడు నిర్భయముగాఁ

బోవచ్చుననియె. అయిదవ నెలయందు వానిచేత నాలుగు మొహరీలిచ్చెను. వాఁడు దానితో బండి యెద్దుతీసి యాఱవనెలకుఁ జిలుక సముద్రంబునకుఁ బ్రయాణమై చిలుక సముద్రంబును జేరిరి.

అచట మందున కొంక యాడుది యైనను గనంబడ లేదు. ఒక మగవాఁ డొకచోట పండుకొనియుండెను. అతని కడకుఁబోయి "అయ్యా! యీశానందస్వాముల వా రెచటనున్నవారని యడిగెను. ఆ మగవాఁడు మొగము త్రిప్పుకొని యామెను జూడక నే ఇట నుండి సూటిగాబోయి కుడిప్రక్కపోవు దారిం బోతివేని తెల్లయెద్దులఁ గట్టుకొని దున్ను నతండే ఈశానందస్వాములు. అతఁడు రాత్రికే యింటికి వచ్చును. ఇపుడు చూడవలయు నని న బొలమునకు బొండని చెప్పెను. వారటనుండి చెప్పిన యానవాలు బట్టుకొని పొలమునకు వచ్చి యీశానందునిం జూచిరి. అతఁ డేబదియేండ్లవాఁడు. గడ్డము పెంచుకొని పొడవుగ నుండెను.

తామ యతనిం గని "స్వామీ! ఈశానందుల వారు తామే కదా" యని యడిగె. అతఁ డవునని యొప్పుకొనియె. స్థిరపురంబున గొప్ప సాహుకారి యగు గోడ భీమన్నగారి భార్యయగు మీనాంబగారికి నన్నగారు మీరేనా? యనెను. ఆ మాట విన్నదే యతని మొగంబు

వాడెను. తోడనే యొప్పటివలె నగు మొగంబయ్యెను, "అవును నన్నట్లు చెప్పెదరు. మీనాంబ నా చెలియలు. ఆమె యిపుడు బంధ నివర్తియై మోక్షానందమున నోలలాడుచున్నది" యనెను. ఈ మీనాంబకు నొక కూతురు. చంద్రకల యుండినది. ఆమె సేవకురాలను నేను అని తాము చెప్పెను. ఉండినది? ఏమి? ఆమెను గూడ తన మగనివలెఁ జంపిరాయేమి? అని యడిగెను. "లేదండి స్వామీ ఆమె ప్రసవించి చచ్చిపోయినది. ఇదియే యామె బిడ్డయని నిద్రపోవు బిడ్డను జూపెను. అతఁడా బిడ్డను జూచినదే సంతసించి వంగి ముద్దుగొనెను. లేదమ్మా! నీ నా కథను జెప్పుమని యడిగెను. ఒకటియు దాచక తామ్రయతనికిఁజూపి తన యజమానురాలి యానవాళ్ళను జూపెను. అతండు కొంతవడి నిదానించి ఆమెను జూచి "నీవు నీ జాతివారివలెఁ జపలవుగావు. మోహంబు కల్పించుదానవును గావు, అది యటుండనిమ్ము. ఆడుది చిన్నదిగ నున్నను పెద్దదిగ నున్నను జేర్ప రాదని మాయాశ్రమ ధర్మము. అటులుండుటచేత నిన్నుఁగాని యీబిడ్డను గాని యెటుల జేర్ప గలను అనియె.

యొటుంగుదును. నా యజమానివలెనే నేనును చైతన్యనే సుమా, ఆ ధర్మంబుస్తు లెవి యంటివేని నీ వాకిటికి నెవరు వచ్చినను వారియెడ్ల దయఁ జూపుమనియే. అటుల దయ జూపకున్న నేలిన వానికి ఉత్తరువు చెప్పవలయు ననుటయే యనియె.

నేను వాదులాడరాదు. అందు నాడుదానితో నేల? నీ మొదటి మాటలు నిజమే. అతిధి అభ్యాగతుల నాద రింపవలయునని మాధర్మములు బోధించుచునే యున్నవి. మిమ్ముల నేను వెడలం గొట్టను.

అటుల మాటలాడగా ఈ బిడ్డ నీ నెత్తురు. ఈమె తల్లి చెప్పిన మాటలు వినుము. దీనిని భీనున్నకు నొప్ప గింపకుము. వాఁడు మహాక్రూరుడు అని తాత్రమ చెప్పెను. నా కేమి యీ సంగతి తెలియదా, మాభ్రాతలతోఁ జెప్పక యొకపనియు జేయఁగూడదు. అదివఱకు నీయూరికి బైట నుండు సంసారులతోడ నుండుడు. వారు పెండ్లి చేసికొని యుండు వారు అనియె. తాత్రమ యొప్పుకొని యటఁబోయి యుండెను.

ఈశానందుఁ డీ సంగతిని భ్రాతృసమాజంబున కెఱిం గించెను. సామాజికు లొప్పుకొనిరి. మీనాంబ నూరే గించిరి. ఈమెకును ద్రామకు నొక యిల్లు నిచ్చిరి. వారందు సుఖంబున నుండిరి. మీనాంబ వారినందఱిని

పినతండ్రీ యని పిలుచుచుండెను. మీనాంబకు నెనిమి
దేండ్లు కాఁగా నామెకు సకల శాస్త్రంబులఁ జదివించిరి.
విగ్రహములు చలువ జాతితోఁ జేయ నేర్చుకొనియె. భ్రాత
లందఱు నామెపై బ్రేమగలిగి మెలంగిరి. ఈమెతోడ
నొక గాడుడు కాదంబరి యనువాఁడు కూడిచదువు
చుండెను. మీనాంబ కాదంబరిపై దయగలిగి యుండెను
గాని యతని వలచినది కాదు. కాదంబరి యామెను వలచి
యుండెను గాని వేదాంతుల భయంబున వెలిఁ జెప్పినవాఁడు
కాడు. ఇట్లు కొన్నియేండ్లు జరిగెను. మీనాంబకు పదునై
దేండ్లయ్యెను. వైష్ణవులు వేదాంతులపై దండెత్తి వచ్చిరి.
వచ్చిన సేనలూరి పయింబడి ధాన్యంబులను ధనమును గొల్ల
గొట్టుకొని పోవసాగిరి. అపు డొకచోట విల్లునమ్ములతో
కాదంబరి డాగియుండెను. మీనాంబ తామ్రతోడ విహా
రార్థమై పోయియుండి పొద చాటుననుండు కాదంబరింజూచి
యింటికిరమ్ము. ఇట నేమి చేసెదవని యడిగెను. ఒకపులికై
వేచి యున్నానని బదులు చెప్పెను. ఇటఁ బులివచ్చుటేమి
నీవు కాచియుండుటేమి యని మీనాంబ యడిగెను. తామ్ర
వానితో మనకు బనియేమి రారమ్ము. వాడు దేనికైన
గాల్వనిమ్ము అని యింటికిఁ దోడుకొని పోయెను. త్రోవలో
తామ్రమా! పులికై వేచియున్నానని చెప్పెనుగదా కాదంబరి.
ఇచట పులిగిలి యెక్కడిది యని యడిగెను. పులియా

గిలియగా వాడు మనుజపులికై కాచి యున్నవాఁడు అనియె. నరహత్య పాపంబుగదా యని మీనాంబయడిగె. పాపు లకుఁ బాపమేది? ప్రొద్దాయెను. మనముపోద మని యిల్లు చేరిరి.

కొంత సేపటికి కాదంబరి యింటికివచ్చెను. తామ్ర వానింజూచి కాదంబరీ! పులిని గాల్చినది నేను జూచితిని. అది చచ్చెనా? యని యడిగెను. నీ కేటులఁ దెలియునని వాఁడడిగెను "రసపుత్ర స్త్రీకి దెలియదా? విలు నమ్ములతోఁ బుట్టినవారము. నీ నారికి క్రొత్తగా మైనము చరిమి యున్నావు. నిన్ను నేనక్కడఁ జూచినపుడు నీపొదియందు నాలు బాణంబు లుండెను. ఇపుడు అయిదేయున్నది యని తామ్ర చెప్పెను. నేను పులిని గొట్టినది నిజమే. దానికి దెబ్బ తగిలినది. అయితే నాబాణ మగుపడలేదు. దానికై కడవెళ్ళ వెతకితిని అనియె. సందియమేమి? మంచికను లుండినఁగదా చిక్కును. నీ బాణము నెవరు చూచినను నీదియని చెప్పుటకై యందఱు నొక తెక్కగట్టిన నీవు రెండు తెక్కలు గట్టితివి. నీవు గొట్టినపులి నెవరైనఁ జూచిరేని నీకుదానితోలు నియ్యరు. నీ బాణము వారికేమి తెలుసు." అని పక్కున నగి లోనికిం బోయెను. కాదంబరికి క్రోధంబు నాశ్చర్యంబు పెనగొన నామె నట్టె చూచుచుండెను.

కొంతవడికి దగ్గఱనిలుచున్న మీనాంబను జూచి

"ఆమెయర్థమేమి?" యని మెల్లన నడిగెను. కాదంబరీ! నీవొక మనుజుని గొట్టితివిగాని పులినిగాదని యామె తలంచు చున్నది. నీవీ కార్యము చేసి యుండరాదు. అది వేదాం తులు విన్నఁ బ్రమాదంబుగదా'' యని మీనాంబ చెప్పెను. తన్ను గాచికొనుటకును, తన ద్రవ్యమును నిలుపుకొనుట కును జంపనగునని వేదాంతుల యభిప్రాయంబుగదా యని కాదంబరి యనెను. అవును నిన్నువాఁడెదిరించి చంపవచ్చినం గదా నీకేదైన ద్రవ్యముండినం గదా యటుల చేయనగును. అది లేదు ఇదియును లేదు. నీవు చేసినది తప్పే'' యనియె. అయిన నేమి! నే నొకఁడను. అందఱు నొక్కటి యీ చేత పిఱికిచేతగాదులే యని యెగురవైచి మాటలాడెను. కాదంబరీ! స్నేహంబుకంటె మాత్సర్యము దొడ్డదని తలంచె దవు. అని మీనాంబ యనియె. నేను ధనహీనుఁడ నగు టచే నా కెవరును మిత్రులు లేరు. మత్సరమునకన్న వలపు దొడ్డది నాకనె. ఆమాటవినగనే యామె వెనుకకుఁ గాలు బోనిచ్చిఁ కాదంబరీ వలపా! నీ యర్థమేమి? యనియె.

కాదంబరి:—నేను కలయంతఁ గలవట్టుకు జెప్పెద. హె చ్చుకుందులు సెప్పను. నేడొక నేరము చేసితిని రేపు రెండుచేతును. వేదాంతుల రాణియగు మీ నాంబపై నాకు వలపుకలదని ధైర్యంబుగా జెప్పగల ను. ఆమె నన్ను వలవనీ వలవకుండనీలక్ష్యంబులేదు.

మీనాంబ:—నీకేమి పిచ్చియా?

కాదంబరి:—కన్యకనుఁ జూచినవారికిఁ బిచ్చి యెత్తక యెట్లుండును?

మీనాంబ:—కాదంబరీ! నీ విట్టి దుర్మార్గుఁడవని కలనైన నెంచినదానంగాను. బహు క్రూరుఁడవు!

కాదంబరి:—అవు నీవు చెప్పినది నిజమే. మీనాంబా! నే వలచినంత నిన్నెవరు వలవరు పోయి వచ్చెద.

వేదాంతులందఱు నా దిన మొకటిగాఁజేరి రాజున కొఱుక పఱచిరి. అపుడు అలఘువ్రతుఁడు మహారాజై యుండెను. అతఁ డాఫిర్యాదు నంగీకరించి మీకష్టంబుల విచారించుటకు నొకయుద్యోగస్థు నంపెదనని తెలియ బఱిచెను.

రెండు నెలలకుఁ బిదప నొకనాడు మీనాంబయు దాసియు బాటయం దేగుచుండిరి. దారియెదుట నొక చిన్న పల్లవ సేన వచ్చుచుండెను. వారింగని మీనాంబ వెనుకకు మఱలెను. తామ యామెను జూచి పఱువెత్తకుము. నిలువుము. భయంబునూపరాదు అనెను. మీనాంబ యటులన నిలిచెను. అపుడొకడు దగ్గఱకువచ్చి "శ్రీమతీ! క్షమింపుము. భయంబు సెందకుము. నే నీయూరిని జూడవచ్చితిని. నాకుఁ ద్రోవ తెలియదు. వేదాంతుల యూ

రికిఁబోవుమార్గంబుఁ జెప్పఁగలవా? వారియెడలని నున్నా రని వింటి" ననియె.

ఈ పల్లవసేనలతోడవచ్చి మీరలు వారిని బాధింప వచ్చితిరే యని మీనాంబ యడిగెను. నేనుగాను అయిన నట్లేల యడిగెదవు. అని యుద్యోగస్థుఁ డడిగెను. నేను వారిసమాజంబునఁ జేరినదానను అని మీనాంబ బదులిడెను. ఆ యుద్యోగి యామెనుదేఱిపాఱఁ జూచెను. నీవా! వేదాంతుల సమాజంబునఁ జేరినదానవు. ఆవైష్ణవు లబద్ధ మాడిరి. వారు బ్రహ్మంబును గొలుచువారనియు స్త్రీలన్న వారికిఁ గారాదనియు జెప్పిరి. నీవిపుడు వారిని జేరినదాన వంటివి. నేను నమ్మననియె. "వారికి విందను" అనియె. వారి విందవా? ఇది మఱింత వింతయై యున్నది. ఈమాయా వాదులు (ఇది నామాటగాదు. వైష్ణవులమాట) నీయట్టి వారిని అతిథులుగా గ్రహించెదరా? వారితో మెలగుట సుఖమే యని యెంచెద ననియె. వారు నన్ను సాకుచున్న వారు. వారి పెంపుడుబిడ్డను నేను అనియె. అటులైన వైష్ణవులాడినట్టి వారలు కారు. యోగ్యులనియెన్నెద. లేనియెడ నీయట్టివారిని గనికరంబునఁ బెంతురా? యనియె. వారలుబహుయోగ్యులు సన్మార్గులు. వారిచట సమీపం బున నున్నవారు. వారితో భాషించిన మంచిచెడ్డలను మీరే కనుగొంతురు. మీరు మాతోడవచ్చితిరేని జూపెదనని

తానును తామ్రయు నడచిరి. పల్లవులు వెనువెంటవచ్చుచుండిరి. కొంతదూరమువచ్చి యాయుద్యోగస్థుఁడు తన సేనలను నిచటనే యుండుడని నియమించెను. వార లచటనే మకాముచేసిరి.

తామ్ర, మీనాంబ, ఉద్యోగస్థుఁడు కొంతదూరము నడచిరి. అప్పు డాయుద్యోగి మీనాంబనుజూచి నేను నా చరిత్రంబును జెప్పెదను. అది మీకు నిష్టమేని నెఱింగించెద. నేనమృతునికుమారుండను. మృకండుడను పేరిటివాఁడ. అమృతుఁడతనికాలంబున రాజునకుఁ బ్రధానియైయుండెను. ఆమాట యిప్పుడేల? నాపినతండ్రి కమనీయుఁడు చచ్చునంత వఱకు పలుకుబడి గలిగియుండెను. ఇప్పుడో నే నదృష్టంబు గలయుద్యోగియని మాత్రము చెప్పనగును. అలఘువ్రతుని సేనానాయకులలో నొక్కఁడను. గౌతమీ వేదాంతుల నన్యాయముగా కొల్లగొట్టినసమాచారము విచారించి తెలుపుటకును, ఒక గౌతముని వధింప యత్నించిరని తెచ్చిన దావాను విమర్శించుటకు నేఁ బంపఁబడి యున్నవాఁడను. నా సమాచారంబిదియె. మీసంగతి యెట్టిదో యెఱిగింపవలయును. నీతోడనుండు నామె నావలె సుఖదుఃఖముల కోర్చినది. ఆమె చెప్పిన బాగుండును అనియె.

అప్పుడు తామ్ర యందుకొని, "ప్రభువా! ఈకన్యకకును ఈమెతల్లికిని, నీమెయవ్వకును సేవకురాలనై యుండు

దానను. మృకండుఁడింతలో నడుమవచ్చి నీవంత ముసలి దానవుగావు అనియె. ప్రభువా! వయసుతో నేమి? వా రిరువురును బసితనంబుననే మరణించిరి. ఈమె చంద్రకల కును స్థిరపురపు దేవన్నకును బుట్టినది. అతఁడు మాట కడ్డమువచ్చి "స్థిరపురంబు నేనెఱుంగుదును. అచట రెండు నెలలకుముందట నుంటిని. దేవన్నయుఁ జంద్రకలయుఁ జాలకాలము జీవించియుండరని యెంచెద" ననియె. "భేతాళ పురంబున మగడు మల్లరంగమునందును భార్య బిడ్డను గనియుఁ జచ్చిరి." 'భేతాళపురంబున మల్లరంగమునందా? రాజద్రోహియా యేమి యని' మృకండుఁడడిగెను. మీనాంబ "కాదు కాదు అతఁడు చైతన్యుఁడు" అని చెప్పెను. "ఓ! అయినసరి. వారిని లోకులందఱును శత్రువులుగా భావించు చున్నారు. వారితో నేనును నేస్తంబు చేసి చూచితిని. వారు మిగుల మంచివారును సత్యసంధులు నైయున్నవారు. అయిన మీరు వేదాంతులు గదాయని" మృకండుఁ డడిగెను. "కాము కాము. మేమును చైతన్యులమే. మమ్మును నీ వేదాం తులు గాచుచున్నవారు" అనియె. 'ఇంత పసితనంబున సౌందర్యవతికి నీవృత్తి భయంకరంబుగదాయని' యతండ డిగె. భయమో నిర్భయమో ఆదినుండి యంత్యమువఱకు నేను జైతన్య నేయనియె. మృకండుఁడు తాఁమ్రమకై తిఱిగి చూచి అమ్మా నీకథ నెఱింగింపుమని యడిగె.

తా|మ:—ప్రభువా! నాయజమానురాలితల్లి యొక సాహు కారిబిడ్డ. అతఁడు స్థిరపురవాసి. భీమనయను పేరిటివాఁడు.

మృకండుఁడు:—భీమన? అతఁడా! నాకుఁ జక్కఁగాఁ దెలి యునే. అతఁడువీరవైష్ణవుఁడు. పల్లవులన గంట గాల్చును. అయినను నా కతఁడు కూర్చునేస్తు. అతనియింట నెన్నియోసారులు విందారగించినవాఁడ. వర్తకంబున మిగుల నేర్పరి. మార్వాడీ అభిరాముఁడు లేనియెడ మఱింత పెద్దటికము సంపాదించి యుండును. అతనికి బిడ్డలు లేరు గదా. ఈమె తనతాతయింటికి బోయి యతని యాస్తిని దినుచు నేల యుండ రాదు?

తా|మ:—ప్రభువా! తమకన్ని తెలిసియుండియు నిటుల నడిగెదరా? అతఁడు వీరవైష్ణవుఁడు. చైతన్యుల గాలి సోకరాదు. ఈమె తల్లి చనిపోవునపుడు అచ టికి బోవలదని మందలించినది. భీమన్నకు నీమె బ్రతికియుండునది తెలియదు. మీరు వేదాంతుల కడ నీ కథను విందురు. మీరు భీమనగారికి పరమ మిత్రులరు. మా రహస్యమును బయలు పుచ్చ కుడు.

మృకండుఁడు:—మీరహస్యముల బయలుపుచ్చను పుచ్చను.

అంతయా స్త్రీయు వ్యర్థముగా బోవుచున్నదే.

తా\|మ:—బిరుదములు గిరుదములు గవ్వకుఁ బనికిరావు. స్వేచ్ఛయే సర్వస్వము. నా దొరసానికి దక్కువ లేదు. ఇదియే మాకథ.

అంతలో వారలు రెండుబాటలు చీలు చోటికి వచ్చిరి. మీనాంబ మీరుపోవు మార్గమది. మేము పోవలసిన దీమార్గము అనియె. అటులనా ? అల్లదో కనంబడు పెద్ద మిద్దె యేమి యని యడిగె. అది వేదాంతుల సమాజ రంగము అనియె. అదియో ? అది మాయిల్లు. తా\|మయు నేనునుండుచోటు. ఆ తోటవలన నట్టులనుంచునని తలంచి తిని. ఈమాటలాడుకొనునపుడు పొదలచాటునుండి కాదం బరి వచ్చెను. కాదంబరీ! ఇతఁడు మృకండుప్రభువు. పల్లవ సేనాధిపతి. మనస్వాములను జూచుటకు వచ్చెను. ఇతనికి త్రోవజూపుము. ఇతనిరాకను మాచిన్నాయనకు నితరు లకు దెలుపుము. మాకు ప్రొద్దయినది. ఇంటికి బోవ లయు ననెను. అదివిని కాందబరి మొగముఁ జిట్లించుచు పల్లవులకు, ద్రోవచూపువారలక్కఱ లేదు. గాడు డొక్కడు పిలుచుకొని పోవలసిన యక్కఱలేదు. అని పొదలోదూటి మఱువయ్యెను. అదిగని మృకండుఁడు "నీ స్నేహితుఁడు మర్యాదస్థుఁడుగాడు. వానికి దయయను మాట లేదు. వేదాంతి యెవడైన నిటులఁ జేసియుండునేని,

గాడుదు విల్లుతో గొట్టు వాఁడని చెప్పసాహసింతి'' ననియె. తామ్ర ''ఆపిల్లడా ! చిన్నపక్షులను సహితము జంపడే'' యనియె. మీనాంబ ''కాదంబరికి నితరులపైన యిచ్చ'' యనెను. మృకండుడు అయినసరియే, నిజముగా నేనది నమ్మజాలను. కాని వానిచూపు దొంగచూపులైయున్నవి యనెను. తామ్రా! రా! ఇది మనబాట. ఆయన త్రోవ యటఁబోవుచున్నది. ''అయ్యా! తమకు వందనములు. తా మింతవఱకు మాకుఁ దోడు వచ్చినందులకు వందన ములు'' అని మీనాంబ చెప్పెను. మీరు నాకు ద్రోవ చూపినందులకై మీకు వందనంబుల నాచరించెదనని మృకం డుఁ డనెను.

వారివారిత్రోవల వారువారు బోయిరి. తామ్రయు మీనాంబయు నుండునిల్లు విందింటికి ప్రక్కయిల్లు. ఆ సాయం త్రము తామ్రయు మీనాంబయుఁ దోటలో విహరించుచుం డిరి. ఈశానందుఁడు కంచెకావలినుండి వారిని బిలిచెను. ఏమనియడిగిరి. ''బిడ్డా! యేమియు లేదు. పల్లవసేనాపతి మన విందింట బసచేసియున్నవారు. నీ వెవరైన మనుజులు పోవు టను వచ్చుటను వినినను జూచినను భయంబు చెందకుము. అతనికిఁ గావలసినవన్నియు సమకూర్చుటకు నేనతనితో నుందు ను. అతఁడు పల్లవుడైనను బహుమర్యాదఁ గలవాఁడైనందున నెట్టి తొందరయుఁ గలిగింపరు'' అనెను. ''చిన్నాయనా!

వారికి భయంబు లేదు. ఈ సేనాపతిని తామ్రయు నేను నెఱుంగుదుము" అని యూరికి వెలుపటఁ దాము సంధించినవిధంబును జెప్పెను.

అపుడు ఈశానందుఁడు "తామ్రా! తామ్రా! ఎవరును దోడులేక యూరికి బైటపోఁగూడదని నేను జెప్పలేదా? ఒకవేళ దొంగలో త్రాగుబోతులో యెదుర్కొనిన నేమి చేయుదురు" అని యడిగెను. "నా యజమానురాలు పువ్వులను గోసికొని వత్తమని పిలిచెను. మే మిదివఱకు ననేకమాఱులు పోయి యుంటిమి. భయమేమియు లేకుండెను. బీదల యూరికి దొంగలెవరు వత్తురు. ఆయుధధారినైన నాయెదుట వారి జపంబులు సాగునా?" యని తామ్ర చెప్పెను.

సరిసరి బాధయేమియు జరుగలేదు. ఇకపై నొంటరిగాబోకుడు. సేనానాయకునివలె సేనలు నుండవు. సేనలంతయును వాగుదగ్గఱ మకాము చేసెను. అంగరక్షకులు కొందఱు మాత్రమే వచ్చిరి. బిడ్డా! నేడు పోయివచ్చెద. రేపటికి మాట్లాడుకొందము. అని చెప్పి పోయెను.

మీనాంబ యింటికేగి నిదురించెను. మఱునాడు వేకువను ఈశానందుఁడును మృకండుఁడును వచ్చిరి. మీనాంబ బొమ్మలఁ జేయుచుండెను. మృకండుఁడు ఆమె పనితనమునకు మెచ్చుకొని తనవలె నొక బొమ్మ చేసి

యిచ్చిన యిన్నూరురూపాయల నిచ్చెదనని చెప్పెను. మీ నాంబ మూవారి కిష్టముండిన బొమ్మ చేసియిచ్చెద. ఏబది రూపాయలే దాని సరియైన వెల యనియె. ప్రక్క నున్న యీశానందుఁడు సామాజికుల యుత్తరువు లేక చేయరాదనియెను. ఐనను మంటితో నొకబొమ్మచేసి కొని దానింజూచి కడపట జాతియందుఁ జెక్కవలయును. దానిపై మీరు కూర్చుండుఁడు అని యొకచోటుజూపి కూర్చుండ బెట్టిరి. మంటివిగ్రహము పూర్తి యయ్యెను. సామాజికుల యుత్తరువును వచ్చెను. చలువరాతితో దానిని జేయ వలసి ఆమె యాపనియందు నేర్పుతోఁ జేయుచుండెను. ప్రతిదినము మృకండుఁడు మీనాంబ యింటికి వచ్చుచుండెను. ఇది కాదంబరి కయిష్టంబై యుండెను. మృకండుఁడు వాని మనోభావంబును గాంచెను గాని మీనాంబకుఁ దెలి యదు.

మృకండుఁ డొకనాఁడు పగలు మీనాంబను జూడ వచ్చి గౌడుని జంపినవానిని నేను గనిపెట్టితిని. వాఁడే మీ కాదంబరి యనెను. మీనాంబ యులికిపడి పోవయ్యా పో! వారికి దెలియునా? తెలియునా? యని యదలించి మాట లాడెను. మృకండుఁడు సంకోచించెను. కావలియున్నవా రిరువురు నిద్రపోవుచుండి యపుడే యొకడు మేలుకొనెను. లేదు. ఇపుడు కాదు. ఇక్కడకాదు. నీతో నే నొంట

రిగా మాటలాడవలయును" అని గుసగుస జెప్పెను. మీనాంబ నవ్వుచు ఎపుడు ? ఎక్కడ ? అనెను. నీవే యా వేళను తావును జెప్పుమని పల్లవుఁడడిగెను. మీనాంబ "అటులైన మాతోటలో రాత్రి యేడుగంటలకు తామ్ర తోట చిన్నతలుపును తెఱచియుంచు'' ననియె. మంచిదని మృకండుఁడు కొంతసేపుండి లేచిపోయెను.

రాత్రి యేడుగంటలకు నిద్దఱు తోటలో సంధించిరి. కొంతదూరంబున తామ్ర నిలిచియుండెను. మీనాంబ "అయ్యా" యనెను. అంతలో నతఁడు నామర్యాదల నిటుఁ దలువకుము. ఊరక మృకండూ అని పిలువుము. మృకండు సేనాపతియని మొదలు పెట్టెను. అతండు వితండవాదము చేయకు. నేను చెప్పినటుల నికపైఁ బిలువుము. ఆమె తనచేతుల వీచుచు "మఱేమి లేదు. ఈ కాదంబరి సమాచారము'' మృకండుఁడు కాదంబరియా ! ఆ దుష్టుని పేరు దలంపకుము. వాఁడు కొద్దికాలంబులో నరకంబునఁ బడును. అవును అట్టులే తలంచెదను. అటులఁగానియ్యక చేయుటక్కనే నిట వచ్చుటకుఁ గోరితిని. కాదంబరి విషయము మాటలాడుటకే యిట రమ్మంటిని. అని మీనాంబ చెప్పెను. ''సరే నీ వేమి చెప్పెదవో చెప్పుము కాదంబరి విషయము. అని మృకండుఁడు అడిగెను,

మీనాంబ తనచేతులఁబిసికికొనుచు ''మృకండుప్రభూ

కాదంబరి విషయము మీకేమి తెలియును?'' ''తెలియు ననియా యడిగెదవు. నాకుఁ దెలిసినది యిదియే. నాయొద్ద నొక చారుఁడుగలఁడు. ఎవఁడో యొకడు పొదలో దాగి యుండి గాడుని బాణంబుతో నేయగాఁ జూచినట్లు చెప్పు చున్నాఁడు. వాని నిపుడు కాశి కీడ్చికొనిపోయి యచట మఠాధిపతుల కప్పఁ జెప్పెదను. కాదంబరి విషయము తెలిసినదా యని మృకండుఁ'' డనియె.

ఓహో అటులఁ గాకూడదు. ఆ గాఁడుడు వీనిని గుద్దినాడట. గుద్దునకు గుద్దు తప్పేయని మీనాంబ అనెను. మీనాంబా! మేలు మేలు. గుద్దునకు బాణమా? మంచిన్యా యమే. ఈ కొయ్యతో పొడిచిన ఈటె మొనతో పొడుతువు కాబోలు. నీకు కాదంబరి రహస్యము లన్నియుఁ దెలిసియున్నది కాబోలు, నీ విదియంతయు నెట్లెఱింగితివి'' అని మృకం డు డడిగెను. నేనెఱుంగను. నా మదికిఁదోచినది చెప్పి తిని. అటులఁ గాదు. కాదంబరి నిర్దోషియని చెప్పగలు గుదును అని మీనాంబ చెప్పెను. కాదంబరిపై నీకంత యక్కఱ యేమి? యని మృకండుఁ డడిగె. వాఁడు పసితనము నుండి నాతో ఆడుకొనుచుండినందున స్నేహితుండని యామె చెప్పెను. మృకండుఁడు మంచిజతయే. పావురమును డేగయు. వానిబుద్ధి నీకేల పట్టువడలేదు. సరి! నన్నే మిచేయుమనియె దవు'' అని మృకండు డడిగె. కాదంబరిని కాపాడుడు.

మీరు మీరు మీరు—ఆ సాక్షుల నమ్మకుడు అని ప్రతి మాలెను. ఆ విషయము యోచింపవలయు. ఇంతటి మంచివాఁడు దుర్నీతిపరుఁడై యుండుట విచారకరము. మీనాంబా! నా ధర్మము నతిక్రమింపఁ బాటు పడియెదవా? అని మృకండుఁ డడిగెను. అవును. ఇచటివారలందఱు నబద్ధీకులనియె. మృకండుఁడు వానిపై నీకు వలపుకలదని తలచెద ననియె. మీనాంబ "ప్రభువా! యేమి మాట చెప్పెదవు. వానిపై నాకువలపులేదు. కావలసినయెడ తామ్రు నడిగికొనుడు'' అనియె. మృకండుడు నాకుసాక్ష్యము లక్కఱలేవు. నాకొక ముద్దిచ్చితివేని నమ్మెద ననియె. మీనాంబ ముద్దియ్యఁగడఁగి ముందుకు నొగ్గెను. మృకండుఁ డదిగని నాకు ముద్దియ్యవలదు అని నిరాకరించి, కాదంబరి నా విషయంబున భయపడవలసినది లేదు అని చెప్పి వారికడ ననిపించుకొని తిఱిగెను. కొన్నియడుగు లెత్తిపెట్టినదే కాదంబరి యెదురువడి కాఱు లఱువ ద్వంద్వయుద్ధమున కాదంబరి చేతివ్రేళ్ళ రెంటిని నరికెను. వాఁడోడి తిట్టుచు దనయిల్లు చేరెను. మృకండు డంతట నట నుండి కదలి కొంతదూరము పోవ తామ్రు బిరబిరవచ్చి యేమి జరిగినదని యడిగెను. జరిగినది చెప్పెను. మీరు వానిగొంతు తెగవేయక యూఱకవదలితిరే. వాఁడు మీకును మీనాంబకు నా గర్భశత్రువై యుండును. మీ

కడ రెండవ క_ర్తియేది? యన మృకండు వానిదే. దానిని భద్రముగ గాపాడుడు అనిచెప్పి యింటికేగెను.

మఱునాడు కాదంబరి పోబడి తెలియలేదు. పిమ్మట నొక వారముదినములు గడిచెను. మృకండుడు మీనాంబను జూడలేదు. ఒకనాఁడీమెకడకు వచ్చి నాకు నవసరమైన పని యుండుటచేత నూరికి బోవలయునని మృకండుడు చెప్ప మీనాంబ అట్టి యవసరమైన పనియేదియని యడిగెను. అందుల కతఁడు "నీకు నింతకుమునుపు నా పిన్నబ్బ యున్నవాఁడని చెప్పియుంటిని గదా! ఆతడు చనిపోయినాడని కబురు వచ్చినది. అతని యుద్యోగమును పల్లవచక్రవ_ర్తి నాకిచ్చియున్నవాఁడు" అనియె. మీనాంబ యదివిని, నా కేదియు దెలియదు. మీ విగ్రహ మింక రెండుగంటలలో సిద్ధమగును. పొండనియె. రెండుగంటలు తాళివచ్చి పైకమును చెల్లించి విగ్రహమును దీసికొని మృకండు పోయెను.

కాదంబరి తన యూరికిబోయి యచటి యధికారికి దన తల్లిదండ్రులయా_స్తి నపహరించినవారి నెఱుకఁజేసి, యాయా_స్తినిబొంది గొప్ప సాహుకారి యయ్యెను. వాఁ డటనుండి స్థిరపురంబునకు వచ్చి భీమన్నయింటిని కనుగొని తన్నెఱుకఁ జేసికొనెను. భీమన్న గౌరవించి నీ వెచట నిన్నిదినము లుంటివని యడిగెను. కాదంబరి నేను వేదాంతుల వలన బెంపఁబడితిని. అయినను నేను వేదాంతినిగాను.

నా తండ్రులవలె నేనును వీరవైష్ణవుఁడ ననియె. భీమన్న వారలు కేవలు లెందులకొడుకరు. నా భార్య సోదరుఁడు ఈశానందుఁడు నొక వేదాంతియే. వాడు దయారసంబు గల మూఢుడు. అతని నీ వెఱుగుదువే యనియె. ఆహా! చక్కఁగా నెఱుగుదును. అతని మనుమరాలగు మీనాం బను సాకుచున్నవాఁడు. అని కాదంబరి చెప్పెను. మీనాంబ పేరు విన్నదే భీమన్న యులికిపడెను. ఆపేరు నా భార్యదే. ఆ మాటవిన దుఃఖమగుచున్నది. నీవు చెప్పిన పిల్ల యతనికెట్లు మనుమరాలైనది. అతనికిఁ దన చెలియలు తప్ప వేఱుబంధువులు లేరే యనెను. కాదంబరి అది నేనెఱుంగను. పందొమ్మిది యిరువదియేండ్లకు మునుపు మీ నాంబను తామ్రయను నొక రసపుత్ర యాడుది కొనివచ్చె నట. మీనాంబతల్లి యతనికి మేనకోడలట. చిలుక సము ద్రంబున తన మేనమామకడ వదలునటుల నామె యాజ్ఞా పించినదట యని చెప్పెను. అదివిని భీమన్న అయితే యీ మీనాంబ వేదాంతియా యని యడిగెను. కాదు కాదు ఆమె చైతన్యయని కాదంబరి చెప్పెను. కాదంబరీ! మీ నాంబ యెటుల నున్నది ఆమె కథవిన నింపుగ నున్నది. యనియె. ఆమెకుమించిన సౌందర్యవతులు లోకంబున లేరు. శాస్త్రచర్చయందు నట్టిదే. తాము మా యింటికి రాత్రి భోజనంబునకు వచ్చెదరా యని పిలిచెను. అట్టులనే వచ్చెద

నని వానిని పంపివేసెను.

కొంతసేపటికి మృకండుఁ డచటికివచ్చి భీమన్నను జూచెను. ప్రభువా' వచ్చిన పనియేమి? మాకు మీ రీయ వలసిన పైకమును వడ్డితోఁ దెచ్చితిరా? ఇచ్చిన బాగుండును అని భీమన యడిగె. పైకము నిచ్చుటకా వచ్చితిని? మా యూరికింబోవ సెలవులకై యప్పుడీసుకొని పోదమని వచ్చితి ననియె. నాయొద్దఁ బైకము లేదని భీమన్న చెప్పెను. పైకము లేదా? నీ వ్రాఁతక నియ్యకుము. నా యీ స్త్రీపై వేయి రూపాయలిచ్చి రెండువేలకు వ్రాసికొమ్ము అనియె. అయ్యో మృకండూ! మీరు మీ యూరినుండి వచ్చితిరని యనుకొంటిని. ఇపు డెటనుండి వచ్చెదరు అని యడిగెను. నేను చిలుక సముద్రమున వేదాంతులకడనుండి వచ్చు చున్నాను అనియె. భీమన్న, వేదాంతులా! వేదాంతులా! ఒక సమాచార మడుగవలయునని యున్నాను అనియె. మృ కండుఁడు ఆ సమాచార మట్టుండ నిండు. మన యప్పు విషయము తీరనిమ్ము అనియె. అప్పునకేమి తాము చేవ్రా లుచేసి యిచ్చుటయే యడ్డి, ఇపుడే పైకమెంచెదను. ఇంతకు మునుపొకడు వేదాంతుల సాకుడనియు నచట నొకపడుచు వేదాంతులరాణి యని పిలువఁబడుచున్నదని చెప్పె. ప్రభు వా? ఆ పడుచును నీవు చూచితివా? యని యడిగెను. ఔను చూచితిని. ఆమెకు మించినవారలు లేరు. చదు

వున నామె పెట్టినది భిక్షము. నీ కీసంగతి జెప్పిన వాఁడెవడు. వానికి నొకచేత రెండుప్రేళ్ళు లేవుగదా. వాని పేరు కాదంబరికదా యనియె. ఔను, అది నీ కెట్లు తెలియును? అని భీమన్న యడిగెను. వాని ప్రేళ్ళు నఱికినది నేనే, వాఁడా మీనాంబను ప్రేమించుచుండెను. నే నామెతో మాటలాడుటంగాంచి యోర్వలేక జగడంబునకు బిలిచెను. ద్వంద్వయుద్ధంబున ప్రేళ్ళ నఱికితిని. ఆ కాదంబరి దుర్మార్గుడు, అబద్ధీకుఁడు. వాని యెడల జాగ్రతం గలిగి యుండుడు అనెను. నేనేల వానియెడల జాగ్రతగా నుండవలయును అని భీమన్న యడిగెను. మీనాంబ నీ యాస్తికి స్వంతకర్తెగ నుండుటచేత,

భీమన్న:—నే నట్టులనే తలంచితిని. నా కిపుడు నిశ్చయమైనది. మృకండు ప్రభువా! నానెత్తు రామెదైనను నాసొత్తు నాదే.

మృకండుడు:—సరియే. నీ యాస్తిని నీవే యుంచుకొమ్ము. నీ యిష్టమైన వారి కిమ్ము. నేనును మీనాంబనే కోరెదను గాని నీ సొత్తును గోరినివాఁడను గాను.

భీమన్న:—కాదంబరి, మీనాంబను నా సొత్తును గోరుచున్న వాఁడు. వాఁడు బుద్ధిశాలియని యెన్నెద. ఆమె యేల కాదంబరిని పెండ్లియాడగూడదు? గొప్పవంశమున బుట్టిన గాఁడు కతఁడు. అతడు మంచిస్థితి

వచ్చునని తలంచెద.

మృకండుడు:—నేనుమాత్రము వానికిఁ దీసినవాఁడనే. నేను పల్లవ శ్రేష్ఠుండను, నేనును మంచిస్థితికి వచ్చువాఁడను. వానిస్థితికన్న నా స్థితి మేలుకదా.

భీమన్న:—అవును. నీవు పల్లవుఁడగదా! ఆమె తాత నగునేను గౌడుడను. పల్లవులను ప్రేమించము గదా.

మృకండుడు:—ప్రేమించిన నొకటే ప్రేమించకుండిన నొకటే. ఇదిగో చూడుము నే నొకమాట జెప్పెదను. మీనాంబకు మనోవిరోధంబుగ నేమిచేసినను నాకు విరోధంబె యగును. అపుడు నిన్ను ఖైదు చేసి చక్రవర్తియొద్దకుఁ గొనిపోదును. నా యెదుటనే పల్లవులను ప్రేమించనని చెప్పితివిగదా.

భీమన్న.—ప్రభువా! నే నాటలాటకుఁ జెప్పితిని గాని వేఱు గాదు. వీనిని మనమున నుంచుకొనకుము. నా కియ్యవలసిన యప్పు అటులనే యుండఁగా మఱల నప్పు అప్పు అని యడుగవచ్చినదే నాబుద్ధి తాఱుమాఱైనది.

మృకండుడు:—పిచ్చివాఁడా! నీ యప్పు గావలసినయెడల పుచ్చుకొమ్ము. నే నూఱక యేమి చెప్పెద వని యడిగితిని. ఇంతటి నమ్మకములేని వాని యొద్దఁ బరువత్యము లుంచరా దందురు. అది యటుండ

నిమ్ము. కాదంబరిని పెండ్లియాడునట్టు మీనాంబను బలవంత పఱచకుము. తన యభిప్రాయంబును మార్చుకొనునట్లు నీవు చేయరాదు సుమా !

భీమన్న:—లేదయ్యా! నా మనుమరాలిని గుఱించి యిది యిట్లుండవలయునని నాయిల్లెక్కి వచ్చి మాటలాడుటకు నీ వెవ్వడవు ? నా కాకినటుపెట్టి బైటికిపో. మఱల నా యింటిమొగంబు జూడకుము. నీ పరుపత్యమింతటితోఁ జాలును.

మృకండుఁడు:—ఆహా! అటులనా! నీవు తీర్థయాత్ర చేయుటకుఁ దగిన కాలమిదియే. దేశ దేశములు తిఱిగి చూచువారికి బుద్ధి బలపడును. అదిలేక నీకు బుద్ధి సన్నగిలి దేహము లావై బరువైనది. నీవేమి చేయుదువు. ఈ కాకితమును జదివిచూడుము.

భీమన్న కాగితము నెత్తుకొని చదివెను. అందిటుల వ్రాయఁబడి యుండెను. మృకండు నామ సేనాపతికి:—

స్థిరపురపు సాహుకారి భీమన్న మనపై నసహ్యత నొందినటులఁ గర్ణాకర్ణిని వినుచున్నారము. ఇది నీవు విచారణచేసి నిజమైనయెడల, అతనిని ఖైదుచేసి యిటకుఁ గొనిరమ్ము. ఇట్లు:

గృహబంధుఁడు.

చక్రవర్తి ప్రతినిధి.

ఇది చదివినపుడే భీమన్న గుండెలు పగిలిపోయెను. ఉన్నట్టుండి యొక యుక్తితోఁచెను. ఆ కాగితమును జంపి ముక్కలుముక్కలు చేసెను.

పల్లవా! నీ వారంటు యెక్కడ యని యడిగెను.

మృకండు:—ఎక్కడనా! నా జేబులో. నేను నీకు జూపినది దానిప్రతి ఆ పిలుపుగంటను దాకకుము. ప్రమాదము వచ్చును. దీనిచూడుము. అని వెండియీాలను జూపెను. నీ వాకిట నేబందుద్రు సయినికు లున్నవారు. ఈలవేతునా?

భీమన్న:—అటులవలదు. మీానాంబకు తన యిష్టప్రకారము నడచు కొనునటుల జేసెద. ఈ మాట తప్పను. అని ప్రమాణంబు చేసెను.

మృకండుప్రభు సంతసించి భద్రముగా నుండుము. మఱచెదవు సుమీా. నీ ప్రాణమున కురిదెత్తును. మోసల యందుండువానిని బిలిపింపుము. వాఁడు నీయప్పుల నిచ్చివేయును. అని చెప్ప భీముండు సంతసించి వారిని తన సేవకులవలనఁ బిలిపించి తనయప్పును రాబట్టుకొని పత్రంబుల నిచ్చెను. మృకండుఁ డటనుండి తన యూారికిం బోయెను.

భీమన్న మఱునాడు వేకువలేచి గాలకృత్యంబుల నెఱవేర్చికొని చిలుక సముద్రంబునకుఁ బ్రయాణమయ్యెను. కొన్ని దినంబుల కటఁజేరెను. తన బావమఱది యీాశానం

దుని యింటికేగెను. అతఁడు సమాజంబున నున్నవాఁడని పౌరుగున విని యటకై వచ్చుచుండెను.

ఇట వేదాంతులు పదునెనిమిదేండ్ల వయసుగల పడుచును దమతో నుంచుకొని యుండనగునా కాదా యని వివాదంబు జరిగెను. కొందఱౌనఁరి. మఱికొందఱు కాదనిరి. వారలేదియు నిశ్చయింపజాలక తామను మీనాంబను బిలిపించి తమ సమాజపుఁజట్టముల కెఱింగించిరి. మీనాంబ వ్యసనంబునొంది మాకెవరును ఎచటను దిక్కు లేరు. మా తాతయే మాకు దిక్కు. మీకు మమ్ముల నుంచుకొనరాదని తోఁచనేని మీయందె పెండ్లియాడియుండు వారిలో మంచివారికడ మాకు నిల్లు చూపుదురేని మే మచట నుండెదము అని చెప్పెను. వారలు పదుపురను వేర్కొని యెవరికడ నుంచనగునని వివాదించుకొనుచుండిరి. భీమన్నయు నపుడ యచటికివచ్చి తన్నెఱింగించికొని తాను వచ్చిన సంగతి నెఱింగించెను. వారలతనినొకచోట విశ్రమింపఁ జేసిరి. సమాజంబునంతయుఁ జూచునపుడు సుందరవతియగు నొకకన్య యుండుటనుగని మీనాంబయని యెఱింగెను.

అపుడు సమాజనాయకుడు భీమనగారూ! అల్లదో కూర్చొని యుండు నామెయే మీనాంబ. మీరు తల్లిని గన్న తండ్రియని మొదట నుండి యెఱుంగుదుము. కన్న

కూతురని యెన్నక పులివాత వేయ నప్పగించిన మీకు నీ కన్య నప్పగించుట యిదివఱకుఁ బెంచిన మాకుధర్మంబు గాదు. ఈనఁగాచి నక్కలుపాలుసేసి నట్లగును. సొత్తునీది యైనను సొత్తును గాపాడుకొను శక్తిలేని వాడవని తోచు చున్నది. మేమిదివఱకు గష్టనష్టములకోర్చి నీ సొత్తును గాపాడినందువలన నీ వలెనే మాకును బాధ్యతయున్నది. ఇందుల కేమనెదవు'' అని యడిగి యతని మొగంబును జూచెను. సామాజికులందఱిని దిఱిగిచూచి భీమన్న తల వంచెను. అయ్యలారా! నే నింతకు మునుపు జేసిన కార్యముల నెత్తి చెప్పెదురని యిచటికి వచ్చినవాఁడను గాను. నా వంశపు కన్యక మీయొద్దఁ బెరుగుచున్నదని యీ నాటికి విని పిలుచుకొనిపోవ వచ్చితిని అనెను. సరి! అటులైననే నింతకుమునుపు చెప్పినట్టుల సాకినందున మాకు నీకన్నమించిన యధికార మీ కన్యవిషయమై యుండుటచేత నీ వెట్టి గట్టిమాట నియ్యఁగలవు. ఏతాకట్టు నుంచెదవు'' అని నాయకుఁ డడిగె. గట్టిమాటలేమి? తాకట్టులేమి తెలుపుడు అని భీమన యడిగె.

నాయకుఁడు:—నీవు చనిపోయినవెనుక నీ యాస్తియంతయు మీనాంబకుఁ జేరునటుల వ్రాయుటయు ఆమె నీకడ నున్నపుడు తన యిచ్ఛవచ్చినమేరకు స్వేచ్ఛగా నుం డుటకును, బెండ్లి విషయంబునను నట్టులన వదలు

టకును ఆమె మతమేదియైనను మనకేమిజోలియని మే మెటుల నుదాసీనంబుగనుంటిమో యటుల నీవు నుండుటకును అనుమతింపవలె ననునదే.

భీమన:—వీనిని నిరాకరించినచో!

నాయకుఁడు:—ఇదియే తొలిసారి కడపటిసారి యామె మొగంబును జూచుట యని యనుకొనుము. సాహుకారీ! మేము కలహప్రియులము గాము. మానంబుగ నుండువారము. అందువలన మాకు శక్తి లేదని తలంపకుము. ఈ బిడ్డ మాకొక్కొకరికి కూతురివలె నింతవఱ కుండినది. ఆమెను మే మెడబాయుటకుఁ జింపిల్లెదము. ప్రాయముగల పడుచు నుంచుకొనరాదను మా ధర్మము నతిక్రమించుటకు గాదు. లేనియెడ నామెను పంపుట కుద్దేశింతుమా. అయినను ఆమె యెచటనుండునో యచటికి నామె బ్రతికి యున్నంతవఱకు మా ప్రేమ పోవును. మా సమాజ మంతయు నామెను నొక్కట గాపాడఁ గలదు. ఆమె కేదియయిన కీడు మూడునెడల వేగంబ రక్షింతుము. కీడుచేయనెంచినవారిని శిక్షింతుము. మా యేర్పాటుల వింటివి గదా. నీవు దీని కొప్పుకొననిపక్షమున నీమె యికపై నీకంటఁ బడదు. వర్తకా! మమ్ముల నేమోయని యెంచినట్లున్నది. పిమ్మటఁ

ప్రపంచమంతయు వెదకుము. నీకుఁ గనఁబడునేమో చూతము. చెప్పవలసినది చెప్పితిమి అనిరి. అందఱు మేలుమేలు ఔనౌనని తలయూచిరి.

భీమన్న:—మహాగర్వంబుగొని మాటలాడెదరు. కనులను మూసికొనిన పల్లవచక్రవర్తి వారి యుత్తరువులను ప్రవచించు ప్రతినిధి వాక్యంబులవలె నున్నవి. అయినను మీరు చెప్పినంతవఱకు జేతురని నమ్మకము కలదు. మీరలేకాంతంబున గూరుచుండి కలలను గని యికపై రాఁగల విషయంబుల నెఱుంగుదురు. ఆకసంబున కెగురుదురు. నిప్పున దుముకుదురు. నీళ్ళ మునిగి బెండువలె తేలుదురు. మీకు భూతమో దయ్యమో వశ్యమై యున్నది, యని పరిహాస వాక్యంబులాడ దానిని వినియు వినక సమాజ మంతయు గొల్లున చెప్పవలసినది చెప్పితిమి, చెప్ప వలసినది చెప్పితిమనిరి.

అపుడు తామ్ర "ఏలినదొరా! వారి మాటలవింటిరా! నాకది చక్కగా దెలియును. వారెంత చెప్పుదురో యంత చేతురు. మీరిపుడు చెప్పినది వాస్తవమే. వారి మనసున నుండునదియే చెప్పితి" రనెను.

భీమన్న:—నా మనుమరాలి యభిప్రాయం బెఱుంగ వలయు. చెల్లె! వీరు నన్నవమానపఱచుట నీకు నింపయి

యున్నదా? యనెను. తాతా! నా మేలును గోరివారు చేయుకార్యములకై వారితో కలహింపరాదు. నీ యాస్తి పాస్తు లెవరికి గావలయు? నా స్వేచ్ఛను నీ మనుమరాల ననుకొనుటయందు మాత్రము వదలుదునేగాని తక్కిన వానియందుఁ గలనైన విడతునే? నా తల్లిదండ్రులు నడచిన మార్గంబునందు నడువ నాకునిచ్ఛ మెండు. (తనచేతులతో నిటునటు విసరిచూపుచు) వీరు నా పినతండ్రులు. వెలుపల నుండు వేనవేలుయోగులకై చెప్పునట్టిపని చేయుదునేగాని వేఱువానిం జేయను. వారు నన్నుఁ బ్రేమించెదరు. నేను వారిని బ్రేమించెదను. వారి మనస్సే నా మనసు వారి మాటలే నామాటలు'' అనియె. అదివిని భీమన్న ''ఊ. ఊ. ఆ పొగరుమాటలు ఎక్కడపోవును'' అని గొణుగు కొనుచు గడ్డము నిమురుకొను చుండెను.

నాయకుఁడు ''అయ్యా! నీ యోచనను జెప్పుము. మాకుఁ బ్రొద్దగుచున్నది. సూర్యు డస్తమించుచున్న వాఁడు. కాలకృత్యంబులకై పోవలయు. ఈవాద మింత టితో నిలిపెదము. నీకుఁజెప్ప నోరురానియెడ నీ నా మాటల జ్ఞప్తినుంచుకొమ్ము. క్రొత్తయేర్పాటు లేవియుఁ గావు. మృకండు ప్రభువునెదుట నీవు ప్రమాణంబుచేసి వ్రాసియిచ్చిన ప్రమాణపత్రపు నకలు మాయొద్ద నున్నది. అది మాకుఁ జాలును'' అనియె. మీనాంబ యొగాదిగఁ

జూచెను. ఆమెతాత క్రోధంబువహించి పక్కున నవ్వి "నా కిపుడు తెలిసెను—" అని చెప్పుచుండఁగా నాయకుఁడు "యోగులహస్తములు నిడుదలే, ఇటనుండి పల్లవరాజ్యం బువఱకు బోవునవి" యనెను. భీమన్న వారి చెలిమియు పాముల చెలిమియు నొకటి. మీరు శాంతమూర్తులు. వారితోఁడ మీకేల? మీరింతమాటలనినదే మనకేల యీ పడుచుతో మనయూరికేగుదము. అని తలంచుకొంటిని. అయినను నేనిపుడు కాటికి గాళ్ళుచాపుకొని యుండుటచేత మనవెనుక మనయాస్తిగతియేమి యను తలంపువచ్చెను. ఈమె తల్లిని కనికరంబులేక జంపిన పాపము నివారణంబగు నటుల మీరెట్టి యేర్పాట్లు చేసినను వాని కన్నిటికి నొప్పు కొని పిలుచుకపోయి నా యాస్తినంతయు నిచ్చు తలంపు పుట్టినది. ఆమె మిమ్ములఁ బ్రేమించి నటుల నన్నును బ్రేమించునని యెన్నెద ననియె.

నాయకుఁడు:—భీమనగారూ! రేపటికి పత్రములు వ్రాసి ముగింపఁబడును. దానియందపుడు సంతకము చేయ వచ్చును. అదివఱకు మా యతిథివై యిటనిలువుడని ప్రార్థించెద మనియె. మఱునాడు సాయంత్రములోపల పత్రములు సంతకంబులనొప్పెను. మూడవనాడు మీనాంబ యోగులకందఱికిఁ బోయి వచ్చెదనని చెప్పెను. అందఱు నా యూరివెలుపలనుండు వారధివఱకు నడచి వచ్చిరి.

మీనాంబ కంట నీరు జలజల కారఁజొచ్చెను. ఈశానం దుఁడు "బిడ్డా! యేడువకుము. మనదేహము లెడబాఫు నందునేగాని మనయాత్మ లెడబాయవు. ఈ జన్మమున నైనను మఱుజన్మముననైన నిట్టులేయని యనుకొనుము. అదియునుంగాక రేయుంబవళ్ళు నిన్ను గనిపెట్టియుండెదము" తనబావ మొగంబునుజూచి, "యీవీచునట్టిగాలి మాకు సమాచారంబు చెప్పెను. ఇటులనైన నీకు సహాయుల మగుదుము" అనియె. భీమన్న "ఈశానందా! భీతిల్లకుము. మీ యొద్దనుండు నా పత్రమే తాకట్టుగదా! అందులకుఁ దోడై నా ప్రేమ యుండఁగలదు" అనియె. అటులన నమ్మె దను. తాతా! నీవు ప్రేమజూపిన నేను బ్రేమించకుందునా? యని మీనాంబ చెప్పి యోగులనుజూచి, యఱకొఱమాట లతో వారికి పోయి వచ్చెదనని చెప్పెను. ఈశానందుఁడు అమ్మా దిగులొందకుము. ధైర్యంబుననుండుము. ఈ జన్మంబుననే మనమొకరి నొకరు చూడఁగలుగుదుము" అనియె. తథాస్తు అని మీనాంబ యనెను. భీమన్న తామయు మీనాంబయు వెంటరాఁగా స్థిరపురంబునకు నాలవనాడు చేరిరి.

స్థిరపురంబునకు కొంతదూరంబున నుండునపుడే భీమన తనయింటిని శృంగారించుటకై మనుజులను పంపి యుండినందున నా భవనము శృంగారింపబడి పెండ్లి యింటి

వలె నుండెను. మీనాంబ యోగుల మట్టి గుడిసెలఁ జూచినదేగాని మిద్దె మేడల జూచినది గాదు. కనుక నా యింటియందు నటుల నిటుల దిఱుగ జొచ్చెను. భీమన ముసిముసి నగవులనగుచు వెనుక వచ్చుచుండెను. ఇంటి నంతయు నటులఁ జూచిన వెనుక "అమ్మా! యీ యిల్లు నీ మదికిఁ బట్టినదా" యని భీమనయడిగెను "తాతా! బహు రమ్యమై యున్నది. ఇట్టిది కలనైనం జూడలేదు" అనియె. తల్లీ! ఇకపై నీ యిల్లును నా యాస్తియంతయు నీదే. నేను బిడ్డలులేని గొడ్డును. నన్ను నోదార్పుము" అని భీమన చెప్పెను. మీనాంబ "తాతా! నా యభిప్రాయము నదియే. అయితే—" అను నంతలో మీనాంబా! అది చెప్పకుము. ధనవిద్యా వంశమదంబుచేతను వయోమదంబుచేత నటులఁజేసితి. వృద్ధనారీపతివ్రతాయను లోకోక్తిఁ జొప్పున నాకు ముసలితనము రానురాను బుద్ధి వచ్చుచున్నది. నీవెటులనుండిన నా కవశ్యము లేదు" అనియె. అదిమొదల లందఱును సుఖంబుగా నుండిరి.

మీనాంబ తన తాతగారి యింట నుండునపుడు కాదంబరి యపుడపుడు వచ్చుచుండెను. అయినను మీనాంబ వానితో మాటలాడుటకును భయపడుచుండెను. కొన్ని దినంబులకు వాఁడు వర్తకంబుసేయుటకై బయటి యూళ్ళకుఁ బోయినందున మీనాంబ వానిని కొన్ని యేండ్ల

వఱకు జూచినది కాదు. సాహుకారియొక్క మనుమరాలై నందున నామెకు సర్వసుఖంబు లున్నను ఆమె మనస్సు మాత్రము మృకండు ప్రభువుపై నుండెను. వలపుండిన నతఁడు తనతో జెప్పినపుడు తానేల యొప్పకొనఁ గూడదు. అతఁడు బౌద్ధుఁడు, ఈమె చైతన్య. మత భేదము లున్న నేమి? తనతల్లి మరణకాలంబున నీ యేర్పాటుచేసియే కదా చచ్చినది. ఆమె యుత్తరువు నెటుల దాటుదును. అతడీ వఱకే నన్ను మఱచియుండునని తలంచెద. పల్లవరాజ ధానియందుఁ జూడఁ జక్కని యువతులెందఱు లేరు. ఈ తలంపు వచ్చినపుడామె మనంబు పరితపించును. రేయుంబ వళ్ళు అతని స్మరణయేకాని వేఱులేదు. కలలో నిత్యము నాత డామెకుఁ గనంబడును. అతడెక్కడ?, ఏమిచేయుచున్నా డు? బ్రతికియుండినసంగతి తెలియదా? ఛీ! ఛీ! ఈ తలంపేల గలిగెన్ను. అతడీ లోకంబును వదలియుండిన నా మనంబున కది యెఱుకపడదా? మఱి యతనిపోఁబడికై యెదురెదురు చూచుచుండెను. ఒకటియుఁ దెలియకుండెన్ను.

ఇంటియందే మిక్కిలి మిక్కిలి యుండుటకు సహింపక మీనాంబ యొకనాడు తనతాత యుత్తరువునుగొని సేవకు లును, తామ్రయు వెంబడింప, నూరికి నుత్తరంబుననుండు తాతగారి తోటకుఁ బోయి యటునిటు తిఱుగులాడుచుండి

యటనుండు నొక పాడుదేవళము మెట్లపై తామ్రమయు మీనాంబయుఁ గూరుచుండిరి. వెనుకనుండి యెవరో వచ్చునట్లుండెను. ఆమె తిరిగిచూచెను. పల్లవవీరుఁ డొకడు నిలిచెను. వాని తోడ భీమన్నగారి సేవకుఁ డొకడుండెను. "అమ్మా! మీరు భీమన్నగారి మనుమరాలా?" యని యడిగెను. ఔనని యామె బదులుచెప్పెను. అమ్మా! నాపేరు కులీనుఁడు. నేనొక సందేశంబుగొని వచ్చితి నని దారముతోఁ గట్టి ముద్ర వేసిన యొకజాబును అటులనే భద్రపఱచిన యొక బంగీని నొసంగెను. మీనాంబ యత్యాతురమున వీని నెవరు పంపిరి? ఎటనుండి వచ్చినది. పంపినవారు మృకండుప్రభువు అని కులీనుఁడు చెప్పెను. సంతోషముతో అటులనా? అతడు క్షేమమా? యని మీనాంబ యడిగెను. అతఁడంతగా బాగుగా లేదు. నీ చూపువంటి చూపొకటి యతనిపై సోకిన స్వస్థమగునని తలంచెద ననియె. ఏమి! అతఁడు జబ్బుగా నున్నవాఁడే. మీరు చెప్పునది యొకటియు నాకుఁ దెలియలేదు" అని మీనాంబ యనెను. లేదమ్మా! అతని దేహము బాగుగానే యున్నది. అతని పినతండ్రి యీ నడుమఁ జచ్చెను. అతని యాస్తి యింతయనుటకు వీలు లేదు. అదేమియోగాని చక్రవర్తి యితనిపై మక్కువగొని రేయుంబవళ్ళు అతని విడనాడ కున్నవాఁడు. చక్రవర్తిగారి స్నేహితులెవరును జాలకాలము జీవించుట లేదు.

కావున నేడతడు బ్రతికియున్నవాడని తలంపను వీలులేదు. నీవేమియు భీతిల్లకుము. మీ ప్రభువు సురక్షితముగా నున్నవాడు. నీవేమనెదవో యని పరిహాసమునకుఁ బలికితిని. అమ్మా! ఆ జాబును జదువుము. తామసింపకుము. నేను వచ్చిన పనియైనది. నన్ను దూషింపకుము. నిన్ను జూచినదే నాకడుపు నిండెను. మృకండుని భాగ్యమే భాగ్యము. నేనసూయ పడెదనని యనుకొనకుము. అతఁడు నీకడకు రాఁగలడు. పోయివచ్చెద” ననియె.

కులీనుఁడు పోయినదే తారా! యీ దారమును గోయుము కాని! నాకడఁగత్తిలేదు. తామ్ర ముసిముసినగవులునగుచు దారమును గోసెను. జాబును విప్పెను. అందిటుల వ్రాయబడియుండెను.

శ్రీమతి మీనాంబగారికి స్నేహితుఁడు మృకండుడు వ్రాయునది:—

ప్రియస్నేహితురాలా! నే నిచటికివచ్చినరోజే నీకొకజాబు వ్రాసితిని. ఆ జాబు తెచ్చిన నావ మునిగినదని కబురువచ్చెను. కనుక నాజాబు సముద్రునిపాలయ్యెను. మనజాబేకాదు అనేకు లందుతో వరుణాలయంబున నున్నవారు. నీ విదివఱకే నన్ను మఱచియుండినను ఈజాబు కొంత సంతసంబు నిచ్చునని తలంచెద. మీ తాతకు నేనియ్యవలసిన పైకము నొసంగి క్షేమముగా రాజధానికి

యిపుడేవచ్చి చేరితిని. ఇది యీావఱకు నీకుఁదెలిసియే యుండును. స్థిరపురంబునుండి వచ్చునపుడు ఓడ బ్రద్దలైనది. నాతోడ వచ్చినవార లనేకులు మడిసిరి. అదేమివింతయో గాని నీవిచ్చిన నావిగ్రహముమాత్రము నాతోడ సురక్షిత ముగా గట్టుచేరినది. దానింగొని పోయి యింటనుంచు కొనక చక్రవర్తికిం జూపితిని. అతండిది యెవరు చేరిరని యడిగెను. నేను వేఱువిధంబునం జెప్పక నిజము చెప్పితిని. చక్రవర్తికి నిన్ను జూడవలయునను నాసపుట్టెను. వేయూఱు లైనను నాయింతిం జూడకుండ నని మొరటుపట్టు పట్టెను. అపుడు నేనొక కట్టుకథనుగల్పించి యందు నీవు చచ్చినట్లు చెప్పితిని. ఆకథ వినవలయునని నీకు నాసక్తి యుండదు. అటుగానిపక్షమున నీ విదివఱకు నేమైయుందువో భగవంతు నికే యెఱుక. అటుల నబద్ధమాడియు నాకు దానివలన మఱియొక దోసంగు వచ్చెను. చక్రవర్తి నా మాట విన గనే చింతాక్రాంతుఁ డయ్యెను. అయ్యో! అట్టి విదుషీ రత్నమును భూమి పయింబెట్టక కొనిపోయినయముఁడు క్రూరుడు. 'పాపీచిరాయుః సుగతీ గతాయుః' అను లోకోక్తి నిజమయ్యెంగదా. ఆమెయాత్మకు సంతుష్టి కరం బుగా నొక కార్యంబు చేసెదను. అని శిల్పులరావించి యొకగుడిని కట్టించి యందు నీ విచ్చిన నా విగ్రహంబును బ్రతిష్ఠించి దానికిఁ బూజారిగా నన్నుంచి మృకండు నీకుఁ

ప్రాణంబులపై నాసగలదేని రేయుంబవళ్ళు మీనాంబ దేవళమునందే ప్రొద్దు పుచ్చుము. నీకు వలయు రాజో పచారంబులు జరుప నుత్తరువిచ్చెద ననియె. చక్రవర్తికి నెదురాడువారెవరు? అతని యిష్టప్రకార మియ్యకొంటిని. నా ప్రతిబింబమునకే నేను పూజారి నైతిని. అది నీకుఁ బరిహాసాస్పదమై యుండునని తలంచెద. అదియునుంగాక రాజుగారు లెట్టివరంబులనందక యీ మీనాంబ దేవళంబును గట్టియుండుదురని ప్రజలు సంతుష్టచిత్తులై గుములుగుము లుగా చీమలపుట్ట విరిసినట్లు నొకరివెంట నొకరుగా వచ్చు చుండిరి. వారిచ్చు కానుకలు తీసియుంచుటకే తావు చాల కుండెను. నాకు నిద్రాకాలము రాత్రి రెండుగంటలు మాత్రమే యన నాకెట్టి తీరిక యుండునని నీవు తలంచె దవు? ఈకారణంబులచేత నీకు జాబువ్రాయక నేలుగాఁ జూడక యెవరినైనను బంపక యుంటిని. ఇపుడు చక్రవర్తి చావుబ్రతుకులనున్నవాఁడు. జనులును మిగుల వచ్చుట లేదు. కావునఁ గులీనుని బంపితిని. మన్నింపఁగోరు

"నీ ప్రియుఁడు, మృకండుఁడు''

ఈ జాబును జదివి ముగించి, దానినిముద్దుగొని యొమ్మునదాచెను. పిదప నా బంగిని విప్పఁగా నందు దంతపుఁబెట్టెయు దానితోడ నొక తాళపుఁ జెవియు నుండెను. తాళమును దీసిచూడ పట్టుగుడ్డతో గట్టిన రెంక

మూటయుండెను. అది విప్పగనే యామె సంతోషాతి శయమున నొక కేక వేసెను. అందుఁ దానెన్నఁడు చూచి యుండని అవలదండ యొకటి యుండెను. దానితోడ యుంగరం బొకటియుండెను. దానియందలిపచ్చయందు మృకండు మీనాంబరూపములు చెక్కఁబడియుండెను.

తా(మా యిది చూచితివా యని తా(మకు జూపెను. ఆమె దానింజూచి నీయట్టి సుభగ యెందునులేదు. ఎవరును నిట్టి పసదనంబులఁ దమ ప్రియులకుఁ బంపియుండరు. అని తా(మ చెప్పెను. సుభగయనెదవా? దుర్భగను. అతనికి నావలనను నాకు నతనివలనను ప్రయోజనంబేమి? అతఁడు నన్ను బరిణయమాడ నప్పఁడేయని కనులనీరు దెచ్చు కొనెను. మీనాంబా! చింతిల్లకుము. నీకొకవేళ నతఁడుప్రాప్తించును అని దండను వేసెను. ఎటులనైన నీ వతనిజాబును బొందితివి. నిన్ను నింకను నతఁడు మఱువలేదు. అంతమాత్రము చాలదా. ఆహా! యీ యుంగరము నీ పెండ్లి(వేలికి నెంత సరిగానున్నదో చూడుము అనియె. అటుగాదు. నేనది ధరింప నర్హాను గాను. అని తనచేతిని లాగుకొనెను. అయినను ఉంగరము నూడ బెఱికినది గాదు. అపుడు తా(మ అమ్మా ప్రొద్దు పోవుచున్నది. పడమట మబ్బులెక్కుచున్నవి. నా యను భవంబున నిట్టిమబ్బు లెక్కిన జడిపట్టును. అయిదారు

రోజులకు మనతల బైటపెట్టము రారమ్ము అనియె. ఇరువు రును దమ యింటికేగిరి.

మఱునాడు మిద్దెనుండి చూచుసరికి వీధియందు మిట్ట పల్లములు లేక మోకాలివంటి నీళ్ళు పాఱుచుండెను. వాన కడవతో గ్రుమ్మరించి నటుల నుండెను. మూడవనాడు మూడడుగుల నీటికిఁదక్కువ లేక కుండలు చెట్లతోట మను జుల తలలును కొట్టుకొని పోవుచుండెను. భీమన్న యదిగని అమ్మాయీ! యిటనుండి యెట్లైనను దప్పించుకొని పొమ్ము. నీకువలయు సహాయంబు లమరించెదను అనియె. మీనాంబ "తాతా! నీవు రాక నేనుమాత్రము పోవు టెట్లు? నీవును ర"మ్మనియె. మీనాంబా ! నా ప్రాణంబు పోయినను ఈ సొత్తుల విడిచి రాను. సులభంబుగానందరివలె నేను సంపాదించినవాఁడను గాను. నీవుపసిదానవు. ద్రవ్యపుసంగతి నీకేమి తెలియును. అని తాత చెప్పెను. అట్లయిన నా ప్రాణంబు మాత్రము దొడ్డదేయని మిన్నకుండెను. అయిదు దినము లయ్యెను. నీళ్ళు అయిదాఱడుగులకు నెక్కువై సముద్రము నూరు నొకటియై తోచెను. అంతట నొకయోడ వారి మిద్దెకు సరిగా వచ్చి నిలిచినది. ఎవరనిచూడనందు కాదంబరి యుండెను. వీరిం గనినదే భీమన్నగారూ ! మీనాంబా నీకేమైన బిచ్చిబట్టినదా ? ఊపిరియున్న ఉప్పుమ్మి బ్రతుక రాదా? యీ ధనంబుతోడ మీరు చచ్చిన మీకువచ్చు లాభ

మేము. ఇటరండు అని పిలిచెను. భీమన్న కొంతవడికి నొప్పుకొని తాత మనుమరాలు పనికత్తె ముప్పూరు నందు దిగిరి! ఓడ కొంతదూరంబు పోయెను. క్రొత్త వెల్లువ యొకటి వచ్చెను. ఓడను ద్రిప్పుటకు నెవరికి సామర్థ్యము లేకుండుటచేత నదిపోయి పోయి యొకకొండకు డీకొని మూడు బ్రద్దలయ్యెను. భీమన్న కాదంబరి యిరువురును మునింగిరి. తాత్రమ మీనాంబను జేర్చిపట్టుకొని యీతపై వచ్చి కొండదరిఁజేరి యందుబరుండఁబెట్టి యటునిటు చూచెను. చిలుకసముద్రంబుకడ మీనాంబను పెంచిన ఈశా నందుఁడట నుండ నతనికి సంగతిచెప్పెను. అతఁడు భగవంతుని ప్రార్థించి తాత్రమా! యిట్టి యవస్థవచ్చునని మాకు మునుముంద తెలియుటచేత మే మందఱము నిటదాగియున్న వారము. ఇక పండ్రెండవనాటికిగాని యీ వెల్లువ తీయదు. మీనాంబ తడిగుడ్డల తీసివేసి యీగుడ్డలకట్టుము అని చెప్పెను. ఛాత్రలు నట్టులన యనిరి. అంతలో భీమన్న పైకిలేచి చూడగా నతని కంటికి మీనాంబ చచ్చిపడియుండునటులఁ దోచెను. మనుమరాలు చచ్చెఁగదా. మనకీ ప్రాణమేల యని వరుణుని శరణు జొచ్చెను. మీనాంబ యిది యంతయు జూచుచుండినను నీళ్ళలోబడిన బనహీనంబుచే నేదియుం జేయుజాలకుండెను. తాత్రమ యామెకు దడిగుడ్డలఁదీసి పొడి గుడ్డలంగట్టి యుపచారంబుసేయఁ దెలివివచ్చి మోగుల

తాపునంజేరి సుఖంబుండెను. కాదంబరి చూచునపుడెవ్వరును లేనందున నందఱు హతమైరని యాదుకొనుచు నెటకో పోయెను. ఎనిమిదవనాడు తామ్రయు మీనాంబయు గొండపై గూర్చుండి నీళ్ళపోవు వేడుకను జూచుచుండిరి. అవుడు దూరంబున నెవడో యొకడు ఈదుకొని వచ్చునట్లు వీరికిఁదోచినది. దగ్గఱ రాను రాను పల్లవవీరునివలె నుండెను. కొండకుఁ గొంత దగ్గఱవచ్చి చూడ మృకండు ప్రభువై యుండెను. మీనాంబకపుడెట్లుండెనో చదువరు లూహింతురుగాక! మీనాంబ యత్యాతురమున తామ్రా! మృకండుఁడనియె. అమ్మా భయపడకుము అని యతని వెంట్రుకలఁ బట్టికొని మెల్లన తనకై దిగిచి చంకలఁ జేతులిచ్చి గట్టునగూర్చుండబెట్టికొని చూడ నూపిరిమాత్ర ముండినది. ప్రజ్ఞతప్పి యుండినది. అంతట నా తామ్ర చేతులపై నెత్తికొని యోగులకడంజేర్చి యుపచారంబులఁ జేయుచుండెను. మీనాంబ మృకండుని బ్రతికింపఁ గలిగితిమి కదాయని సంతసంబున వేగంబ వెనువెంటబోవనుద్దేశించి యొక యడుగెత్తి పెట్టి జర్రుమనిజారి నీళ్ళలో బడియె. తడివి తబ్బిబ్బులై యట వంగియుండు నొక కొమ్మను బట్టికొని గట్టెక్కునంతలోఁ బై వెల్లువ యొకటివచ్చి యామె పట్టుకొనియుండు చెట్టుతోడఁ గొట్టుకొని పోయెను. మృకండు ప్రభువును వారి కప్పగించి తిరిగి మీనాంబనువచ్చిచూడ నామె కనబడక

పోయెను. ఆమెగతి యేమయ్యెనోయని కొంత దుఃఖించి చంద్రకళ గర్భవతిగనున్నపుడు చెప్పిన భగవతివాక్యంబుల మనంబున నెలకొల్పి ధైర్యంబుననుండెను. మృకండునకుఁ బ్రజ్ఞవచ్చుటకుఁ బది దినములయ్యెను.

మీనాంబను వెల్లువగొనిపోయి యొక కొండ సమ ప్రదేశంబునఁ బోవునపుడు ఉన్నట్టుండి నీళ్ళు తగ్గెను. ఆమె యా ప్రదేశంబునఁ బ్రజ్ఞలేక కొంతసేపుండెను. వెనుక ప్రజ్ఞరాగా నలుగడలు పరికించి యందుగల వన్యఫలంబుల నాహారంబుగాఁగొని యెచటనుండుటయుఁ దెలియకుండెను. నీళ్ళు మోకాలిబంటి యయ్యెను. చక్రవర్తిగారి యుత్తరవు మేరకు దిక్కులేని యందగత్తెలను ధనమును వెదకుటకు భటులువచ్చిరి. కులీనుఁ డీమెనుజూచి యటనుండి వచ్చుటకు శక్తిలేమిచే బిడ్డవలెఁ దన చేతులపై నెత్తికొని వచ్చి చక్రవర్తికిఁ జూపెను. ఆమె నతఁడుచూచి కరుణించి అన్నపానంబులనిచ్చి తేర్చి యమ్మకపు వస్తువులతోడ నీమెను దన నగరంబున నిలుచునటుల నుత్తరువిచ్చెను. కులీనుఁ డామెకు శుశ్రూషల జరిపించి, కొంత యొడలు స్వస్థమైన దే చక్రవర్తిగారియుత్తరవును వినిపించెను. అపుడామె తనవిధికై దుఃఖించి అన్నా! నీ కుమార్తె నీరీతిని విడచిన యెడ నీకు సమ్మతమై యుండునా? యని యడిగెను. వాఁడు సమ్మతంబని యెటులఁ జెప్పెదును తల్లీ! చక్రవర్తిగారి యుత్త

రువును త్రోయుట యెట్లు? మృకండుప్రభు వీవెల్లువలోఁ గొట్టుకొని పోయి చచ్చెను. అతడుండినయెడలఁ గొంత సహాయంబు చేయును. మునుపటి చక్రవర్తివలెనే యీ చక్రవర్తికిని నతనిపై మక్కువకలదు'' అనియె. అందుల కామె మృకండు ప్రభువ్రాడు చోటిని జెప్పెను. అమ్మా అది నిజమే. ఈ సమయంబున యోగులు మాఖోటివారిని విశ్వసింపరు. బేవార్సు సొత్తులతో తమ్మును జెరుతుమని వారికి భయము'' అని చెప్పుకొనుచుండ నొకయోగి యటకు వచ్చెను. మీనాంబ తన సంగతి నంతయును జెప్పి దుఃఖించెను. అతఁడు భయపడవలదని యభయమిచ్చిపోయెను. మఱునాఁడు కులీనుఁడును మీనాంబయు నోడయెక్కి రాజధానికయి పోవుచుండిరి. వెల్లువయందుఁ గొట్టుకొనిపోయిన కాదంబరి యెట్టులో యొకరీతి బ్రతికి యటకువచ్చి ఆ పోవు నోడ యెవరిదని యడిగెను. పల్లవవీరుఁడు కులీనుఁడు చక్రవర్తి యాజ్ఞచొప్పున బేవార్సు సొత్తులను ఆదువాంధ్రను భీమన్నకుమార్తె మీనాంబను దీసికొనిపోవు నోడయని చెప్పిరి. కాదంబరియు రాజధానికై పోయెను.

కులీనుఁడు రాజధానికివచ్చినదే యింటికిఁబోలేదు. పగటిపూట నింత యందగత్తెను బిలిచికొనిపోయిన నూరివారందఱు నెవరెవరనియడిగిన వారికి బదులుచెప్పుటకే సరిపోవునని యెంచెను. అదియునుంగాక తనభార్య యిప్పటికిఁ

జచ్చియుండునో యేమోయని యతనికి సందేహము. ఈ యాలుమగలకుఁ బెండ్లియై ముప్పదియేండ్లయ్యెను. వారిరు వురు నొకటి రెండేండ్ల యొకటిగా నుండిరి. ఒక సేవకునిఁ బిలిచి తన రాకను భార్య కెఱింగింపుమనియు, చక్రవర్తి గారి యాజ్ఞానుసారముగ నొకకన్యను దెచ్చినటుల వినిపింపు మని పంపెను. వాఁడు సాయంకాలమునకు జ్వాలాంబతోడ వచ్చెను. ఈమె తనమగడు వెల్లువలోఁ జచ్చెనని విన్నది కావున మగనింజూచినదే యెంతయు సంతసంబు నందెను. జ్వాలాంబను కులీనుఁడు కన్నదే భగవంతుని ప్రార్థించెను. మీనాంబను జూచి సందియంబు గొని "నాథా! ఈ గాడ యెవ్వతె? యింతటి యందగత్తెను దెచ్చితివే" యని యడి గెను. నాయకీ! ఈమెను చక్రవర్తిగారి యుత్తరువు చొప్పునఁ దెచ్చితిని. అతఁడు వచ్చినదే యప్పగింపఁవలయు "ఈమె చైతన్య" యనియె. జ్వాలాంబ యామెను నత్యా శ్చర్యంబునం జూచి "బిడ్డా! నీవు చైతన్యవే" యని యడిగె. అవునని యామెచెప్పెను. ఇరువురు నింటికై వచ్చిరి. కొంత సేనలతో కులీనుఁడు ధనమును తక్కిన వారిని దీసికొని రాజభవనంబున కేగెను. ఇల్లువచ్చినదే జ్వాలాంబ తమవెంటవచ్చిన సేనలనుజూచి "ఈమెను భద్రం బుగా దెచ్చి యప్పగించెద అది నాభార" మన వారి నంపి వేసెను. వారు వెల్లువలో శ్రమపడి వచ్చినవారు గాన

సంతోషంబుతో నిండ్ల కేగిరి. వారిరువురు నొంటరిగా నుండునపుడు జ్వాలాంబ మీనాంబను జూచి "తల్లీ! నేనును జైతన్యనే. ఈ సంగతి నా మగనికిఁ దెలియదు" అనియె. మీనాంబ సంతసించెను.

చక్రవర్తి యూరువచ్చి చేరెను. స్థిరపురంబున దొరకినవి యెల్లను నతని సముఖంబునకు దెచ్చిరి. అందు మీనాంబ యొకతె. ఈమెను జూచినదే చక్రవర్తికొడుకు లిరువురును దనకు నిది కావలయుననియు, తనకిది కావలెనని కలహింపమొదలిడిరి. తండ్రి యదిచూచి "బిడ్డలారా! మీరిరువురు నాకొక్క మాదిరియే. ఏల జగడమాడు కొనెదరు. ఒకరి కిచ్చిన మరియొకరికి బాధకరమై యుం డును. కావున దీనిని బహిరంగముగా వేలము వేయించె దను. మీరలే గాదు. మఱియెవరైనను అధికంబుగా నడిగిరేని వారలకీ కన్యక యియ్యబడును. ఇందుల కేమని యెదరనియె. అట్లులన కానిమ్మని యిరువురు సమ్మతించిరి. మీనాంబ కులీను నింటికి వచ్చెను. మఱునాడు వేలము వేయు దినము. ఆ పగలొకయుద్యోగస్థుఁడు ఒక బంగిని దెచ్చి మీనాంబ కిచ్చెను. ఆమె విప్ప నందు నొక బంగారొడ్డ్యాణ ముండెను. దానిపై "జేపటికిఁ దనదై యుండు కామినికి ధర్ముండు పంపిన బహుమతి" యని చెక్కి యుండెను. అదిగన్నదే యామె పామును జేతఁబట్టినట్టుల

విపరి పాఱవైచి దీని నేను ధరింపనని చెప్పుము. నేటివఱకు నాకు నేను సొంతముగదా'' యని కసరుకొనెను. కులీనుఁ డును బ్రాలాంబయు దుఃఖంచిరి.

ఆ యూరియందుండిన చైతన్య మఠాధిపతి శ్రీధరు లచటికివచ్చి యామె నోదార్చిరి. మీనాంబ యతనింగని ''తండ్రీ! నాబొంది నికపై ప్రాణంబులుండవు. ఇదివఱకు నెన్నియో యాపదలందితిని. అవియెల్ల దేహమాత్రమై యుండినవి'' ఇదియో—తండ్రీ! భగవంతుఁడు నీకుఁ జెవులం జెప్పెను. నేను జేయవలసినది యేమి?

బిడ్డా! భగవంతుని విశ్వసింపుము. వెల్లువనుండి తప్పించినవాఁడిటుఁ దప్పింపకుండునా? యని శ్రీధరుఁడు చెప్పెను. అవునని మీనాంబ యొప్పుకొనెను. అంతట నతఁడు లేచి మీనాంబ నాశీర్వదించి చనెను. సాయంత్ర మయ్యెను. ఏల మారంభింపఁ బడెను. వేలమున కనే కులు వచ్చియుండిరి. అందొక యాఁడుది మొగంబును గప్పి కొని నడుమున నొక గంప బెట్టుకొని నిలిచియుండెను. ఆమె నెవరును జూచినవారు గారు.

మొదట వేలము వేయఁబడినది. పదియాఱేండ్లు గల యొక బాలిక దిగులొంది చుట్టు ప్రక్కల జూచుచుం డెను. ఐదు మొహరీలనుండి పదునైదింటికి అనగా 120 రూపాయల కది పోయెను. దాని నొకఁడు తీసెను. వాఁడు

పైకము చెల్లించి యది యేడ్చుచుండఁ గొనిపోయెను. ఇటుల నైదు వేలములు జరిగినవి. ఆఱవది యొక ప్రాయపు గాడ. అది తనకై 20 మొహరీల నడిగికొనెను. ఒక ముసిలివాఁడు 25 అడిగెను. మఱియొకఁడు 30 అనెను. ముసలివాఁడు 40 అనెను. అటుల 60 వఱకు వచ్చెను. ముసలివాడు మఱి రెండడిగెను. జనులందఱు నవ్విరి. వానికి వేలము విడిచిపెట్టబడెను. వేలము వేయు వాని యొద్దకువచ్చి నేను తెపిచ్చెద. నన్ను నీకుఁ దెలియదా యని చెప్పి యామెను నెడమచేయిపట్టి యీడ్చుకొని మఱు గున కేగెను.

మీనాంబ వంతువచ్చెను. వేలము పాడ నారంభించిరి. ఓయని శబ్దము మఱువున వినంబడియె. అందఱచట కేగిరి. అటఁ జూచునపుడు చలవఱాళ్ళపై ముసలి వాఁడు చచ్చి పడియుండెను. వాని ప్రక్కన వేలము వేయఁ బడిన గాడ యెఱ్ఱని బిచ్చువాను జేతబట్టుకొని యుండెను. దానిని పట్టుడు కొట్టుడు చంపుడని కేకలు వేసిరి. తనకు దగ్గఱ వచ్చువఱకు ఆమె యూఱకుండినది. తోడనే యా బిచ్చువాను తనఱొమ్మున గ్రుద్దుకొని ప్రాణంబులు వదలెను. జనులు విషాదాశ్చర్య నిమగ్నులైరి.

పదపడి వేలమునకుఁ బ్రారంభించిరి. ఎంత మొదట జెప్పవచ్చును? సరి వేయి మొహరీలు నవ్యకుడు. అంత

కన్న హెచ్చుగ మొదలు పెట్టనుంటిని. ఏమీ! ఏబదియా! ఏమయ్యా! మీకుఁ గనులు లేవా. పోనీ ఏబది—నూఱు నూఱు. రాత్రియగుచున్నది. అడుగుడు పోయిన రాదు. ఇన్నూఱు మున్నూరు నన్నూరు ఏనూరు ఆర్నూరు ఏళ్నూరు ఎనమ న్నూరు—సరి ఇదిగదా మేలు. ఏమి నిలిచిపోతిరి. రాజ పుత్రా! నూఱులలోనే యున్నది. సరి తొమ్మన్నూరు ఇంతలో కాదంబరివచ్చి వేయి యనియె. రాజ పుత్రు డుఱుమి చూచెను. ధర్మనెదిర్చి యడుగు వాఁడెవ్వడు. వేయియునూరు అని యడిగెను.

కాదంబరి. పంద్రెండు—పంద్రెండు నూఱులు రాజ పుత్రుడు పదుమూడు పదునాల్గు పదునైదు కాదంబరినిజూచి "మీద నేమైన కలదా" అనఁ అతఁడు మఱువున కేగెను. వేలము వదలవచ్చునా? వదలవచ్చునాయని యడుగుచుండ గంపయామె వచ్చి రెండువేలనియె. అందఱు గొల్లుమని నవ్విరి. వేలము వేయువాఁడు అమ్మా! గాఁలుగావు మొహరీలు అనియె. అవునండి రెండువేల మొహరీలే యనియె. సరి సరి నాకేమి. ఎవరెచ్చుడిగిన వారిదని చక్రవర్తి చెప్పెను. రెండు రెండు—మూడు అని రాజ పుత్రుడనె. నాలుగని యాఁడుది చెప్పెను. అంతయే ధర్మ రాజుగారు చెప్పిరి. అంతకు మీదనడుగవద్దని రాజుగారి ముదల యని మిన్నకుండెను.

ఆడుది పైకము నెంచి చెల్లించి మీనాంబను బిలుచుకొని పోవుచుండెను. అటనుండినవార లింతవెలయిచ్చి దీనినేల తీసితివని యడిగిరి. వండిపెట్టను తలదువ్వను అనిరొ. ఈ పనికా నాలుగువేల మొహరీలు. అఱువదివేల రూపాయలు. అని యాశ్చర్యమందిరి. వేలము వేయు చోట నుండిన యొక కరణమును కొంతదూరము తోడుగా రమ్మనిరి. వాడు కొంతదూరముపోయి యిక మీకు భయము లేదు. పొండని చెప్పి తాను ఇటు బయలుదేరెను. ఎదుట మీనాంబకై 1400 వఱకు అడిగి వదలిన కాదంబరి వచ్చెను. అయ్యా! వా రెటుప్రక్కబోయిరి అని యడిగి అయిదు మొహరీల నుంచెను. కరణము నాకు తెలియదనెను. బిచ్చువానుజూపి యింతకు మునుపు గౌడయు ముసలివాడును సాగిపోయిన త్రోవనుబోవ నెంచియున్నా వేయనెను. కరణము మూఢా! ఆదారి నీకు సొంతముగాని నాదికాదురా యని యిదో కుడిప్రక్కఁ దిఱిగి" రని చెప్పెను. కాదంబరి వారిని వెదకుకొని పోయెను.

మీనాంబయు తామ్రయు నేలముకడనుండి యొకరితో నొకరు మాటలాడక పోవుచుండిరి. అయినను గూడ వచ్చిన మృకండుని సేవకుడు నాలుగువేల మొహరీలు! ఎన్నియేండ్లు చేర్చినది? వాలుగువేల మొహరీలు ఈ చిన్నపిల్లకు నిజముగా వీనికి బిచ్చిపట్టియుండవలయు ననుచు వచ్చెను.

కడకు తామ్ర "మూఢా! చాలుచాలు నిలువు. నీవు పిచ్చివికాక పోయిన నేమి? ఈ పిల్లను జూచునపు డీపయిక యెంత పాటిది'' యనెను. అవునవును. నాయజమానికెట్లు లాభము తెచ్చును. ఆ జోలి నీకేల? గంప చులకనైనది యని గొణుగుకొనెను. ఇంతలో వారలింటికి వచ్చిరి. ఎవరు వారు? మాఱువేసపు దొంగయని తామ్ర చెప్పెను. తామ్రయు మీనాంబయు నింటి లోనికిం జొచ్చిరి. అచట తామ్ర తన వేషంబును విప్పెను. మీనాంబ తామ్రను జూడగనే యో యని యేడ్చి కౌగలించు కొనెను.

తామ్రా! యిదియంతయు నేమి? నాకు నెఱింగింపు మనెను. ''భగవంతుఁడు నీ ప్రార్థనల నంగీకరించి, నిన్ను సరియైన కాలమునకు జూచుటకును, నిన్ను విడిపించుటకును ధనము నిచ్చెను'' అని తామ్ర చెప్పెను. ఇది యెవరి ధనము? నే నెచట నున్నదానను'' అని మీనాంబ యడిగెను. తామ్ర యేదియు, జెప్పలేదు. చేయిపట్టి తోడు కొనిపోయి యొక గదికివగ్గఱ చీకటిని నిలువంబెట్టెను. అట మృకండు ప్రభువు కూర్చొనియుండెను. మీనాంబ చూచెను. కాళ్ళు సేతులు వడకఁ జొచ్చెను. "చాలు'' అని తామ్ర చెవులోఁ జెప్పెను. చీకటియందు నిరువురు నిలుచుండిరి. అపుడు మృకండుడు తనకుదాను ఇది యేమి? తామ్రపోయి చాల సేపైనది. ఇదివఱకు రాకున్నది.

ఈమె పోవునంతలో మీనాంబ నవరైన వేళములో కొని యుండును. దీనితో మూడుతూరులు వాకిలికి బోయి వచ్చి నట్లయినది యని చెప్పుకొనుచు లేచెను. అపుడు తామ్రు మీనాంబను జూచి "పోయి మాటలాడుము" అనెను. మీనాంబ వెలుతురునకు వచ్చెను. మొగముపై బూర్తిగా వెలుగు తగిలినది. మృకండుఁ డప్పటికి నామెనుజూడక దండెముకడకు బోయి యటనుండు దోవతినత్తి పైన వేసికొని తిరిగెను.

తెల్లని వస్త్రంబుల ధరించి మీనాంబ నిలచి యుండెను. ఆమెనుజూచి మృకండు తాఁబుమాఁటయ్యెను. నేను కలఁగనెదనా? యనెను. లేదు మృకండూ. నీవు కలగన లేదు. నేను మీనాంబ నని చెప్పెను. క్షణములో నతఁ డామె యొద్దకువచ్చి చేతులు పట్టుకొనెను. ఆమె వలదని నది కాదు. కడకు నన్ను విడువుము. నా కాయాసముగ నున్నది. నిలువ శక్తిలేదు అనియె. దగ్గరనున్న యొక సోఫాపై కూర్చుండెను. మృకండుఁడు వేత్రాకబల్లపైఁ గూర్చుండి జరిగిన సంగతి యేమనెను. చెప్పుటకు నా వలన గాదు. తామ్రు నడుగుడనియె. తామ్రు మీ ప్రశ్నల కేమి లెండి. నేను వెలయిచ్చి తీసికొని. వెలను మీ సేవకు నడుగుడు. ఇపుడామెకు గొంతభోజన మిప్పించు డనియె. అతఁడు దీపమును జేతఁబట్టుకొని వంట యింటి కేగెను.

తాత్రము మీనాంబను దోడుకొనిపోయి తనివి దీర దినిపించెను. మీనాంబ తినుచుండగా తాత్రము కథ యంతయుఁ జెప్పెను. మేలు మేలు. లోభియగు సేవకునకును నంతసొమ్ము వ్యయ పఱచుటకు మనసువచ్చెను గదా. మీనాంబ భాగ్యమే భాగ్యము. నా యాస్తినుండి వచ్చుదానిని గొంచెము కొంచెముగా నెన్నియో యేండ్లు చేర్చిపెట్టినది యొకదినము సెలవుచేసెనుగా యని యాశ్చర్యపడెను. మీనాంబ యతని మొగంబుజూచి "నీపైకమా? నీవు నన్ను తీసితివా?" యని యడిగెను. నే నట్టులన తలంచెదను. అని యతఁడు చెప్పెను. అటులైన నీకు నేను వరవుఁడను గానా? యనియె. అటులగాదు మీనాంబా! నీవు నా దానవుగావా? నిన్న దుగునది యంతయు నాకు భార్య వగుదువనియే కదా యని మృకండు చెప్పెను. అది యెన్నటికిఁ గాదు. అటులఁ గా జాలదని నీ వెఱుగవా" యని యామె చెప్పెను. అతని మొగము తెల్లనయ్యెను. ఎంతయో వచ్చినది పోయి నది ఇంక నట్టులే చెప్పెదవా? అవును మృకండూ—ఏల, ఏల, మీనాంబా—నన్ను కనినవారలు నా కటుల జెప్పి యుండలేదు. అటులుండ నిన్నట్లు పెండ్లియాడుదుము. మృకండుడు కొంత నిదానించెను. మీ వేద మటులఁ జెప్పుచున్నదా? లేదు, లేదు. చచ్చినవారి యాజ్ఞయది. వారి యాజ్ఞల భంగబు చేయుటకన్న వారితోఁ గలియుట

మేలు అనియె. మృకండు కొంత యోచించి, అటులైన నేను చైతన్యుఁడ నయ్యెదననియె. అటులఁగాదు. ఆడు దాని వేసం బూనిన వాఁడు ఆడుదగునా ? ఇది యేటి మాట? దేహము చైతన్యమగుటకాదు. ఆత్మ కావలయును. అది యీశ్వరాజ్ఞ లేక వచ్చునా? యనియె. మృకండుఁడు "అయితే యేమి చేయమనెదవు" అనియె. నేనా? నాకు యోచింప గాలములేదు. పోవలెనని యున్నాను అని మీనాంబ చెప్పెను. పోవచ్చునని కోపముతో చెప్పెను. మీనాంబ పోవుచుండెను. తామ్రమ వెనువెంట నడిచెను. మృకండుఁడు తామ్రమను బట్టుకొని నిన్ను చంపవలెనని యున్నాననియె. తామ్రమ నవ్వెను. చేయి పట్టువదలి ఎక్కడికి తీసికొని పోయెదవు అని యడిగె. చైతన్యులకు తావు దొరకదా యనియె. సరి! మీకు కష్టములు వచ్చిన నాకు దెలిపెదవా యని యడిగె, కానిమ్మనియె. పొండని చెప్పెను.

మీనాంబను వేలములో నెత్తుటకుఁ బంపిన రాజ పుత్రుఁడు ధర్మరాజు కడకేగెను. బైటనిలిచెను. తప్పు చేసిన బానిసను జూచినదే తటాలునలేచి, ఏమి? ఒంటరిగా వచ్చితివి అని యడిగె. లేదు ప్రభువా ! అతనితో నొక పిల్లయున్నది యనియె." ఈ మాట వినగనే ధర్మరాజు కోపము శాంతిపొందెను. సరి! నీవుపో. ఇకపై జాగ్రతగా

నుండుము. అందఱును బోంకు. నే నేకాంతముగా నుండ వలయు. రాజపుత్రు నిటకు రమ్మనుడు. ముసుగు వేసి కొని యొక చిన్నది వెనువెంటరాగా రాజపుత్రుఁడు నవ్వుచు వచ్చెను. నిత్యమును జేసెడి వందనాదుల జరిపెను. లేవుము. ఇది యంతయు నందరి యెదుట జేయవలసినది. ఇచట నేకాంతములో నీ గోడెందులకు? సరి! ఆ పిల్లను కొని వచ్చితివా? యని యడిగెను. రాజపుత్రుఁడు "అవును" అనియె. వేలములో అధికముగా అడిగిరా? యని రాజడిగెను. ఓ యబ్బా, నిండా అధికము. అధికము. అని రాజపుత్రుఁడు చెప్పెను. ప్రజలు మూర్ఖులైరి, నే నడుగు నపుడు పాడిగించిన వారెవరు. సరి! నీ వేమి యిచ్చితివి? ఏబది మొహరీలు దేవరా, ఇంతయేనా? సరి! యీ పిల్లను నేను జూడవలయును, అని లేచెను. అపుడు రాజ పుత్రుఁడు సందు దొరికినదని దేవరా! నా పని తీర్చివచ్చితిని. నే నికఁ బోయెద ననియె, రాజపుత్రా! నే నంతటి వాఁడను గాను. స్నేహితుండవగు నీవుచూడని పిల్ల యెందులకు? నీవు నిచ్చటనే యుండుమనియె. ఈ త్రాగుబోతున కేమి చెప్పనగునా యని దేవతలకు మ్రొక్కుకొనుచుండెను, ఆమె ముసుగును దీసిరి. మీనాంబకాదు. ఏమియిది? ఆ పిల్ల యింతలో నిటుల నెట్లు మాఱినది, చిన్నదానా? నీ మెడనున్న జవలదండ యేమైనది. నిన్నపంపిన యొద్దాకె

మెక్కడ యని యడిగెను. నాకు అలవడండ లేదు. ఒడ్డా ణెము నెవరు నియ్యలేదనియె. ధర్మరాజు రాజపుత్రు నుతిమి చూచెను. జరిగిన సంగతిని వాడుజెప్పెను. రాజు నకు మైకముతీరెను. ఓరీ నీచా! నీ యొద్ద రూకలు లేని యెడ అప్పుగా దీసికొనిరారాదా? రేపటికి నేనియ్యనా? ఏమిపని చేసితివి. ఎవరురా అక్కడ అనగనే పదువురు సేవకులు వచ్చిరి. ఈ పిల్లను నెట్టి బైటత్రోయుడు. వీనిని విడిచి కట్టికొట్టుడనియె. వారలు కొట్టసాగిరి. అపుడు వీని కూతలును దెబ్బ చప్పుడును దప్ప నా నగరి యందు వేరేమియు వినలేదు. అంతట సేవకులకడనుండి బెత్తము పెఱుకుకొని రాజు కొట్ట సాగెను. నేటితో మన పని తీఱినదని యతఁ డనుకొని దేవరా! నన్ను జంపుటవలనఁ బ్రయోజన మేమి? నేను జచ్చిన మీకు మీనాంబ వచ్చునా? యనియె. మీనాంబ యను శబ్దము రాగనే రాజు వికవిక నగుచు "మర్దనం గుణవర్ధనం" అను సామెత నిజమయ్యెను. పలవ కొడుకా ఎక్కడ దాచితివిరా యని యడిగెను, స్వామీ! నేను దాచలేదు. నాలుగువేల మొహరీలిచ్చి యామెను కొనుక్కొనిరి. రేపటికి వెదకి తీసిన యాసామిని తెలిపెదననియె. రాజు మంచిది నేటికి పో. లేనియెడ రేపు నీకు చావుతప్పదు. అని వదలెను. బ్రతికితినని రాజ పుత్రుఁ డింటికివచ్చెను.

తాామయు మీనాంబయు మృకండుని యింటి కేగు నపుడు వెంబడించెనని చెప్పియుంటిమి గదా. వీడు వారిని పట్టుటకు మునుపే వారలింటిలోనికి బోయి తలుపు మూసి కొనిరి. అతఁ డచటఁ గొంతసేపుండ నెవరో వీధికి బోయిరి. ఇది యెవరియిల్లని యడిగెను. మృకండు ప్రభువుగారి మందిరంబని చెప్పిరి. అటులనా సరియని తన విడిదికి వచ్చెను.

కాదంబరి తన యింటి యరుగుపై గూర్చుండి యుండెను. త్రోవలో రాజపుత్రుఁడు పోవుచుండెను. కాదంబరి లేచి యతనికి వందనంబు లాచరించెను. రాజపుత్రుఁడు నిదానించి చూచి నీవు రాత్రిదినము మీనాంబకై 1400 మొహరీ లడిగినవాఁడవు గదా యని యడిగెను. ఔనని కాదంబరి చెప్పెను. సరి! కడకు ఆమెనుకొని పోయిన వారెవరు? అని యడిగెను. ఆ సంగతి తమ కెందుకు అని యడుగ ఏమియులేదు. ధర్మరాజునకు వాని తల కావలయునట. దానికై యడిగెదను అని చెప్పెను. మృకండును తలనటికిన మీనాంబ తనది యగునని యెంచి యుండు వాఁడు గాన నితని కాసంగతి సంతోషమై యుండెను. "ఎవడై యుండును. చక్రవర్తిగారి ప్రియస్నేహితుఁడు మృకండుఁడు" అనియె. మృకండుడా చచ్చినాడని చెప్పరే. "సరి! యిపుడు చక్రవర్తి రాజ్యమును ధర్మ

రాజు వశంబుచేసి, సామంతుల రాజ్యంబునకు బోయి యున్నవాడు. కనుక నతని నెటులనైన వంచింప ధర్మ రాజునకు నధికారంబు కలదు. నేఁబోయివచ్చెదనని సెలవు పుచ్చుకొని ధర్మరాజు కడకేగెను. సంగతి నెఱింగించెను. ధర్మరాజు మృకండుఁడు తండ్రిగారి స్నేహితుండగుటచేత నేమియుఁ జేయరాదు” అని తన సేవకు నొకనింబిలిచి మృ కండునికడ కంపెను. మృకండుఁడు వాని నేమిసమాచార మని యడిగెను. వాఁడు ప్రభువా! మీరు రాత్రిదినము మీనాంబను 4000 మొహరీలకు గొంటిరట. ఆ పైకమును ధర్మరాజుగా రిచ్చెదననిరి. ఇదిగో పంపిరి చూడుము. ఆ మీనాంబను పంపుడు అని చెప్పెను. అందులకు మృకం డుఁడు మీనాంబను 4000 కు కొనినది వాస్తవమే. ఆమె యిటనుండనని చెప్పి యెచటికో పోయినది. ఆమెయుండు చోటు నాకుఁ దెలియదనెను. సేవకుఁడా సంగతి రాజున కెఱింగించెను. రాజు కోపంబు నందెను. మృకండు ప్రభువుపై నేదో యొక నేరంబుగల్పించి, యతనిని జెఱయం దుంచెను.

తామ్రయు మీనాంబయు జ్వాలాంబయింటికివచ్చి యంతయును జెప్పిరి. కులీనుఁడింటికివచ్చి వీరిటనుండునది ధర్మునకు దెలిసిన వీరికి ముప్పువచ్చును. వీరిటనుండి యెచటి కైనను బంపుట మేలనిచెప్పెను. ఇంతలో శ్రీధరుడటవచ్చి

సమాచారములవిని సంతసించి, యామెను దీవించి యట నుండుట యనర్థమిచ్చును. మీరు మాశిష్యులకడకు రండని తోడుకొనిపోయెను. మృకండున కతఁడు సమాచార మంది యిచ్చెను. అపుడు మృకండుఁడు శ్రీధరస్వామీ! వారిట నుండరాదు. ఎచటికైనం బోయి కొన్నిదినములుండు నటులఁ జేయుడని ప్రార్థించెను. నేను నట్లులే యెంచి యున్నానని చెప్పెను. వారట రెండు మూడుదినములు నిలుచునటులఁ దటస్థించెను. అపుడు మీనాంబ దీపములను జేసి యమ్మి జీవింప నెంచెను. రెండు దీపములుచేసి యొక పిల్లయొద్ద నిచ్చియమ్ముమనెను. ఆ దీపములను వెలకుదీసి కొని కాదంబరి, యిది మీనాంబ చేతిపనియని గ్రహించి, యీ దీపము లెచటఁ జేయబడుచున్నవని యడిగెను. ఆ పిల్ల గుఱుతుచెప్పెను. మఱునాఁడు ఆ యింటికి వచ్చి కని పెట్టెను. వారలతని దూషించి పోపొమ్మనిరి. రేపు “చంద్రా” యోడలోఁ బోయెదమనియు జెప్పిరి. కాదంబరి చేయునదిలేక యింటికివచ్చెను. మఱునాడు చంద్రా యోడపై మీనాంబ, తామ్రమ, జ్వాలాంబఁ కులీనుఁ డెవరికి తెలియక పయనమైరి. మీనాంబను దాఁగన్న సంగతిని కాదంబరి యెఱింగించినవాఁడు కాడు.

ఈయోడ పోయిన యొకవారమునకు చక్రవర్తి యూరుచేరెను. మృకండుని జూడననిచెప్పెను. మూడేండ్ల

వఱకు రాజధానికి రాఁగూడదని యుత్తరువిచ్చెను. ఈ సంగతి మొదట నెఱింగినవాఁడు రాజపుత్రుడు. రాజపుత్రుని జూచినదే మృకండుడు ఏమి అశుభంబు తెచ్చితి వనెను. రాజపుత్రుఁడు అశుభంబుగాదు. శుభమే. మూఁడేండ్లవఱకు మీరిట రాకూడదట యనియె. అయితే యువరాజునకు నాపై గోపమే? యని యడిగె. మీనాంబను దాచినవాఁడవు నీవని యతనికి నీపయి కంటుకలదు. రాజధానిని తెప్పున వదలుము అనెను. మృకండుఁడు అపును నేనుబోయెద. నేనిపుడొంటరిగా నుండవలయునా సరే. పో యనియె. వాఁడు కోపముతో లేచిపోయెను. నగరునకుపోవు మార్గములో కాదంబరి యిల్లు. అచటకేగి సంగతిఁ జెప్పెను. వాఁడియ్యేకపోయిన బోనిమ్ము నీకు బహుమానమిచ్చెద. వాఁడు నేడు సాయంత్రము ఇంటికి బోయెదననికదా చెప్పి యున్నవాఁడు. వానిముంగిటనే వానిని నఱుకుము. నేను 1400 మొహరీలిచ్చెదననియె. నీవు ఐదుగంటలకు రమ్మని చెప్పెను. ఆనాడొకగంటకు చంద్రా నొక దరితగిలి మునిగి పోయినదని కాదంబరి వినెను. చింతాక్రాంతుఁ డయ్యెను. అయిదు గంటలకు రాజపుత్రుడు వచ్చెను. వానికిఁ కాదంబరి 1400 మొహరీల నెంచియిచ్చి రేపటికి నింకయునిచ్చెద వేగంబ పనిజరుపుడని చెప్పిపంపి, యొకజాబువ్రాసి జేబున నుంచుకొని, పల్లవులయుడుపునుదొడుగుకొని యాఱుగంట లకు బయలు వెడలెను.

ఈ చంద్రాయోడ మునిగినసంగతి విన్నవాఁడు కాదంబరి యొక్కఁడే కాడు. శ్రీధరస్వామియు వినెను. బైట విచారించి తృప్తి నందెను. చెఱసాలకుబోవ నందలిబంటు మృకండు ప్రభు వెవరిని విడువవలదని చెప్పెనని చెప్పగా నన్ను జెప్పియుండడు అని తలుపు తెఱుచుకొని, లోనికిం బోవఁ జేత నొకక త్తిఁ బూనియుండెను. మేజమీద నొక జాబువ్రాసి పెట్టబడి యుండెను. అందు స్థిరపురంబుననుండు మీనాంబ చేతులందు నీయవలసినది యని వ్రాయబడి యుండెను.

అది గన్నతోడనే "ఒశ్చలమతి నుందువుగాక" యని శ్రీధరుండనియె. స్వామీ! నాకదియ కావలయును. దానికై వెదకెద ననియె, బిడ్డా! నీవిపుడేమి చేయుచుంటివని శ్రీధరుం డడిగెను. స్వామీ! అది మీరెఱుంగవలతురేని నీకత్తి పయిఁ బడుటకునుంటిని. ఇక నొక నిమిషము రాకుంటి రేని చచ్చియుందును అనియె. అంతట శ్రీధరుఁడు ఆ కత్తిని బెటికి మూలఁగొట్టెను. ఏమి పాపంబు చేయు నుంటివి. భగవంతుఁడామె ప్రాణమును దీసికొనిపోయెను. నీ ప్రాణమునుగూడ దీసికొన చూచెదవా ? యని యదలిం చెను. ఎవరిప్రాణములా? ఆ! ఏమి అటులనా? యని యడి చెను. ఆ సంగతిని జెప్పుటకే వచ్చితిని. వారెక్కిపోయిన యోడ మునిగి జచ్చిరట యని శ్రీధరుండు చెప్పెను. మృకం

డుఁడు త్రాగినవానివలె వెనుకకు ముందున కూగెను. పిదప మీరు చెప్పినదినిజమా? అటులైన నామెవెంబడి నేనేల పోరాదు. మీరు పొండు అని కత్తికై నడిచెను. శ్రీధరుడు పరువునబోయి యా కత్తిని ద్రొక్కుకొని నీకేమి పిచ్చియా? మీనాంబ చచ్చినదని నీకెట్లు నిశ్చయము? నీవే యేల చావ బూనితివి అని శ్రీధరుండడిగెను. మీనాంబ యటుండ నిమ్ము, మీనాంబకన్న మించిన నాగౌరవము పోయెనేయని దుఃఖం చెను. సంగతి యేమని యడిగెను. జరిగిన వృత్తాంతంబు వినిపించెను. ఇదియా నీ గౌరవము. ఈ గౌరవము నీకు ముక్తినిచ్చునా? చచ్చి మీనాంబతో గలసెదనంటివి. ఆత్మ ఘాతకుండవగు నీ మొగంబు నామెచూచునా? నామాట వినుము" అని శ్రీధరుండు చెప్పెను. అపుడు మృకండుఁడు చెప్పుడు విని యెద ననియె. మోక్షమార్గంబును సంగ్ర హంబుగ బోధించెను. అదివిని మృకండుడు స్వామీ! యీ బోధ నేనెఱిగినదియే. నమ్మియు నుంటిని. చైతన్యుడ ననిపించికొనుటకు జంకుచుంటిని. ఇపుడు చైతన్యుడ నైతి నేని మీనాంబ తనకై చైతన్యుడ నైనటుల ననుకొనును. ఇపుడామె చచ్చుటచే నాకట్టి భయంబు లేదు. ఇపుడేమి చేయుమనెదరు'' అని యడిగెను. నీకు మూడేండ్ల ప్రవా సము విధింపబడి యున్నది గదా. మనమిపుడింటికిబోదము రమ్ము. అటనుండి రాత్రి పదిగంటలకు నోడ అలంధరపురి

కేగుచున్నదని వింటిని. దానిలో బోవుదము అనెను. మంచిదని యిరువురు బయలుదేరిరి. రాత్రి యేడు గంట లయ్యెను. ఇరువురు వీరులు వీరివెంట వచ్చిరి. ప్రభువా! తలుపు తెఱువంబడియున్నది. లోనికిబొండు. మేము పోయెదమని వీరులు సెలవంది తిఱిగిరి.

అపుడు శ్రీధరస్వామి మృకండునింజూచి "బిడ్డా! ధనంబుగల యిల్లు ఇంతసేపటికి నెవ్వరునులేక తెఱువంబడి యుండుట యెచటను జూడలేదు" అని చెప్పెను. నా సేవ కుఁడు తెఱచియుంచుకొని, కూర్చొని యుండును—అని చెప్పుచు నేదియోతగిలి దిగువఁ బడెను. ఏమదియని శ్రీధరుఁ డడిగెను. ఎవడో త్రాగి పడియుండునట్లున్నదియని మృకండు చెప్పెను. అదో యొకదీపము వెలుగుచున్నది. ఆ దీపము నిటకు దేవచ్చును. నీవు ముందుపొమ్ము. నీకు త్రోవ చక్కగా దెలియును. వెనుక నీ నిద్రించువానికడకు వచ్చి చూతమని శ్రీధరుఁడు చెప్పెను. లోనికిఁబోయిరి. పని వాడును పనికత్తెయు నోట గుడ్డ గ్రుక్కబడి కట్టబడి యుం డిరి. వారికట్లనువిప్పి నోటిగుడ్డఁదీసిరి. "పనివాడు లేచి" ప్రభువా! బ్రతికి వచ్చితివా? ఎవరో నలువురు మొగంబు మార్చుకొని యిటకువచ్చి మిమ్ము జంపుదుమనియు, వారిని కాదంబరి పంపెననియు జెప్పి మమ్మీగతిం జేసిరి. కొంత సేపటికి కత్తితో నఱుకు చప్పుడువింటిని. మీఁఱని నా ప్రాణంబు లెగసినవి" అనెను.

శ్రీధరుఁడు "ఇటుల నీవు తప్పుటకు భగవంతుని యవ్యాజకరుణ" యనెను. ఔనని భగవంతు నెంతయుఁ బ్రార్థించి యచటికిఁ బోయి చూచిరి. వాఁడు కాదంబరిమై యుండెను. ప్రక్కన జాబుపడియుండెను. దానింజదువ మీనాంబతోడ జేరుటకై తానుబోవునట్లును మృకండుఁడు బ్రతికియుండి కష్టంబులందునట్లును వ్రాసియుండెను. వారా జాబును వాని మొగంబుననే చింపి వైచిరి. కావలసినంత ధనంబెత్తికొని భుజించి పది గంటలకు నోడ నెక్కిరి. సముద్రమధ్యమునఁ బోవునపుడు నీళ్ళకు కఱువయ్యెను. దూరంబున నొకయోడ పోవుట జూచిరి. దానిని సమీపించి నీళ్ళుకావలయునని యడిగిరి. అందఱిని లోనికిరమ్మని నాయకుఁడు పిలిచెను. అందఱును లోనికేగిరి. మృకండుడు అందు మీనాంబను జూచి శ్రీధరునకుఁజూపి "అది మీనాంబయా? ఆమెయాభాసమా" యనియె. శ్రీధరుఁడును మృకండుడును సమీపించిరి. వారినామెచూచి సంతోషాతిశయమున విస్మృతిజెందెను. ఈ యోడ మునిగినటుల జెప్పినది కల్లయని తెలిసికొనిరి. ఒకరికథ నొకరు చెప్పుకొనిరి. మఱునాడు తెల్లవాఱి మృకండునకును మీనాంబకును వివాహ మా యోడయందే సంభ్రమముగా జరిగినది యని సౌందర్యవల్లి కథచెప్పి ముగించెను. అందఱు నిట్టి కథ నెందైన వింటిమేయని వేనోళ్ల బొడగిరి. ఓడ శాంత

పురి రేవునకువచ్చెను. వారచటదిగి యరణ్యమార్గంబుగాఁ బోవుచుండ, తాము ముందు సురంగపువాకిలి యుంచినట్టి స్థలంబున కేగిచూడ, నచటఁ బలువిధములైన పూలచెట్లు గల తోటయై యుండెను. అపుడు సౌందర్యవల్లి సందే హించి, తండ్రీ! యిదియే మనమింతకుమునుపు వండివార్చి తినినచోటు. ఇచట మునుపు భయంకరంబగు నరణ్యం బుండెను. అది మనుష్యసంచారంబు లేనిదై యుండె. ఇపుడు చూచిన నిచటఁ బెద్ద పట్టణంబువలె నున్నదే. ఇందుల కేమి కారణంబో యని చెప్పి తనలో నాలోచించుకొను చుండెను. అపుడు సౌందర్యవల్లికి నొక యోచనపుట్టి యిట్లనెను. తండ్రీ! యేదియు మునువెనుకలు కనియే చేయవలయును. ఆలోచింపక యొక కార్యంబును జేయు వార లాపత్తునందగలరు. కనుక మీకొక యుపాయంబు సెప్పెద సావధానంబుగ వినుడు. లోనిమర్మంబు లరయక యుద్ధంబునకుఁ గడంగిన కలహంబునకు హేతువగునే కాని మఱియెట్టి ప్రయోజనంబు నందము. ఎవరైనను శత్రు మర్మంబుల నెఱింగి యుద్ధంబుచేసిన యెడఁ గలహంబులు లేక జయంబు నందగలము. అదియునుంగాక రాజులు మొదట తెలివిని నిలుకడఁజేసి తనబలంబు నెదిరిబలంబును, కాలబల మును ఈ మూటినెఱింగి, యీ మూటియందు నెదిరి బలముతగ్గి, తనబలము హెచ్చి, కాలము జయకాలమై యుం

డినయెడల, మనల నెదిరించువారు పదిలక్షలైనను కొంత సేపులో వారిని జయింపనగును. కనుక నామాట మేఱకు నడిచితిరేని మనకు నెట్టియపాయము నుండదు. పగవారిని సులభంబుగా జయింపనగును. ఈ దేశము మనకులోఁ బడును. ఇందు మనమే యేకచ్ఛత్రాధిపత్యమును వహింప వచ్చును అనియె.

ఆ మాటలను వినిన వ్రతశీలుఁడును అతనిపుత్రులును సంతసించి, అమ్మా! నాకులదీపమా!. నీవు మాకులదైవమై యుండుకతంబున నీచే మా ప్రాణంబులు మిగిలి తిఱుగు లాడెదము. ఇపుడును మా ప్రాణములఁ గాచుటకు జీవ రక్షక సంజీవికి సమానంబగు నీ గొప్పసాయమే మాకవ శ్యము. ఆ దినంబున నీవు చెప్పినటుల మేము నడువక యుంటిమేని నిన్నిదినంబులు ప్రాణంబులతో నుంటిమా ? ఇపుడును నీవు కలంగని చెప్పిన ధైర్యవచనంబులచే నింత దూరము ప్రయత్నంబున వచ్చితిమి. కనుక నిపుడు నీ వెటులఁ జెప్పెదవో యటులనే మేము సమ్మతించి చేయగల మని చెప్పెను.

సౌందర్యవల్లి మేలుమేలని సమ్మతినొంది యిటులఁ జెప్పెను. "తండ్రీ! సోదరులారా! శత్రువులసామర్థ్యమును, జాగ్రతయు నెంతలో నున్నదని నేఁబోయి మొదట నెఱింగి వచ్చెదను. నేను వచ్చునంతవఱకు మీరలు నేను జూపునట్టి

మనుజసంచారంబు లేని కొండ గుహయందు దాగియుండుము" అని చెప్పెను.

ఆ మాటలువినిన వ్రతశీలుండును అతని పుత్రులును దిగులంది యేటిలోఁబడనిచ్ఛయించు తల్లి నెడఁబాయజాలని బిడ్డలవలె దుఃఖించి, "అమ్మా! మా యొడలికి ప్రాణమై యుండి యాదరించి రక్షించిన జీవరక్షకివగు నీ వొంటరిగాఁ బోయిన భారతయుద్ధంబున పద్మవ్యూహంబునందుఁ జిక్కికొన్న యభిమన్యుని దుర్యోధనాదులు ఒకటిగాఁజేరి చంపి నట్టుల నాలుగైదులక్షలకు నధికంబగు సేనానాయకులముందు నీవేగితి వేని వారలు నిన్ను సముద్రమునందలి సుడియందుఁ దగులుకొన్న నావచందమున మథించి యస్త్రవర్షంబులఁ గురియించిన దిక్కులేని పరదేశివలె ప్రాణంబుదొలఁగి మరణమందిన మేమెటుల మనంబు సహించి యుందుము. అమ్మా! నీతోడ మేమును వచ్చెద మనిరి.

ఆ పలుకులను వినిన సౌందర్యవల్లి కలకలనగి, "తండ్రీ! నేను యుద్ధంబొనరించు సమయంబున మీరును సాహాయ్యులై రావలయును. ఇపుడు నేను శత్రువుల మర్మంబు లరసివచ్చుటకై పోవు సమయంబున మీరలు వచ్చుట యనఁగా నచ్చెరువుగదా. నేనటుల మొదటనే యుద్ధంబునకుఁ బోవను. ఇదో యీ విల్లును పొదియును మీరే యుంచుకొనుఁడు" అని వారిచేత నప్పగించెను.

వ్రతశీలుండు నతనిపుత్రు లదిగని యాశ్చర్యమంది, అమ్మా! యాయుధంబులు లేక పరవారికడకుఁబోయిన నపాయంబు లేక వచ్చుట యన నెవరైనను నమ్మఁదగినదియే" యని చెప్పిరి. సౌందర్యవల్లి మందహాసంబుచేసి "తండ్రీ! చేతవిల్లుండినయెడల శత్రువులు నిదానించుకొని జగడంబునకు వత్తురు. ఉత్తచేతులతోఁ బోయిన నెవరో బాటసారులని దలచికొని మరల నిదానింపక యుందురు. అపుడు వారి యందొకరై మగవేషంబుతోఁబోయి వారికడ బహువిధంబులయిన తంత్రవాక్యంబులం జెప్పికొని వారిబలాబలంబు లెంతపాటివని యెఱింగి సమయోచితముగా శత్రువులను జయించు మార్గంబు నరసికొని మీయొద్దకు వచ్చి మిమ్ములను సేనాధిపతులుగా జేసికొని పిలుచుకొని పగవారి కడకుబోయి యుద్ధంబుసేసి జయమంది మనదేశంబును మనమే గైకొనవగునని చెప్పెను.

ఆ మాటలను వినిన యామె తండ్రియును సంతసమంది "ఔనౌను. ఇదియు నొక సామర్థ్యమగు నాలోచనయే" యని మదినిడికొని "అమ్మా! అటులనైన మేమును నీవలెనే విల్లును పొదలను ఒక కొండగుహలో నుంచి బాటసారులవలెవచ్చి శత్రువులస్థితిగతుల నెఱింగి వచ్చెదమనిరి. సౌందర్యవల్లి యచ్చెరువంది నగి, "తండ్రీ! మీరు చెప్పునది యెటులున్నదన పులుల మొత్తంబులను జంపుటకుఁ బోవునట్టి

వేటకానికి సహాయముగా నూరువారుపోయి యచట కేకలు వేయ నిద్రించుపులులన్నియు మేలుకని యూరివారిని జంపు టయేకాక, వేటకానినిం జంపినకథకు సరిపోవునట్లుండును. అదెట్లులని యడిగితి రేని నేను బిడ్డనై యున్నకాలమున ఆ రాజులు నన్ను జూచియెఱుగరు. నేనోయాడుదానను. వేషమో మగవేషము. నన్ను వారలు శత్రువనియు బరి కింపరు.

కనుక నేను మెలకువతో వారికడకేగి నోటబెల్లము అంగిట విషంబుగానుండి వారితో చెలిమిచేసి సమయంబు సూచికొనియుండి మీయొద్దకువచ్చి మిమ్ముఁ దోడుగా బిలుచుకొనిపోయి శత్రువులజయించి, మన దేశంబును గైకొందము. మీరలు వచ్చుటయన నెట్టివేషంబు వేసికొని వచ్చినను వారు మిమ్ముల ననేకమారులు చూచినవారగుటచేత మీ యానవాలు వారికందఱికిఁ జక్కగాఁ దెలియును. అపుడు వారు మిమ్ములఁ జేపట్టుగాబట్టి వెతలంబెట్టిన "తానాడ కున్నను తన కండయాడునను పితృభ్రాతృవాంఛచే" నేనును బరితపించి అయ్యో! నాయనా! అన్నలారా యని యేడ్చిన మీ గతియేమి? నాగతియేమి ? అధోగతియే.

ఉ. చందనవృక్షముం బెరని • సాగు సుగంధయుతంబుగాఁ దరుల్
క్రందుగ వాని కగ్గి తగు • లక్కమటి చందన మేడ నుండుఁ దా
నందము వీడి కొలుటయె యౌఁ • దరువు ల్మఱి కూడమాడి పో
మందుల నుత్తముల్ గలియ మన్నన • యద్దిరయె భూతలంబునన్.

అనునటుల మీవలన నాకు నపాయంబువచ్చును గదా. మిమ్ముల విడనాడి నేను మాత్రము తప్పించుకొని వచ్చుటెట్లు? మేలుమేలు మీరు బుద్ధిగలవారని నేనుజెప్పను. పండితులవలె మాటలాడెదరు. మీమాట లింకఁజాలించి నేనుజూపునట్టి కొండగుహయందు దాగియుండుడు. నేనీ నగరవాసినివలెఁ బురుషవేషంబు ధరించి, పగవారికడకేగి మనంబునఁ బసియు పెదవులఁ జెలిమియుఁజూపుచు స్నేహించి, వేటకానికిఁ దాబట్టు పక్షిపై గన్నుండురీతిని పగవారిని గెలుచు సమయంబును నిరీక్షించుకొని మిమ్ముల బిలుచుకొని పోయెదను" అనియె.

ఆ మాటలను వినిన వ్రతశీలుండు నతనికుమారులు నొక విధంబున సన్నుతించి "తల్లీ! మాపై నీవు కోపింపకుము. నీవో చిన్నబిడ్డవై యున్నావేయని మా మనంబులు తాళక నీకు దోడుగా వచ్చుచున్నామని చెప్పితిమి. మన్నింపవలయునని" వేడుకొనిరి. సౌందర్యవల్లి మన ముప్పొంగి నా విషయంబున మీరు ధైర్యంబుతోనుండుడని చెప్పి వారలంబిలుచుకొనిపోయి మనుజసంచారంబులేని యరణ్యంబునుజూచి యటనుండు నొక కొండగుహలో వారినందరిని డాగియుండునటులఁజెప్పి తాను మాత్రమొంటరిగా నా పురంబును బ్రవేశించి, ఒక కోమటి యింటికేగి నాలుగు రూకలిచ్చి "అయ్యా! నాకు మిగుల నాకలిగ నున్నది. అన్నము

పెట్టింపుడు'' అని యడిగెను. ఆ కోమటి యీామెను పడు చని గ్రహింపక పిల్లడని యెంచి "అప్పా! నిన్నుజూచిన యందగాఁడవై యున్నావు. నేనింట లేని సమయంబున నా భార్యయు నాకుమార్తెయు నీపైమరులు గొనిరేని నవ మానంబు నాపత్తును సంభవించునుగదా'' యనెను.

సౌందర్యవల్లి కోపించినదానివలె నటించి "అయ్యా! సెట్టిగారూ! మీరు కన్నబిడ్డలందగాండ్రైయుండిన వెలినెట్టు దురే? మీారలు నన్ను కుమారునివలె భావించి, యన్నంబు పెట్టిన మిమ్ము నేను దండ్రివలెను, మీా భార్యను దల్లిపోలి కను, మీాకుమార్తెలను నా చెల్లెండ్రమాదిరిని భావించి యుండెద. అదియునుగాక తా మన్నము దినునపుడే నేను నన్నంబు భుజించెద. మీరు బయటికి పోవునపుడు మీాతోడ వచ్చెద. ఇటులనుండినవ్యభిచారంబునకు వీ లెక్కడిది!'' యని యనేక విధంబులగు తంత్రపుఁ బలుకులంజెప్ప నాకో మటి సంతసించి "అన్నా! నీవెవరుకన్న బిడ్డవో? ఇంత యందముగనుండియు నీకు వ్యభిచారంబుపై గొంచెమైన నా సక్తిలేక యుండుట యద్భుతంబై యున్నది. నాకు నిరువురు కుమార్తెలు నొక్క కుమారుండు నున్నవారు. ఇపుడు నీవు నా బిడ్డవలె వచ్చియుండెదనని చెప్పటచేత నా కిరువురు పుత్రులైరని భావించియుండెద''నని చెప్పెను. తనతోడ నింటికివెంట బెట్టుకొనిపోయి యన్నంబుపెట్టి తానును

భుజించి యానందపరవశుండై సెట్టియుండె.

ఆ సెట్టి నవరత్నవర్తకుఁడు. ప్రతిదినంబును నగరికిం బోయి రాజునకు రత్నంబులంజూపి వర్తకంబుసేసికొని వచ్చు వాడుకయుండుటచే నిత్యమును పురుషవేషంబు ధరించి యుండు సౌందర్యవల్లిని వెంటబెట్టుకొని నగరికి పోవుచుం డెను. రాజులు సౌందర్యవల్లిని కోమటి చిన్నవాఁడని భావించియుండిరేకాని వ్రతశీలుని పుత్రియని యెఱింగినవారు కారు. సౌందర్యవల్లి తనపనిపై కన్నుగలదికావున నాపురంబు నంతయుఁ జుట్టిచుట్టి తిరిగి మునుపటివలెఁగాక చిత్రవిచిత్రితం బులై యనేక కోటలను గలిగి యుండుటంజూచి యచ్చెరు వంది వైశ్యున కిట్టులనియె. "తండ్రీ! యీ దేశంబు పేరెయ్యది. ఇచట నేబదియేడు కోటలుండుటకుఁ గార ణంబేమి?" అందులకా సెట్టి "నాయనా! నేఁజెప్పునది సావ ధానంబుగా వినుము. ఇది శాంతపురియను పేరుగలది. ఈ దేశంబును పూర్వము వ్రతశీలుండను రాజు పరిపాలించు చుండెను. అతనికిని చక్రవర్తికిని నెందులకో మనస్తాపం బులు సంభవించెను. చక్రవర్తి యుత్తరువు చొప్పున నీ రాజులందఱు నొకటిగాఁగూడి దండెత్తి వచ్చిరి. అపుడా వ్రతశీలుఁడు తనబంధుమిత్రులతోఁ గోటయందుండిన సారంగ మునదూరి యెచటికో పోయెను. రాజులందఱును వారిని నలుప్రక్కల వెదకించిరి. వారి పోకడ దెలియక మిన్న

కున్న వారు? అయిన నిపుడు వారు దొరకినయెడల వారి పని భరతంబు పట్టింతురు. చక్రవర్తి యీ రాజ్యమును వారికందఱికిఁ బొత్తులలో నిచ్చియుండుటచే నందఱు నిచటఁ దమకని యొకకోటఁ గట్టించుకొని యున్నవారు'' అనియె.

ఆమాటలు సౌందర్యవల్లికిఁ గోపంబుఁ బుట్టించునదిగ నుండినను నేమిచేయును? అనువుగానిచోట నధికులమన నగునే? తలయూచి యూఱకుండెను. మఱునాడు సెట్టితోడ రాజులభవనంబులకేగి యెవ్విధంబున నున్నదియు నెఱింగెను. తన తండ్రిచే ముందుకట్టఁబడిన ప్రాసాదంబున కేగిచూడ నందుఁదమమంత్రులును సేనాసముదాయంబునుండెను. ఆమె మనస్సు పరితపించెను. ఏమియును జెప్పక కోటలోనికేగి యందలి సురంగము కడకుబోయి నిలిచి యిది యెచటికిఁ బోవునో చూచివత్తమని సెట్టిని బిలిచెను. సెట్టి సమ్మతించి వచ్చెను. సురంగము మునుపటివిధంబున లేదు. అందుఁ బలాహారంబులనమ్ము నంగళ్ళును రాకపోకలు చేయ వీలైన రాజబాటయును చీకటియనిపించక మిఱుమిట్లు గొలుపు దీపపంక్తియు గలిగియుండెను. అదిగని సౌందర్యవల్లి యత్యాశ్చర్యమంది, సురంగము కడపటఁ జూడ నద్భుతం బగు నొక పూఁదోట యుండెను. అదియంతయుఁగని సౌందర్యవల్లి తనమనంబున "ఔరౌరా! మనసెట్టిపనికి సాహసించితిమి. ఇంత బందోబస్తుగలరాజ్యంబును ముట్ట

డించుట యెట్లు? ఇరువదియిద్దరిచే నెటులగును. దొంగ తనంబుగ మనయన్నలను దండ్రిని బిలుచుకొని వత్తమన్న నిన్నికావళ్ళను గడిచివచ్చుట యెట్లు? వచ్చితిపో! వారిని గుఱుతించకుందురా? వారల నూఱక విడతురా? ఏమి చేయ నగును" అని వ్యసనంబునందుచు నావైశ్యునితోడ నాశ్రంగా రవనంబును జుట్టి చూచుచుండెను.

పురుషవేషధారియగు సౌందర్యవల్లి భావంబును దెలి యని కోమటి "నాయనా! నీవేల యొకవిధంబుగనున్నావు. నీ మనసున నేదో సంకటం బుండునటులఁ దోచెడిని. నీ మనంబునంగల కొఱతల నెఱింగింపు మనియె. అందులకు సౌందర్యవల్లి తండ్రీ! మఱేమియు లేదు. త్రోవనడచిన యాయాస మొకటి. దాన మొగము వాడినది" యనెను. వైశ్యుఁడదివినినవ్వి "బిడ్డా! నీ వెపుడు నన్ను దండ్రీయని పిలచితివో యపుడే నిన్ను నేను బిడ్డవని భావించియున్నాను. నేనుండునంతవఱకు నీకు నెట్టి భయంబును లేదు. తక్కువయు లేదు" అనుచు నచటనమ్ముచుండిన తినుబండములను దీసి యిచ్చి భుజింపఁజేసెను. సౌందర్యవల్లి యతని యౌదార్య మున కాత్మమెచ్చుచు సెట్టియుఁదానును ఫలాహార భక్షణం బులఁ సేదదేరిరి. అటనుండి మఱలి శాంతపురంబును జేరిరి.

అంత నొకనాడు వైశ్యుడును సౌందర్యవల్లియు వర్త కంబునకై రాజధానికేగిరి. వర్తకుఁడు చక్రవర్తికొక

రత్నహారంబిచ్చి "సార్వభౌమా! దేవరవారికి నిది యొప్పింపవలయునని బహు దినంబులుగ జ్ఞప్తి యుండినది. నేటికది దేవరవారి యనుగ్రహంబున సఫలంబయినది" యని వినయంబు దోపఁ జెప్పెను. చక్రవర్తి సంతసించి పదివేలవరహాల నా సెట్టికినొసంగి "సెట్టీ! యిన్నిదినంబులు రాకుండుటకు గారణంబేమి? మీా రెచటికిఁ బోయియుంటిరి. ఈ చిన్నవాఁడెవఁడు" అని విచారించెను. "మహాప్రభో! నే ననేక దేశంబుల కేగితిని. అందు వర్తకంబులచేఁ దీటినది కాదు. నే నూరికివచ్చి యొక నెలమాత్రమే యైనది. వీఁడు నా కుమారుఁడు. వీని కిన్ని దినంబులుగా వర్తకంబున నభ్యాసంబు లేదు. వీడెచటను బోవడు. ఎన్నిదినములుండినను నా వెనుక వీడు వర్తకంబుసేసి బ్రతుకవలయుంగదా. అందులకై యిపుడు వెనువెంట ద్రిప్పి వర్తకంబును నేర్పుచున్నవాఁడను" అని సెట్టి తంత్రంబుగఁజెప్పి తప్పించుకొనెను. చక్రవర్తికడ సెలవంది నగరును వదలి రాజవీధికి వచ్చెను. అచట నైదుదినములుండి మఱిపోవచ్చునని సెట్టికి దోచెను. ఇరువురు నొక పూటకూలియింట బసచేసిరి. నాటిపాయంత్రము సౌందర్యవల్లి పురుషవేషంబుతో నొంటరిగా నా పట్టణమందలి శృంగారవనంబున సంచరించుచుండెను.

అపుడు చక్రవర్తి కుమార్తె తన చెలులతోఁగూడి పూఁదోటకు వచ్చి పూలగోయుచు నాడుచుఁ బాడుచుండిరి.

సౌందర్యవల్లి వారినిఁ జూచినది కాదు. హఠాత్తునఁబోయి వారియెదుట నిలువంబడి నిశ్చేష్టిత యయ్యె. చక్రవర్తి కూతురిట్టి సౌందర్యవంతు నెన్నఁడును గననందున లేచినిలిచి పురుషవేషధారిణియగు సౌందర్యవల్లి చేతులంబట్టికొని "ఆ! సుందరా! నీ తండ్రియగు నవరత్నవర్తకుఁడు నా తండ్రికి ననుంగు జెలికాడు. మీరు నాకేల చెలికాఁడై యుండ రాదు? నన్నుఁ బరిణయం బాడుము" అనెను. సౌందర్య వల్లి కొంతసేపటికిఁ దెలివంది "ఔరా! యిదేమి కష్టము. దౌర్భాగ్యదేవత మనవెంట నంటి నట్లున్నది. ఇట్టి మన శ్చంచలంబున నిదేమి పీకులాట" యని యెంచి "చిన్న దానా! వియ్యము నెయ్యము కయ్యము సరి వారికిఁ గాక యితరులయందు వన్నెగాంచదు. నీవో సార్వభౌముని కూతురవు. నేనో నీ తండ్రి నంటి బ్రతుకువాని పుత్రుం డను. మన కిరువురికిఁ బెండ్లియన వినువారు నగరా? మగ వారికిఁ గఱవే. నీకుఁ దగిన సార్వభౌముని పుత్రుని బెండ్లి యాడక నిరుపేదను బెండ్లియాడఁ దలంచెదవు. ఈ పిచ్చి యోచనను వదలి యంతఃపురంబునకుఁ బొమ్ము. ఎవరైనఁ జూచిన నీ కపఖ్యాతియు నాకుఁ దల తెఱుగుటయుఁ గలు గును. పోపొమ్ము" అని చేతుల లాగుకొని కసరు కొనెను.

చక్రవర్తి కుమార్తెకు ముక్కుపైఁ గోపంబువచ్చెను.

వాని సౌందర్యంబును గని యడంచికొని "ఔరౌరా! యెట్టి మాట లంటివి. వలపుతో నన్ను బెండ్లియాడుదు వని యడుగుకొన నిటులఁ జులకనగా మాటలాడితివి—నిన్నేమి చేయించెదనో చూడుము. నా తండ్రితో నీవు నన్ను బరిహాసించినటుల నిందమోపి నీ తలను దీయించెదను. నీ వెట కేగినను తలారులు నిన్ను విడువనోపరు.'' అని శపథంబు చేసెను. ఆ మాటలను విని సౌందర్యవల్లి యదరి పడి బావి త్రవ్విన భూతము వెలియైనట్లు ఈ పీడ మన కెక్కడనుండి వచ్చెను. దీని మాటల కడ్డంబు సెప్పితిమేని మన మెత్తుకొన్న కార్యంబులకు హాని కలుగును. మనల నమ్మియుండు తండ్రియు నన్నదమ్ములును బోవు గతియేమి? అని కొంత యోచించి, ''ప్రాణేశ్వరీ! చల్లకు వచ్చి ముంత దాపనేల? నిన్ను గని నీపై మరులుగొని నీకడకు వచ్చితిని. కడకు నీ స్థితి నెఱింగితిని. ఇది యడియాసయని వదలి యా మాట నంటినె గాని వేఱుగాదు. నీవే యిష్టపడి నీ తండ్రి కెఱింగించిన నతండు సమ్మతంబు నెందును. కావున నీయభీష్టం బెఱింగింపు''మని యుపాయంబునఁ జెప్పెను. సౌందర్యవల్లి భావం బెఱుంగక యా చక్రవర్తి కుమార్తె సౌందర్యవల్లిం జూచుచు మందహాసంబుతో ''నాయకా! నీపై నధికంబుగా మరులుగొంటిని. వెనుకఁ బెండ్లి చేసి కొందము. గాంధర్వవిధి నిప్పుడ యనుగ్రహింపు'' మని

వేడెను. సౌందర్యవల్లి "నాయకా! యీ గాంధర్వ వివాహము సమానజాతులగు క్షత్రియవధూవరుల కగుంగాని క్షత్రియ స్త్రీవగు నీకును వైశ్యకుమారుండ నగు నాకును న్యాయంబును జనసమ్మతంబును గాదు. నీ తండ్రి కెఱింగించి రాజోత్తముల నందఱిని రప్పించి వారి యెదుట సతీపతులుగా మనకు వివాహంబు జరిగెనేని బాధ యేమియు లేదు. లేని యెడల గ్రంతల నాడికొందురు. ఎవరితోనైనను మేము సతీపతుల మన మేమెఱగము. మీ రెఱుగరు అను మాటల జెప్పికొందురు.

దరువు.

పల్లవి.

పండనోర్చిననీవు-వార్పనార్పగనోరువక అచ్చనేయనేలా.

అనుపల్లవి.

అండనుండెడివార-లపహాసింపకయుండ
దండియోచనలను- దగి కొనఁగా లేక పండ॥

చరణము.

వలపులుండినవేమి వడినేగునేబుద్ధి
వగలాడి! బిత్తరీ! వాల్గంటి! మరుచిల్క!
యిలనుండుజనములు నృపతుకెఱుంగఁగ
నిప్పుడె పెండ్లియాడి, యెనయుదమానందమానే పండ॥

అని పలువిధంబుల వలపు పలుకులం జెప్పి "నాముద్దుగుమ్మా! నా మాట వినుము. ఇపుడు నీ తండ్రికడ కేగి

నీ యభీష్టంబు నెఱింగింపుము. చక్రవర్తి నా తండ్రిని రప్పించి శుభముహూర్తంబు నిశ్చయించి మన యిరువురకుఁ బెండ్లి చేయును. నేనును జక్రవర్తికి నల్లుండ నను నానందంబున నే పనిం జేయక నీ యొద్దనేయుండి ముసలి వారగు నంతవఱకు గేళీవిలాసంబుల నుండనగు నని చెప్పెను. ఆమె యది నిజమే యనుకొని "ప్రాణపతీ! మీరును మీ తండ్రియు నగరునందే వచ్చి వసింపుఁడు. నా యభీష్టంబును నా తల్లి కెఱుంగ జెప్పి మా తండ్రిని సమ్మతింప జేసి మిమ్ము లనే పరిణయం బాడెద" నని యె. అట్టులన కానిమ్మని సౌందర్యవల్లి బదులు చెప్పెను. వారివారి యిక్కలకు వారు వారేగిరి.

సౌందర్యవల్లి యింటికి వచ్చి జరిగిన వర్తమాన మంతయు నొకటివిడువక పూస గ్రుచ్చినటులఁ జెప్పి తండ్రీ! నన్నెవఁడని చక్రవర్తి యడిగెనేని నీ పుత్రుఁడ ననియే సిద్ధాంత పఱుపుము. అతండిచ్చు బహుమానంబులఁ దీసి కొని నీ పురంబునకుఁ బొమ్ము అనియె. వైశ్యుఁడు సమ్మతించెను. అంతట నా కోమటి సౌందర్యవల్లిని తోడుకొని చక్రవర్తి యింటికివచ్చెను. చక్రవర్తి యతనింజూచి సెట్టీ! తమ రాకకు గతమేమి యని యడిగెను. వైశ్యుడు "సార్వభౌమా! నే నీయూర మూడుదినము లుందును. పిదప నావ యెక్కి ద్వీపాంతరములకు వర్తకంబు చేయఁ బోయెద. తిఱుగుటకు

నైదారు సంవత్సరము లగును. తమ కేదైనఁ గావలసిన యెడల నిపుడే తీసికొనుడు" అని చెప్పెను. చక్రవర్తి "సరి! నీ యొద్దనుండు రత్నంబులను దీసికొని రమ్ము. దానింజూచి కావలసిన వెత్తుకొనియెద. వేగంబ రమ్మని యాన తిచ్చెను.

అపుడు చక్రవర్తికుమార్తె తన తల్లిం జూచి 'అమ్మా! అల్లదో చూచితిరా? ఒక యౌవనవంతుఁడు రూప సౌందర్యంబుల మించి కూర్చొని యున్నవాఁడు. అత నిని నాకు బెండ్లి చేయవలయు. లేని యెడ నాకుఁ బెండ్లి యక్కఱలేదు." అనెను. మహారాణియు నా పురుష వేషధారియగు సౌందర్యవల్లినిం జూచి ప్రియంబు గలదియై "ఆహా! యిట్టి రూపరేఖా విలాసంబులంగలవాని నల్లునిగా నంతఃపురంబున నుంచుకొనుటయే శ్రేష్ఠము. క్షత్రియకులం బున బుట్టినవార లింతటి సౌందర్యంబును గలిగియుండరు. ఇతఁడు వైశ్యుఁడైనను బహుశ్శృంగారి. ఇతనినే మన బిడ్డకు వివాహంబు సేయవలయును" అని యెంచి యొక దాదినిం బిలిచి కొలువుకూటంబునకంపి చక్రవర్తిని బిలి పించెను. చక్రవర్తి కొలువు చాలించి యంతఃపురంబున కేగెను. ఆమె చక్రవర్తికి తన కూతురికోరిక నెఱింగించెను. రాజు కొంతసేపు యోచించి అందుల కేమిలే. అట్లులనఁ జేసెదమని చెప్పి వర్తకుని సౌందర్యవల్లిని నేకాంతంబునకు

గొనిపోయి మంతనంబున నిట్టులనియె. ''అయ్యా! సెట్టిగారూ మీ కుమారునకును నా కుమార్తెకును పెండ్లి చేయించి కనులపండువుగాఁ జూడవలయునని యాసయున్నది.'' అనెను. వర్తకుఁడు మదినుప్పొంగి "సార్వభౌమా! తమ యిష్టమునకు నడ్డిచెప్పగలనా!'' యనెను.

అపుడు సౌందర్యవల్లి ''రాజరాజేంద్రా! నేనును తమ యిచ్ఛమేరకు సమ్మతించెద. అయినను మా వివాహము రహస్యంబుగ నుండ రాదు. సకలరాజసమక్షంబున జరుగ వలయు. కనుక దేవలోకంబును ధిక్కరించు శాంతపురి నందవనంబున నైదుమైళ్ళదూరంబువఱకు నొక పెద్దపందిలిని జోడించి, సకలదేశాధీశ్వరుల రప్పించి వారియెదుట వివాహంబు జరిపించిన నాకు సమ్మతంబని చెప్పెను. చక్రవర్తి యట్టులన కానిమ్మని శాంతపురనందవనంబునఁ బందిలి వేయించి, వివాహ ప్రయత్నంబులఁ జేయించెను.

దేశాధీశ్వరులు వివాహపత్రికనుజూచి కోపమంది ''మనచక్రవర్తి క్షత్రియుండయినను తనకన్న తక్కువవాడగు వైశ్యునకు పిల్లనిచ్చెదనని సమ్మతించినను ఆ వైశ్యధూర్తుఁడు నిరాకరింపక శ్రేష్ఠకులోత్పన్నను కోరనగునే? వాని గుండె దిట వేమన వచ్చును''? అని యనేక విధంబుల గుసగుసలాడ జొచ్చిరి. రాజులు సభకూడుట మఱుదినమైనందున అపగలంతయు నీమాటలయందే యుండిరి. మఱు

దినము తెల్లవాఱలేచి యందఱును సభఁగూడిరి. ఆ రాజు లందు నొకఁడు చక్రవర్తి చెల్లెలికుమారుఁడు. అతఁడు మిగుల దుఃఖంబునంది సభకువచ్చెను.

అపుడు రాజులందఱును చక్రవర్తి చెల్లెలికొడుకగు కాందీపునిం జూచి "అయ్యా! తాము క్షత్రియులో లేక వైశ్యులో" యని పరిహసించిరి. ఆమాటలు వినిన కాందీపుని కనులవెంబడి జలంబులు రాలఁ దలవాంచి యిట్టు లనియె. "రాజులారా! మేము క్షత్రియులమే. అయినను నా మేనమామ చేయు అన్యాయంబునఁగాని తక్కువ జాతిగాఁ బరిగణించితిరి. అతనికుమార్తెను నాకొసంగు నటులఁ బలుతడవలు చెప్పియుండెను. అది మీరెఱింగిన విషయమే. అదేమి యన్యాయమో కాని యిపుడు మన రాజ్యంబుననుండు నవరత్నవర్తకునకు నిచ్చునటుల ముహూర్తంబు నిశ్చయించి యున్నవారు. మీరును నావలె క్షత్రియులు. రథగజతురగ పదాతులం గలవారలు. మునుపు వ్రతశీలునిపై నందఱ మొక్కటిగా దండెత్తి వచ్చినందున వాఁడు భయంబు నొంది పోయిన గుఱుతుగానక మఱగి పోయెను. మీరు నాకు నెత్తిన చెలికాండ్రు. మీర లందఱు నాకు సహాయులైయుండి యా పిల్ల నెటులనైనను నిచ్చునటులఁ బ్రయత్నంబు చేయుడు" అని వేడికొనెను. సభనున్న వారందఱును సంతసించి "కాందీపా! నీ వెందు

లకు భయంబు నొందకుము. మే మందఱమును మీ మామకు ననేక విధంబుల నీతులను బోధించి మా వలన నైనంతమట్టునకు సామంబునఁ బ్రయత్న పడెదము. అతం డందుల కియ్యకొనని పక్షమున ఆ వైశ్యునకు బుద్ధి గఱపె దము. వాఁడు సమ్మతినొందిన సరే. లేనియెడ వానిని మా కత్తికి నెఱయిచ్చి నీకుఁ బెండ్లి చేయించెదము'' అనిరి. కాందీపుడు పరమానందభరితుం డయ్యెను.

వివాహదినంబున చక్రవర్తి కుటుంబసమేతముగ వర్త కుఁడును సౌందర్యవల్లియు దోడరాఁగా శాంతిపుర నంద వనంబుననుండు భవనంబున కేతెంచెను. రాజులందఱును వచ్చి తగుచోటుల విడిసిరి. భోజనంబులైన తఱువాత వసంతమంటపంబును జేరిరి. అప్పుడు చక్రవర్తింగని రాజు లిట్టులనిరి. ''సార్వభౌమా! తాము మము నేలువారలై యుండియు నా గౌరవంబును బాటింపక, తమ ముద్దుల కూఁతురి నొక యనామధేయుఁడగు వైశ్యునకియ్యఁ దలంపు గొంటిరి. అది పరిహాసాస్పదంబుగాని వేఱుకాదు. తమ చెల్లెలికొడుకు కాందీపునికిచ్చిన నందఱికి సమ్మతంబు'' అనిరి. ఆ మాటలు చక్రవర్తి విని సిగ్గుజెంది యేమియు మాట లాడ కుండెను. పురుషవేషంబు ధరించియుండు సౌందర్య వల్లి "రాజులారా! లోకంబునఁ బుట్టినవారలలో నెవఁడు యుద్ధంబున వెనుదీయక యుండునో వాఁడే క్షత్రియుఁడు.

వీపుఁజూపి పాఱువాఁడే వైశ్యుఁడు. జయించువాడు క్షత్రియుడు. జయింపబడువాఁడు వైశ్యుడు. నీతి యిట్లుండ నేను వైశ్యుఁడ నెట్లైతిని. నాతో యుద్ధంబుసేయక యిటు లాడుట బుద్ధిలేమి యని యెఱుంగద" ననియె.

అదివిని రాజులందఱును గోపించి "ఓరీ వైశ్యాధమా! చక్రవర్తి నీకు బిల్లనిచ్చెదనని పిలిచినందునగదా యిట్టిమదము తలకెక్కెను. నీ వేమిచేతువు? ఎవరి నెచట నుంచనగునో యటనుంచిన బాగు. లేనియెడ నిట్టివిగాక మఱి యెట్టివి పుట్టును. అందియునుంగాక నీ సామర్థ్యంబు నెదిరి సామర్థ్యంబు నెఱుంగక నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలెదవు. ఊసు కోమటికి నీకు శౌర్యమెక్కడిది. పైకము ముడువ నీకు దెలియుంగాని యమ్ములవిషువఁ దెలియునే. మాకు బుద్ధిలేదంటివి. ఎవరికి బుద్ధిలేదో తెలిపెదము. ఇదిగో చూడుము. ఈ సమయంబున నొకటే బాణంబున నీ శిరంబును దెగవేసెద" మని యందఱు నొక్కుమ్మడిని లేచి నిలిచిరి. సౌందర్యవల్లి వారినిం జూచి యలక్ష్యంబుగా నవ్వి "అయ్యా! చక్రవర్తీ! వీరివంటిభీరువుల నీభూమి నెందేని గంటిరే. వీరే సామర్థ్యులు. తాము రాజనీతి యుగంధరులైన చక్రవర్తులరుగదా. తమ రాజ్యంబున నెవడైన నొక వైశ్యుఁడు వర్తకంబు చేయవచ్చిన వానికి పిల్ల నిచ్చెద నని యాసఁ జూపిరమ్మని సేనలనుగూర్చి యాయుధంబులు

లేని వైశ్యునిపై యుద్ధంబు చేయుటకుఁ బంపుట ధర్మంబని యనుకొంటిరో. వీరలు నిరాయుధుండనగు నన్ను జంప నింద రెందుకు? వీరివలె సాయుధులై ససేనులై యుండు వారితోఁ బోరుసలుపుట లెస్సయగుంగాని నాతో యుద్ధంబు చేయుట ధర్మమే. అది యటుండనిండు. పొట్టపోసికొనుటకు పైకంబుగడించు వైశ్యులమగు మా యిరువురిపై లక్షలెక్కగల సేనలతో నెదిరించి యుద్ధంబు సేయుట వీరలకు ణంటుగాదు. మీకు పిల్లనియ్య సమ్మతియుండిన నియ్యవచ్చును. లేనియెడఁ బొమ్మనినఁ బోయెదము. అది వదలి యిట్టి మోసకృత్యంబుల నాచరించువారు గలరే. నేను మీ కుమార్తెపై నిష్టంబు గలవాఁడనుగాను. వర్తకంబు సేయవచ్చిన నన్ను నీడ్చి అచ్చబెట్టితిరి. చక్రవర్తియే వేడుకొనునపుడు ఎటుల వదలనగునని యొప్పుకొంటిని. మీరు ఇదియంతయు యోచింపక కంచమునఁగడిపెట్టి కంఠము ద్రెగవేయఁ గత్తి యెత్తినటుల నున్నది. పిల్లనిచ్చి పెండ్లిచేసెదనని నాకాసజూపి యిటకుదెచ్చి యిందఱిరాజులను నాపై నుసుకొల్పి యుద్ధంబునకు బంపుట ధర్మమే యని యడిగెను. చక్రవర్తి దయగలవాడై రాజులంజూచి, "రాజులారా! కోపింపకుడు. ఈ వైశ్యునిపయింగల కోపంబును మానుడు. నాకై వీని మన్నింపుడు. ఇపుడే వీనిం బొమ్మని నా కుమార్తెను గాందీపునకిచ్చి పెండ్లిచేయించెద" అన నందఱును గోపంబు తీఱకయే యుండిరి.

అపుడు కాందీపుఁడు కొంత యోచించి యెటులనైనను మనమే గదా! చక్రవర్తికుమార్తెను బెండ్లియాడగలము. ఈ వైశ్యునింజంపుటచేఁ గలుగు లాభంబేమి?'' యని యెంచి రాజులకు నమస్కరించి రాజన్యులారా! ఈ వైశ్య కుమారుని నన్యాయముగా జంపుటచేఁ బ్రయోజనంబేమి ? తానే పోయెదనని చెప్పుచున్నవాఁడు. భీరువగు వీనిని జంపఁ బాపంబు వాటిల్లు. వర్తకంబు సలుపవచ్చిన వీనికి పిల్ల నిచ్చెదనని చక్రవర్తి చెప్ప వీనికిఁ బేరాసపుట్టి యింతటికిఁ దెచ్చినది. అధికాశ యధికనష్టంబని వీఁడెఱుంగఁడు కాఁబోలు. కనుక వీనింజంపకుఁడు. శుభంబున నశుభమేల? మా మేనమామ కూతురిని నేనే పెండ్లియాడెద. మీరలంద ఱును నీ పెండ్లివాకిట కలహంబుచేయక నన్ను బెండ్లి కొడుకుం జేసి యక్షతలవేసి మహదానందులై విందుభుజింతు రని వేడెద''ననియె. అందఱును సౌందర్యవల్లిపైఁ గోపంబు వీడి 'సరి! మంచిది. నేటికింతచాలును. ఈ పెండ్లి జరుగ నిమ్ము. ఇక రెండుమూడు నెలలలోపల వీరెచట నుండినను వీని తలమెడపై నుండు నేమోచూతురు. వీనిని చిత్రవధ చేయక మానము'' అని శపథంబు చేసిరి. చక్రవర్తి యది విని ఊఱకుండిన నీ కోమటిపిల్లవాని కిట్టి బెడద తెచ్చి యుంచితిమే. మనముగా బిలిచి పిల్లనిచ్చెద ననినంగదా వచ్చెను. వీని ప్రాణంబుల కెసరువచ్చినది'' అని తలపోయు చుండెను.

చక్రవర్తి యభీష్టంబు గుఱు తెలిసింగి సౌందర్యవల్లి "రాజోత్తములారా! నన్ను మన్నింపుడు. నాపైఁ గినియకుడు. నేను బాల్యదశ యందుండుటచేఁ దెలియక మిమ్ము దిరస్కరించితిని. అదియొకపాటిగాఁ బట్టకుడు. స్త్రీయాశ చేటుదెచ్చునని యెఱుంగనైతిని. చక్రవర్తిమాటల కియ్యకొంటిని. అయినను ఈ పెండ్లియగు నంతవఱకు నేనిచట నుండి రాజభోజనంబుల భుజించుచు వయిభవంబులఁ గనులారఁ జూచుచుండెద"నని వారితోడ బహుజాగ్రతతో నుండి యెవరును దన్నుఁజూడని సమయంబున నల్లనలేచి బైటికివచ్చి తనతండ్రియు నన్నదమ్ములునుండు గుహ చెంతకు వచ్చెను. వారలీమెగని "అమ్మా! యిన్నిదినములుగ నీవు పోయిన కార్యమేమయ్యెను" అని విచారించిరి. సౌందర్యవల్లి. తండ్రీ! మీకు వెనుకఁదెలిపెద. నా వెంటరండని పిలుచుకొని మనుజసంచారంబులేని యొకప్రక్క యడవిని జుట్టుకొని నాలుగైదు దినములలో శాంతపురికివచ్చిరి. ఆ పురంబునుజూచి వ్రతశీలుండు నతనిపుత్రులును ఆశ్చర్యమంది అమ్మా యిదియేమి? ఇయియెంతయు శృంగారంబై యున్నది. కాని మనుజులొక్కరును లేరేయని యడుగ వెనుకఁ జెప్పెద రారండని కోటలోనికేగి తండ్రీ! యిదియే మన శాంతపురంబు. చక్రవర్తి దీనిని రాజుల కదంటికిని సామాన్యక్షేత్రంబుగా నొసంగియున్నవాఁడు. కావున వారి

వారికి నొక్కొక కోటను వేఱు వేఱుగాఁ గట్టికొని యున్నారు. నేటికిఁ జక్రవర్తికుమార్తెకుఁ బెండ్లి జరుగుటచే నొకరును లేకున్నవారు. కావున మన శాంతపురి యంతఃపురపు మేడపైనెక్కి కోటచుట్టును నిలిచి కొంతసేపు వేడుక జూచుచుండుడనియె. వారు నట్టులన మంచిదని సమ్మతించి నందనవనంబున నడచు వివాహ కోలాహలంబులను జూచుచుండిరి.

అటఁ జక్రవర్తికుమార్తె శృంగారికిని కాందీపునకును పెండ్లి వయిభవంబుగాజరిగి యందఱును నానందమున పెండ్లి భోజనంబులారగించి సుఖంబున నుండిరి. శాంతపురి జనంబులు నచటనే విందులలో సొక్కియుండిరి. సౌందర్యవల్లి యిదివఱకు నడచినవిషయంబులఁ దండ్రికిని నన్నలకు నెఱింగించి, కోటల నన్నింటిని మూసి తాళంబులు వేసి భద్రపఱచి సురంగమార్గముగాబోయి యచట సారంగపురతలుపునకు బీగంబులు వేసి కోటతలుపులమూసికొని యుప్పరిగపయి నెక్కి వారి వారిధనువులఁ వారువారు జేతంబట్టి యుద్ధసన్నద్ధులై నిలిచిరి.

అపుడు సౌందర్యవల్లి చక్రవర్తికొక జాబువ్రాసి యందు సకల సంగతుల నెఱుకపఱచి, దానిని దేవాస్త్రంబునఁ దగిలించి యేసెను. అది చక్రవర్తి మునుముందఱ జాబుతో నేలవ్రాలెను. చక్రవర్తి చదివిచూచి యదరి

పడి "ఓహో! యిదేమి యాశ్చర్యము. వచ్చినది వ్రత శీలుని కుమార్తెయట. ఆమె మగవేషంబు ధరించి వచ్చి యుండుటను మనము కననైతిమి. ఇకపై వారు తమ శాంతపురి యంతఃపురంబుననుండి యుద్ధంబుసేయ సిద్ధులై యున్నవారట. ఇక జేయునది యేమి? యని దుఃఖించు చుండెను.

రాజులు "మహాప్రభో! తామిందులకై భయంబు నొందకుడు. ఆ వ్రతశీలునకు రథగజతురగపదాతు లొక్క టియు లేదు. మేమిందఱము జేరి యుద్ధంబుసేసిన వారెంత మాత్రము. భయంబునొందకుడు" అని మనోధైర్యంబు సెప్పి యందఱును వారివారి సైన్యంబులతో వచ్చి చుట్టు ముట్టిరి. పురవాసులందఱును యుద్ధరంగంబున నుండరా దని వారివారి యిండ్లకేగి తలుపుల మూసికొనిరి.

ఇదియంతయు జూచిన సౌందర్యవల్లి కలకలనగి తన చేతనుండు ధనుస్సున నొకయాగ్నేయాస్త్రమును దొడిఁ విడిచెను. అది భయంకరమై మిడుగురులఁ గ్రక్కుచు సేనలపైబడ, వారిగుండెలు తటతటమని కొట్టుకొనఁ బరువిడ సాగిరి. వ్రతశీలుండు నతనికొడుకులును ననేకాస్త్రంబులఁ బ్రయోగించిరి. అవి రాజుల కందఱికిని వారిసైన్యంబుల కును కాళ్లు సేతులు ఆడక దహింప, తాళఁజాలక కోటలకు వచ్చిచూడ నవి తాళంబులు పడియుండెను. గృహంబుల

కేగ నవియు మూసియుండెను. ఇక నేమిచేతురు? నేటితో దీరెనని యనుకొని పరువెత్తినను అస్త్రంబులు విడువక వారి నింజంపెను.

చావగా మిగిలినవారు ఆ దేశంబునువదలి మఱు దేశంబున కోడిరి. ఆ పురంబున నొక రాజైనను లేక యందఱును బెదఱియుండిరి. అందఱును బోయినందున వ్రతశీలుఁడు తన బిడ్డలతో దిగువకుదిగి, యచటనుండు బలిష్ఠమైనకోటలంజూచి సంతసించి, యా శాంతపురినుండు వారిలో బాండిత్యంబుగల వారిని యుద్యోగస్థులుగను శూర త్వముగలవారిని భటులుగా నియమించికొని సుఖరాజ్యంబు సేయుచు వారి పగవారినందఱిని జయించి కైవశంబుచేసి కొని చక్రవర్తినిగూడ సామంతరాజుగా జేసి యందఱు కప్పంబులుగట్ట మహావైభవంబున నేకచ్ఛత్రాధిపతియై తన భార్యల బంధుజనంబుల దోడిదెచ్చి సుఖంబుననుండెను" ఇంతటి సామర్థ్యంబు చేసినది యొక స్త్రీయేగదాయని మనో రమచెప్ప మదనవల్లియు మనోరమయు నగరునకు వచ్చిరి.

ఇరువురు పురుషులను గట్టికొనుట, కోమలవల్లి కిష్ట మగుటచే రాజునకు నిష్టంబుగ నుండెను. అందఱును భుజించి సుఖనిద్రం జెందిరి. మఱునాడు సూర్యోదయంబు నకు రాజు మేల్కని కాలకృత్యంబుల నెఱవేర్చి కొలువునకు వచ్చి రాజజ్యోతిషునిరప్పించి, యొకశుభముహూర్తంబున

కల్యాణమంటపమేర్పఱచి పందిళ్ళువేయించి, పురుషవేష ధారిణులగు మదనవల్లి మనోరమలకు నలుగులు పెట్ట ముత్తైదువలు రమ్మనిరి. వారలిరువురును సమ్మతింపక "మాకులాచారధర్మంబుమేరకు సమ్మతింతు రేని పెండ్లి చేసి కొనెదము" అనిరి. వారలాశ్చర్యమంద "మంచిది! మీ కులధర్మమేమని" యడిగిరి. పురుషులు నలుగిడుకొనుట లేదు. స్త్రీలకుమాత్రమే నలుగులిడుట వస్త్రాభరణాద్యలం కారంబులు. స్త్రీని నలంకరించి తెచ్చి పెండ్లిపీటపయి కూర్చుండబెట్ట మేము మా చేతులతో మాంగల్యంబుగట్టి భార్యయనితీర్మానింతుమని మనోరమ చెప్పెను. వారు కొంత వడి యాలోచించి, లోకోభిన్నరుచిః" అని తీర్మానించికొని వారి యిష్టప్రకారమే సమ్మతించిరి.

అంతఃపురంబున చెలులు కోమలవల్లికి నలుగుబెట్టి మంగళస్నానంబు చేయించిపెట్టి వస్త్రాభరణంబుల నలంక రించి పెండ్లిపీటపయిఁ గూర్చుండఁబెట్టి పురుషవేషధరులగు మనోరమా మదనవల్లులను బిలచుకొని వచ్చిరి. పెండ్లి యందు జరుగవలసినక్రమములన్నియుఁ దప్పక జరిపిరి. వేదవేత్తలగు బ్రాహ్మణులు అక్షతలంజల్లి యాశీర్వదించి మంగళసూత్రంబు నిరువురిచేతుల నిచ్చిరి. ఇరువురును కోమలవల్లికంఠంబున మాంగళ్యంబును గట్టి సంతసించిరి. వచ్చినవారలందఱును విందులభుజించి వారివారిచోట్లకేగిరి.

ఆ నాటిరాత్రి పడకగదినెంతయు ముచ్చటగా శృంగా రించిరి. మనోరమయు మదనవల్లియు నందు శయనించి యుండిరి. కోమలవల్లి రత్నాభరణభూషితురాలై భక్షణం బులగొని రాత్రి పదునైదు గడియలకు వచ్చెను. అపుడు మనోరమయు మదనవల్లియు నవ్వుచు "కామినీ! లోకంబున నొక పిల్లకు నొకమగఁడు సుఖమొసంగునని వినియెదము. నీవు మహా అదృష్టవంతురాలవు. పుణ్యశీలవు. లేనియెడ నిద్దఱు మగలు ప్రాప్తింతురా? అనిరి.

కోమలవల్లి:—ప్రాణపతీ! నాకైన నిరువురుమగలు ప్రాప్తిం చిరి, ద్రౌపదికి నేవురని మీరు వినలేదా?

మనోరమ:—పిల్లా! ఆద్రౌపది నిజపాతివ్రత్యలక్షణ మెవరి కినిరాదు. ఏవురను గట్టికొన్నను సంవత్సరమున నొకతూఱి యగ్నియందు స్నానంబుచేసి మఱియొక పురుషునితో సుఖించునట. ఇటులనే యామె వయ సగునంతవఱకు జరుగుచుండెనట. దాని నామె మహాపతివ్రతయని చెప్పుకొనెను.

మదనవల్లి:—అన్నా! మన యదృష్టమునకు దగినటుల నీ రాజకుమార్తె మనకు భార్యయయ్యె ననినను మనల నిది వంచించి యన్యులపయి నాసగొని వ్యభిచరించు నేని నేమి చేయగలము.

మనోరమ:—తమ్ముడా! నీవుచెప్పునది యాశ్చర్యమైయున్నది. మన మిరువురము కావలియుండ మనల వంచించి యింకొకనితోఁ జేరునని సందేహింతువేని కొలగానికి తలారులు కావలియుండునటుల ముందు వెనుకల నుందము.

మదనవల్లి:—అన్నా! స్త్రీల వ్యభిచారంబును అడ్డగించు వార లెవరు?

కోమలవల్లి యదివిని దుఃఖంబునంది "తాము నన్నిటుల నవమానకరముగా పరిహాసించుట న్యాయంబుగాదు. నేను మిమ్ములను నా ప్రాణనాథులని భావించి వలపుతో నుండ మీరలిట్టి మనసువిఱుగుడు మాటల నాడెదరు." అని వ్యసనంబుదోపఁ జెప్పెను. ఆ మాటలనువిని మనోరమ "నాయకీ! లోకంబునఁబుట్టిన భామినులను నమ్మిచెడిన వారలనేకులు గలరు. అయినను వారిలో,

ఉ॥ అంగన కైక మాటలను ♦ నాలన సేసి యజాత్మజుండు చ
చ్చెంగద సీతమాటవిని ♦ శ్రీరఘురాముఁడు గోలు బోయె నా
లింగద చెల్లెమాట విని ♦ లేవడి యయ్యెను రావణేశ్వరుం
డంగన మాటలన్ వినుట ♦ యాపదసుం బెనుబాట చూచినన్.

అను నటుల భామినులవలననే పురుషులకు పలు విధంబులైన యవమానంబులును నపాయమును నాపదలును నంభవించి దుఃఖమనుభవించెదరు; కనుక నీకడనమేము

నిజమైన వర్తమానంబు నెఱింగింప సంకోచించెదము. నీవు మర్మంబుదాచక బయలుపెట్టితివేని మేమేమి చేతుము.

కోమలవల్లి:—ప్రాణనాయకా! అటుల మీరెన్నటికిం దలంపకుడు. మాంగళ్యధారణంబుసేసిన పురుషునే భగవంతునివలెఁ జిత్తంబున మతించియుండువారలే పతివ్రతలగుదురు. అయినను పురుషులు మాత్రము స్త్రీల నలక్ష్యంబుగా జూచి తమ మనంబులనుండు రహస్యంబులఁ జెప్పరు. అటుల జెప్పిన బురుషులచే నసాధ్యంబులగు కార్యంబులఁజేసి ముగింతురు. ఈ గుణము పురుషులకుండదు. వారు స్త్రీలమాటయన నలక్ష్యంబుగనే యుందురు.

మనోరమ:—పురుషులు స్త్రీలపయి మిగుల ప్రియముగలిగియే యుందురు. అయినను వారికి బుద్ధిలేమియను నొక యల్పగుణము కలదు. దానిచే వారలందఱికిని నలక్ష్యముగా గనంబడుదురు. వారలు కొంచెమునకు గొంచెము అల్పసంతోషమును అల్ప దుఃఖమును గలిగియుందురు. వారికడ మంచిసమాచారము చెప్పినను అన్నిటిని జెడుదిగానే భావింతురు. కనుక స్త్రీలతో రహస్యమైన సమాచారంబుల జెప్పరాదందురు. అటులఁ జెప్పితిమిపో తలపోవు నట్టి యాపదమూడును. మేకతలను దొంగలించిన

వానిని మనుజునిజంపి వచ్చినాడని కలహంబుపెట్టిన కథవంటిదగును. అందువలన వివేకులు భార్యయొద్ద నెట్టి సమాచారమును జెప్పుటలేదు. నీవట్టిదానవు గావని యెఱింగియు నీ యభిప్రాయం బెఱుంగగోరి యిటుల నంటిమి. వగవకుము. మేమును నీవలె స్త్రీలమే. మన పురుషుడు వానవాసియైపోవుట చేత మేము పురుషవేషంబు ధరియించి, వెదకికొని వచ్చితిమి. నీ యిష్టప్రకారము పెండ్లి చేసికొంటిమి. ఇక మన పురుషుని బిలుచుకొని వచ్చి మనము సుఖభోగంబుల నుందము. నీ యిష్ట మేదియని యడుగ కోమలవల్లియు నట్టులన కానిమ్మని నమ్మతించెను. అందరు సుఖనిద్రం జెందిరి. మఱుదినము మనోరమయు మదనవల్లియు రాజునొద్ద సెలవు తీసికొని నగరునువదలి యరణ్యమార్గంబుగాఁ దమ ప్రాణనాథుని వెదకికొని పోయిరి.

ఇది యటుండ నడవులకు వేటకేగి పరిజనంబులవదలి యరణ్యంబుల నేకాకియై తిరుగుచుండిన మనోరమావల్లభుఁడు నీతిప్రకాశుఁడు తనకు మంచికాలంబు తటస్థించి సుఖంబుండతలయుటం జేసి, యూరూరు తిఱిగి యందలి విచిత్రంబులంగనుచు దివ్యదేశంబుల సేవింపుచు వచ్చి వచ్చి యలకాపురి సత్రంబున నిలిచెను.

మనోరమ, మదనవల్లి, కోమలవల్లియను నీ ముగ్వు రును పురుష వేషధారిణులై నవరత్నాభరణభూషితులై వెలిపట్టు పుట్టంబులంగట్టి నీతి ప్రకాశుని వెదకికొనుచు నర ణ్యమార్గంబున వచ్చునపుడు తమ కొకపర్వతం బెదుట దోచెను. ఆ పర్వతమునకుఁ బ్రక్కగా బోవునపుడు తన సోదరీమణులంజూచి, చెల్లెలారా! యిచట నొక చిన్నది యుండెను. దానినిం దోడుకొని పోదము రండని చెప్ప నందఱును సంతసించి యటకేగిరి.

వీరినింజూచినదే యంబుజవల్లి మదిదిగులొంది యట్టులే మ్రానువలె నిలిచెను. మనోరమ దానిభయంబుఁ దీర్చి "సుందరీ! నీ వెందులకును భయంబునొందకుము. నీ దేశంబునకుఁ గొనిపోయి చేర్చెదము. రమ్ము" అని ధైర్యంబుచెప్పి యందఱు నలకాపురికై పోవుచుండిరి. వీరు వచ్చుటనుజూచిన యా నగరవాసులందఱును నచ్చెరువంది మన రాజపుత్రి అంబుజవల్లి యిదో వచ్చుచున్నది. ఈ పురుషు లెవరై యుందురోయని యొకరికొకరు గుసగుస లాడిరి. మనమెన్నడైన నిట్టి సుందరపురుషుల గనివిని యుందుమే. వీరలు నరులై యుండరు. సురసిద్ధసాధ్య విద్యాధరగణంబులలో నొకరై యుండవలయు. విలా సార్థమై వీరలు భూమికి వచ్చినటుల నున్నది. లేనియెడ నిట్టి తీరు నర కీటకంబుల కెక్కడిది" అని కొందఱు దగ్గ

ఱించియు మఱికొందఱు మేడలనెక్కియు తెప్ప్రవాల్పక చూచుచుండిరి.

వీరు ముప్వురును వీరిమాటలం బెడచెవిని బెట్టిన వారివలెవినుచు మదిసంతసింపుచుఁ బోవుచుండిరి. నగరి మోసలకువచ్చి తమ్మెఱింగించిరి. వీరి ముఖవిలాసంబునకు రాజు ఆనంద పరవశుండయ్యెను. తోడనున్న యంబుజ వల్లినింజూచి పెన్నిధింగన్న పేదచందంబున నోటమాట రాక యట్టె యుండెను. చెలికత్తెలీసంగతిని రాణి కెఱుంగ జెప్పిరి. రాణి జనానాధర్మంబుల నటు గట్టిపెట్టి లేగనుగన్న యావువలెఁ బాఱివచ్చి యంబుజంబును నిండు కవుంగిటం జేర్చి శిరంబు మూర్కొని ముద్దిడి "అమ్మా! మమ్ము విడ నాడి నీ వెటులుంటివే? ఒంటరినుండుకాలమున నెటులెటులఁ బరితపించితివో? రాజపుత్రివయ్యును నీకిట్టి కడగండ్లు వచ్చెను గదా" యని గోడుగోడున దుఃఖంచెను. దగ్గఱనున్న దాదు లామె నోదార్చిరి. ధయిర్యంబు సెప్పిరి. ఆమె కొంత వడికిఁ దెలివిరాఁగా వారికి నుపచారంబులమర్చి సుఖభోజ నంబు లాచరించిరి.

అపుడు సత్రంబుననుండిన నీతిప్రకాశుఁడు తన విధి వశంబును దలంచుకొని యేడ్చుచుండెను. సత్రంబున నిదు రించుచుండిన యొక మూర్ఖుఁ డతనిం గసిదీఱ వీపులబాది "ఓరీదయ్యమా! నిద్రపోవువానివలె కూఁకలిడుచున్నావేమి

టిరా. ఎఱుకమాలినకుక్కా! నీకేమి తిక్కా? యని పలు విధంబుల దూషించెను. నీతి ప్రకాశుఁ డదివిని సహింప లేక వానినొకగ్రుద్దు గుద్దెను. ఇరువురకు బాహాబాహిని కేశాకేశిని యుద్ధంబు వాటిల్లెను. తలారులెదుటఁబడివారి యిరువురి యుద్ధంబుల నిలిపిరి. రాజు సమ్ముఖంబునకు గొని తెచ్చిరి. సుందరప్రకాశుఁ డిదియేమియని వారినడిగెను. అపుడు నీతిప్రకాశుఁడు రాజా! నేను మణిపురేశ్వరుండను. నీతిప్రకాశుండను నామధేయంబుగలవాఁడ. దైవప్రాతి కూల్యంబున రాజ్యంబును వదలి యేకాకినై తిరుగుచున్న వాఁడ. నాపాటుల నన్నింటిని దలంచుకొని నాయంత నేనేడ్చుచుండ వీఁడెక్కడివాఁడో. వీని యబ్బపుట్టి మునిగి నటుల నన్ను వీపునజఱచి నోటికిరాని తిట్టుల నిష్కారణం బుగాఁ గొట్టెను. నేనును వానినిం గొట్టితిని'' అనియె. దగ్గఱ మగవేషంబు ధరించియుండు మనోరమ యీ మాట లను విని తెప్పునలేచి నిలువంబడి ప్రాణనాథా! తమకు నిట్టి విపత్తువచ్చెనేయని దిగువంబడియె. అందరు నిది యేమియని దిమ్మరెందిరి. మదనవల్లి మనోరమకు శై త్యోపచారంబులు సేయ తెలివినందెను. అలకేంద్రుఁ డిదియేమి యని యడిగె. ఆమె మొదటనుండి కడవఱకు జరిగిన వృత్తాంతము నంతయు విడువక చెప్పి వీరే నాప్రాణ నాయకులు'' అని చూపెను. వీరిని వెదకికొని వచ్చునపుడే

యీ సుందరులనందఱిని నేను బెండ్లియాడుటచే వీరికే వీరలందరును భార్యలు కాఁగలరనిచెప్ప నాయకులకేంద్రుఁడు నమ్మతించి సకలదేశాధీశ్వరులను మనోరమ వదలివచ్చిన కామినులను రప్పించి వారితోడఁ దనకూతు నంబుజవల్లి నొసంగి వరుసక్రమంబునఁ బెండ్లి జరిపించి యల్లున కర ణంబులిచ్చి నిజపురికిఁ బంపెను.

నీతిప్రకాశుఁడు నిజకాంతామణులతో మామలకడ సెలవంది కొన్నిదినంబులకు నిజపురంబునకు వచ్చుచు మును ముందు దూతలనంపి తమరాక దెలుప మంత్రి ప్రధానులు పురంబలంకరించి ప్రజలు పరివారంబులతో నెదుర్కొనిరి. రాజు శుభముహూర్తంబునఁ బురంబును ప్రవేశించి, మహేంద్ర వైభవంబున నెల్లరాజులం గ్రిందుసేసి మహదా నందంబున నోలలాడుచుండెను.

సీ॥ ఆయమూఁ గల్గి ధైర్యముల • నందక యందఱిఁ దన్నుఁ బోలెనే
స్థాయిత బుద్ధితోఁ గనుత • మాశ్య కృపానిధి నాగవేదు నా
రాయణ సామి నందనుఁడు • గ్రంథసుశోభితుఁ డాది శేష శై
లాయత నాథు సత్కృపను•నార్యులు మెచ్చ మునీంద్ర నాముఁడై॥

క॥ మునిసామి మొదలి యారిది
తెనుఁగున రచియింపు మన్నఁ దెలిపితిఁ గొంతన్ •
ఘనులార పూని చదువుడు
మనోరమ మనోరమగదె మదినిడి చదువన్॥

క॥ ధనకనక వస్తు వాహన
ఘనకీర్తి సుపుత్రభాగ్య • గాములు నగుచుం
దనరుదు రారోగ్యంబుం
బెనసి ఫణీంద్రాద్రి నాథు • ప్రియులై నయులై॥

మాయారాక్షసుని జయించిన మనోరమకథ

సంపూర్ణము.

